పురాణవైర గ్రంథమాల - 8

# పురాణవైరగ్రంథమాల

గ్రంథకర్త
కవిసమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ




పబ్లిషర్సు
ఉమా పబ్లిషర్సు
విజయవాడ — విజయనగరం.

# పురాణ వైర గ్రంథమాల పీఠిక

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయబడుచున్న పదునాలు నవలలు. ఏనవల కానవలే. పదునాలింటను కలిపి ఒకటే కథయుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను, అది ప్రధానము కాదు. కాని ఈనవల లన్నింటికి కలిపి పురాణవైరమన్న శీర్షిక ఎందులకు? పురాణవైరమన్న పే రెందులకు?

ఈవిషయము ఈనవలలలో నచ్చటచ్చటపరామర్శింప బడును. మనకు వేదశాస్త్ర పురాణేతి హాసములు గలవు. వానిలో పురాణమున్నది. పురాణమనగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవారన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజ వంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణముల యందుండును. సర్గమనగా మొదటజరిగిన సృష్టి లక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూప మెట్లుండునో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును. అప్పుడు మరల సృష్టి జరుగును. దానిపేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెరువునకు స్నానమునకు పోయినప్పుడు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగగా, దానిని తన చెంబులో తీసు కొని వచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈ చెంబు చాలుట లేదనగా పెద్దపాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్ర ములో బడవేయదగినంత దయ్యెను. ఆచేప ఆ మనువుతో కొలది దినములలో సముద్రములు పొంగి భూమి మునిగి పోవును. లోకములో నున్న జీవరాసులలో ఒక్కొక్క జీవ

రాశి కొక్కొక్క వ్యక్తిగా తీసికొనివచ్చి నాపైన నెక్కుము. ప్రళయాంతమున మరల సృష్టిని నిలుపుదువుగాని అని చెప్పగా నతడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనగా మహత్తు అహంకారము మొదలగు వాటినుండి మరల సృష్టి జరుగ లేదు. మహదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము. తత్పూర్వమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి వానినుండి మరల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో 'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాడు ఒకయోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసుకొని వచ్చినట్లు దాని వలన మరల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పబడినది. అది ప్రతి సర్గము. సర్వ విద్యలు సర్వజ్ఞానము యితరదేశములకు భారత దేశమునుండియే వెళ్ళినవి. అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలు లోని కథ యొకభాగము. మూడవది మన్వంతరములు. కృత త్రేతాద్వాపార కలి యుగములు నాల్గు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో నప్పుడు మహా ప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ? పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ? అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించు చున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందు గల సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణము లలో నున్నవి. అనువంశములనగా వారినుండి కలియుగములో వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇది నేడు చరిత్ర యను పేరున కాలేజీలలో పాఠశాలలలో చదివింపబడు విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము

చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ మం తయు తారుమారైనది. ఈయన గుప్తచంద్రగుప్తుడు గాని మౌర్యచంద్రగుప్తుడు గాడు. మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినాడు. నేపాళరాజవంశ చరిత్రము సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తు డనుటతో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్యచరిత్ర కారులు ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు. మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థులచేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రముగ నెఱుగగోరువారు భారతచరిత్ర భాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంక టాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదు వేల ఏండ్లక్రితముజరిగిదని తెలిసికొనగోరు వారు, నడింపల్లి జగన్నాథరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్యకాల నిర్ణయములను చదువవలయును. రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయబడి నవి. ఆ గ్రంథములు గ్రహములయొక్క చారము, వాని ...లు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమింది పాశ్చాత్యులుదిద్ది పాడు పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందు ...క్కరము, బౌద్ధులయొక్కయు వ్రాతలను పరిహసించి

దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించిన వాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్యచరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యందభిమానముగల మాక్సుముల్లరుకూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది, Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షిమండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాండ్రకోటస్ గుప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీలెక్కయుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని తెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందు విశ్వాస మిట్టిది.

ఆలెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనకు పాశ్చాత్యులు తారుమారు చేసిరి. ఆ కాలము అనగా షుమారు మూడు వేలఏండ్ల కాలము. మహమ్మదు గోరీ వచ్చువఱకు "మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవక తవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్నమిది.

అందుచేత దీనికి 'పురాణవైర'మని శీర్షిక ఏర్పరుపబడినది.

# 1

# పులిముగ్గు

## ౧

ప్రొద్దు నడిమింటికి వచ్చినది. మోఁకాటిలోఁతు గడ్డిలో వా రిరువురు యోజనముమేర నడచిరి. అచటినుండి నిర్జనమైన నిర్ఘాసమైన ధారుణి. ఒక చోటికి పోవలయునని సూటి బెట్టి కొని పోవలసినదేకాని మార్గ మనునది లేదు. వా రెదురుగా నున్న చిన్న గుట్టను సూటి పెట్టికొని పోసాగిరి. కొంతదవ్వు పోయినతరువాత వారొక యేటి కడుపులో నడచుచుండిరి. అది యంతయు నిసుక. నడుమ నెక్కడనో సన్నఁగా సీల మండల లోఁతు ప్రవాహము బారెడుపొడుగున సాగుచున్నది. ప్రవాహమున కిరుదెసల నంటియున్న కొంచెముమేర యిసుక తడిసి యున్నది. అది వట్టి యిసుకకాక కొంత మట్టితోఁ గలసి యుండుటచేత చిక్కఁగా నున్నది. ఆ చిక్కని స్థలమును వారు ప్రవాహము పొడుగున చాలమేర పరిశీలించిరి. వారి కేమియు గుర్తులు కనిపించలేదు. మఱల గుట్ట కభిముఖముగా బయలుదేరిరి. కొంత దవ్వు చనినతగువాత ముండ్ల పొదలు బహుళముగాఁగల చిట్టడవిలోఁ బ్రవేశించిరి. ధాత్రియంతయు నెగుళ్ళు దిగుళ్ళుగా నున్నది. ఒకచోట చెరువుకట్టవలె లేచిన నేలపరుపు కొంత దవ్వుపోయి మలుపుతిరిగి లోన చెరువు కడుపువలె బయట నొక సెలయేటి పడకవలె భాసించు

చుండెను. వారు గట్టెక్కి చూచిరి. లోన చెరువు లేదు. ఇరుదెసలఁ బరిశీలించిరి. ఏ మృగమునుఁ గనిపించలేదు. మిడి మెండవేళ మృగములు సంచరించునా? కట్టకు వెలిభాగమైన వాగు పడకవంటి దేశమునఁబడి వారు పోసాగిరి. పోఁగా నది నిజముగా వాగు పడకయే అందందు బురద కొంత యిసుక మిగిలిన నీళ్ళు. అట్టి స్థలముల ప్రక్కగాఁ బడి పోసాగిరి. ఇంతలోఁ పైనుంచి వచ్చు నొక చిన్న నది వారి కడ్డము తగిలెను. దానిని దాటవలయును. వారు సర్వదా వన మృగములయొక్క కాలిగుర్తులకోసమే వెదకుచున్నట్లుండెను. తమ వైపుననున్న నదియొక్క యొడ్డు మఱలఁ బరిశీలించిరి. సివంగి, చిఱుతపులి. దుప్పి, లేఁడి, నక్క, ఎలుఁగుగొడ్డు మొదలైన జంతువుల కాలి గుర్తులే కనిపించినవి. కాని మఱి యొండు కనిపించలేదు. ఆ నది తరణయోగ్యమని రెండవ వాఁడు చెప్పినను రాజవేషధారియైన ప్రథముఁడు నదియొక్క యొడ్డునుఁ బట్టి యెగువకుఁ బోవుటకే నిర్ణయించెను. ఆ నది కొంత దూరాన నొక పర్వతమునుండి వినిర్గమించినట్లు తోచుచున్నది. నదియొక్క వెడల్పు కొద్ది దగుటచేత నా పైన నెచ్చటనో నది లంఘించుటకు యోగ్యమైన వెడల్పు కలిగి యుండునని యాతని యుద్దేశ్యము. కానిచో నా ప్రవాహము రెండు శిలలనడుమ చొర బడి దూసికొని వచ్చుచున్నచో నీ శిలమీఁదినుండి యాశిలమీఁదికి సులభముగా లంఘించవచ్చును. అట్లు దాటినను రెండవయొడ్డునుఁబట్టి వెనుకకు రావలయునేకదా. పోవలసిన దెదురుగానున్న గుట్టవద్దకు. రాజపురుషునియొక్క

భావ మెట్లున్నదనఁగా వెదకుచున్నది యొక మృగముకొఱకు. ఆ మృగముయొక్క పదచిహ్నములకొఱకు. అది యడవి మృగము. ఒకచోటతిరిగి మఱియొకచోట నేల తిరుగదు ? మున్ను చూచినపు డెదురుగానున్న కొండమీఁదఁ గనిపించ వచ్చును. ఆయడవియంతయు తిరుగునుకదా. రెండవ వాఁడు వనచరుఁడు. కిరాతుఁడు. అతనికి రాజపురుషునిమాట కాదనఁగల శక్తిలేదు. నది కెగువగాఁ బోసాగిరి. అదియొక కొండ నొరసి ప్రవహించుచున్నది. ఆనది కొండమలుపు తిరిగి యిట్లుసాగినది. కొండమలుపు తిరిగినంతనే మఱల నాపైన నెంతయో ప్రవాహముకలదు. ఆనది నచ్చట తరించుట సులభముకాదు. ఒకనది యొక కొండనొరసి ప్రవహించుచున్నపుడు సహజముగా లోతుకోయును. ప్రవాహము సమప్రదేశమునందు సూటిగాఁబోవునపుడు ప్రవాహము యొక్క క్రిందిభాగము సమముగానుండును. మలుపుతిరిగి నపుడు తిరిగినచోట లోతు కోయును. ఇది ప్రవాహలక్షణము. అచట నేఱుదాటుట సుకరముకాదు. అట్టి స్థలములయందు ప్రవాహమునకు నధికవేగ ముండును. ఱాల్లొరసి ప్రవహించుటచేత ప్రవాహోపరిభాగము తీవ్రతరంగ దృశ్యమానమైయుండును. అడుగుననున్న యెగుడు దిగుడు రాళ్ళచేత కదల్చబడిన నీరు పైన తరంగములుగా రూపు కట్టును. కిరాతుఁడు నది నచ్చట తరించుట కంగీకరించ లేదు. రాజపురుషుఁడు తన ధరించిన యుడుపులు కొలచి దిగుట కారంభించెను. కిరాతుఁడును సిద్ధపడెను. ఆనస్త్రములు వామహస్తమున గ్రహించి వేగముగల యా ప్రవాహ

మును నొంటిచేతితో నీదుటకు సిద్ధపడిన యీ రాజపురుషుని సాహసమునకుఁ గిరాతుఁడుకూడ నివ్వెఱపోయెను. ఇతఁడు భోగి. పట్టుపరుపులమీఁద బ్రతికినవాఁడు. ఇతనికింత సాహసమేమి? అనుకొనెను. కాని వానికి తెలియనిది యీ పురుషుఁడు మహాసేనాధిపతియన్న విషయము నదీతరణము చేసిరి. రాజ పురుషుఁడు సులభముగా నా ప్రవాహమును దాటెను. కిరాతు నకు బరువయ్యెను. అతఁడుగనుక దాటగలిగెనుగాని మఱి యొకఁడు దాటలేఁడు. రాజపురుషునిమీఁద వానికిఁగల గౌర వము పదిరెట్లయ్యెను. అతఁడా నది నంత సులభముగా దాటెను. అచటినుండి మార్గోపదేష్ట కిరాతుఁడుకాక రాజ పురుషుఁడే యయ్యెను. తొలుత నదిని చూచినవేళ నచటి కెదురుగానున్న కొండకుఁ బోవలయునని వారు బయలుదేరిరి. రాజపురుషుఁడిపు డింకొకచోటికి దారితీయుచుండెను. ఆ రాజ పురుషునకుఁగూడఁ దా నెచ్చటికి పోవుచుండెనో తెలియదు; గ్రుడ్డిగ్రవేటుగాఁ బోవుచున్నాఁడు; తనంతట తాను పోవు చున్నాఁడా? ఆలోచించి పోవుచున్నాఁడా? ఆలోచన యత నికి తెలియకుండ జరుగుచున్నదా? ఏదో పూర్వ జన్మ సంస్కారమొకటి బలవత్తరమై యతని నామార్గమునఁ దీసి కొని పోవుచున్నట్లున్నది; ఆ రాజపురుషుఁడు పూర్వ మడవు లెఱిగినవాడు; గుట్టలెక్కినవాఁడు; వాగు లీదినవాఁడు; నేఁడు మహాసేనాధిపతియైననుఁ దన చిన్నప్పుడు గిరివ్రజ రాజధానికి వచ్చినప్పుడు సామాన్య సైనికుఁడుగానే వచ్చెను; తనపరాక్ర మముచేత, తన ధీశక్తిచేత, తన నేర్పుచేత తాను పైకి చ్చినవాఁడు; పైకి రావలయునని వచ్చినవాఁడు; అదియొక

పనిపెట్టిలోని మగధరాజ్యమునం దుద్యోగము సంపాదించిన వాఁడు; కడచిన యిరువదియేండ్లుగా మగధదేశమంతయు దిరిగినవాఁడు; సైన్యములను నడిపించి యతఁడు చూడని మగధదేశ ధారుణీభాగములేదు; అతఁడు మున్నెఱుఁగనివి రెండు మూఁ డిట్టి ప్రదేశములే కలవు! ఇవి యడవులు; వన్య మృగములు సంచరించు ప్రదేశములు, శబరుల గూడెములు కూడ లేనిచోట్లు; అట్టియడవి రాజ్యమునందలి కాంతా రములమీఁద నధికారియైన మంత్రియేకాక తత్ప్రదేశము నందలి యటవీ పరిరక్షకులుకూడ సామాన్యముగాఁ జొచ్చి చూడని ప్రదేశములు; ఆ ప్రదేశములో నా రాజపురు షుఁడు నిర్భయముగా మున్నెఱిఁగిన మార్గమువెంట నడచు చున్నట్లు పోవుచుండెను; కొంతదూరము పోయినతరువాత వానికి జలవిహంగారావములు మింట సంచరించు రామ బంధులు, వనజంతువులయొక్క ధ్వనులును వినిపించెను; కిరాతుఁ డచ్చోట నొక పెద్ద తటాక ముండవలయునని యను కొనెను; ఆతటాకము సమీపమునందే యున్నదిగాని వారి కిని దానికిని నడుమ దట్టములైన పెద్ద వన్యవృక్షములు పెరిగి యుండుటచేత వారికిఁ గనిపించుటలేదు; వా రా తటాకమును సమీపించఁగా నొడ్డునందుఁ బరుండి విశ్రాంతి తీసికొనుచున్న మొసళ్ళు కొన్ని నెమ్మదిగా చెరువులోనికి ప్రాకిపోయెను; చెరువులో మత్స్యము లెగురుచుండెను; ఒక్కొక్కటి పెద్ద మీను; ఇది నిర్మనుష్యమైన ప్రదేశము; పూర్వము మను ష్యుఁడీచోటికి రానేలేదు; చెరువు దడిసియుండెను; బహు వన్యమృగములయొక్క కాలిగుర్తుచేత నెడము లేకుండ

నిద్దఱును పులి కాలిగుర్తులకొఱకు వెదకిరి; అవి సమృద్ధిగాఁ గలవు. ఒకచోట త్రొక్కిడిగా మొసలి కాలి గుర్తులు పులి కాలి గుర్తులు కనిపించెను. ఏదో పులి నీటికొఱకు చెరువునకు రాఁగా దాని నొక మొసలి పట్టుకొనఁ బోవుట జరిగియుండును. అవి రెండును యుద్ధమాడిన మేర విస్పష్టముగాఁ గనిపించుచుండెను. పులి తప్పించికొనియే పోయెను. మొసలి దానిని నీటిలోనికి లాగిన జాడ కనిపించుటలేదు. పోరుకూడ మిక్కిలి ఘోరమైనది కాదు. పులి నెత్తురుకూడ కనిపించలేదు. అది మహా తటాకము. తటాకమున కావైపున పెద్ద పెద్ద కొండలు. ఈ తటాక మీఁదికొని యావైపున కెవరు పోదురు. ఈదుటకు దిగినచో మొసళ్ళ కాహారమగుటయేకాక ప్రయోజన ముండదు. వా రాచెరువునొడ్డునఁబడి దాని పొడుగంతయు సంచరింప సాగిరి. ఆ చెరువునొడ్డు అర్ధచంద్రాకారముగ నున్నది. దాని తటమంతయు మహోత్తాల భూమిరుహజాల సమాలంబితమై యుండెను. ఒకచోట తటవృక్షములకు ఫలమునకు దవ్వులేదు. చెరువులోనికే వృక్షములు చొచ్చికొనియున్నవి. ఆ వృక్షముల వెనుకఁ దటాక మున్నది; తటాకములో వృక్షము లున్నవి; చెట్ల సందుగా నా తటాక జలభాగములు గనిపించు చున్నవి; అచటి నీరు కచ్చరమై యున్నది; పసిమి పచ్చగా నున్నది; నిస్తరంగముగా నున్నది; తటాకమొడ్డు పొడుగునను వారు పరిశీలించిరి; ఆ చెట్లలోనికిఁబోయి పరిశీలించ వలయును; నీటిలోనికి దిగి పోవలయును; ఆ ప్రదేశమునందు మొసళ్ళు లేవు; అచటఁ దటాకము లోతులేదు; దిగి

పోవలయును; కశ్మలమైన యా నీటిలో దిగవలయును; నీటిపైన పట్టిన పచ్చని చేప(గుడ్లు నీటిలోదిగినచో మోకాటి వఱకు నంటికొని యసహ్యముగా నుండును;ఆనీటిలో మొసళ్ళు లేకపోవచ్చును; సర్పము లుండవచ్చును; జలగ లుండ వచ్చును; ఇది యని తెలియరాని యొక క్షు(ద్రజల జంతువు (క్రిమిరూపమైనది కుట్టినచో విషమువలె దహించునది యుండ వచ్చును; వారు నీటిలోనికి దిగకుండ చెరువులోనికి వ్యాపిం చిన వృక్షములను చూచుకొంచు చెట్లలోనుండి పొడి నేలనే యడవిలో మలుపులు తిరిగి చెట్ల సందులగుండ పోవుచు నీటినిఁ బరిహసించుచు పొడినేలనే యా(శ్రయించుచు కొంత దవ్వు పోఁగా పోఁగా నా వృక్షసమూహము నడుమ నీ చెఱు వులో నొకనిర్వృక్షమైన స్థలము గనిపించెను; అది తటాకమే తటాకములో నా నిర్వృక్షమైన స్థలముచుట్టును వృక్షము లున్నవి; అచ్చటమా(త్రము లేవు; అచటికిఁ బోవుటకు పది ధనుస్సులమేర నీళ్ళలో దిగవలయును; చెట్ల నడుమగాఁ బోవలయును; అప్పటికి (ప్రొద్దు మింట నెంతయున్నదో తెలి యదు; ఇంచుమించుగా నా (ప్రదేశమంతయు చీఁకటిమయ మైయుండెను; ఊరకే దృష్టిమా(త్రము (ప్రసరించుచున్నది; అప్పటి కెంత (ప్రొద్దున్నది; మఱలఁ దిరిగియే జనపదమునైనఁ జేరుటకు వీలున్నదా ? తమరు బయలుదేరిన స్థలమునకుఁ బోఁగా నడుమ నొక నదియున్నది; ఆ నదినిఁ జీఁకటిలోఁదరించ వలయును; ఈ మహాకాంతారము పగటి వెలుఁగుండగా దాటి పోయినచోఁ జాలును; వా రడవిలోననే యుండఁగా సూర్యుఁ డస్తమించినచో గాఢాంధకారములు (క్రమ్మినచో నారేయి

వారు విశ్రమించుట యెక్కడ? తల దాచుకొనుట వీలగునా? వెంటనే తిరిగి పోవలయును; కాని యీ నిర్వ్యాళికమైన తటాకైక దేశమునకు సూటిగా దిగి చెట్లలోనుండి పోవలసిన చోట వారికి రెండు పులి కాలి గుర్తులు, రెండు మనిసి కాలి గుర్తులు విస్పష్టముగాఁ గనిపించెను; పులి కాలి గుర్తులు రెండును పులియొక్క ముందటి పాదపు గుర్తులు; మనిసి కాలిగుర్తులు సరిగా నొక పులియొక్క ముందటికాళ్లకు వెనుక కాళ్ళకు నెంత యెడముండునో నంత యెడమున నదేముఖముగా నుండెను; ఒక పులివెంట నొక మానిసి నడచినచో పులియొక్క నాలుగు కాళ్లగుర్తులు కనిపించవలయును; వాని వెనుక మనిసి పాదపుగుర్తులు కనిపించవలయును; ఈగుర్తుల కర్థముకనిపించలేదు; కిరాతుఁడు చెప్పినట్లేయున్నది; కాని కిరాతుడు చెప్పిన దీ ప్రదేశముకాదు; ఆకొండను వదలిపెట్టి వీ రీ మార్గమున వచ్చిరి; ఎచ్చటనో కనిపించవలసినది యిచ్చటఁ గనిపించినదేమి? మఱిల నట్టిగుర్తులకోసము వారు వెదకిరి; అవి యెచ్చటనుఁ గనిపించలేదు; నిర్వ్యాళికమైన స్థలమునందుఁ బరిశీలించి చూచిరి; అచట నొకవైపున రెండు చెట్లనడుమ నొకపెద్ద యెండినకొమ్మ పడియున్నట్లుండెను; అచట నొకకొమ్మ యెండుటయేమి? పడియుండుట యేమి! ఆ వృక్షములలో నొక్కటియు నెండుటకు వీలులేదు. నిత్య జలసేక పరిరక్షితమైన యీ స్థలమున వృక్ష మెట్లుండును? అది యెండిన కొమ్మయా? మఱి యింకేదైననా? ఏదియైన మొసలి నచట నుండెనా? మొసలి నీటిపైన తేలునా? అచట జలము లోతుగా లేదేమో? మొసలి

పండుకొన్నచో దానివీపు పైకిఁ గనిపించునంతలోతే జలమునఁ గచటనుండెనేమో? అది మొసలియన్న యూహ యెందుకు వచ్చినది? కొంత వెడల్పుగా, కొంత పొడవుగా నున్నది. అది చిన్న పడవ యేల కాకూడదు? ఇచ్చట పడవ యెందుకుండును? మనుష్యుని పాదములున్నప్పుడు పడవ యెందుకుండరాదు? అడవిలో క్రమక్రమముగా కనిపించుట తగ్గిపోవుచుండెను. రాజపురుషుఁడు నీటిలో దిగి దానిని చూచివత్తుననెను. కిరాతుఁడు వలదనెను. వలసినచో మఱునాఁడు పెందలకడవచ్చి పరిశీలించ వలసిన దేగాని యిప్పుడిట్టి సాహసము చేయరాదు. వెంటనే తిరిగి యడవినుండి బయటపడుటకు ప్రయత్నించనిచో రాత్రివేళ నడవిలో నిబ్బందియగును అని చెప్పెను. రాజపురుషునకు దిగి లోనికిఁ బోవలయుననియే యున్నది. ఇంతలోఁ గిరాతుఁడు సూక్ష్మముగాఁ బరిశీలించి మఱి రెండు మనిసి కాలిగుర్తులను చూపించెను. ఆ కాలిగుర్తులు నీటిలోఁ దిగఁబోవుచున్న మనిసి కాలిగుర్తులు. రాజపురుషుఁ డవి తనవిగాని కిరాతునివిగాని కావుకదా యని పరిశీలించి కావని నిశ్చయించి తొలుతటి కాలిగుర్తులు చెఱువులోనుండి వెలికివచ్చిన వానివి. ఇవి చెఱువులోనికి దిగుచున్న వానివిగా నేర్పాటైన పులి ముందటి కాలిగుర్తులు మనిసి కాలిగుర్తులకు సంబంధించినవిగా నిర్ణయించెను. కిరాతుఁ డనెను. "ఒకవేళ నిచ్చట కూడ నట్లే కావచ్చునుగాని మనిసి కాలిగుర్తులు తిరిగిపోవునపుడు నీటికి దగ్గఱగానున్నవి. ముందటి కాలిగుర్తులు పులివైనచో నీళ్ళలోనుండును. అవి మనకుఁ గనిపించవు."

అనఁగా రాజపుత్రుఁడు "నిజమే! ఇంకొకచోట నీరెండు కాలిగుర్తులయెడము దీనికివలెనే కనిపించినచో నంగీకరించ వచ్చును" అనెను. చీఁకటి పడిపోయినది. కాలిగుర్తులు కనిపించవు. వచ్చినత్రోవనే పోవలయునన్నచో చెఱువు నొడ్డుపట్టి చాలదవ్వు పోవలయును. చెఱువు వదలిపెట్టుటకే మిక్కిలి దూరము నడువవలసి యుండును. ఇచ్చటినుండి చెఱువును వదలి కాంతారమును దాటవలయునని ప్రయత్నించినచో నడవి యెంతదూరమున్నదో? ఒకచోటినుండి వారడవిలోనికిఁ బ్రవేశించిరి. వీరు చెఱువునొడ్డునకు వచ్చిన ప్రదేశమునుండి యడవి యింతదవ్వున్నది. అచటి కడవి యంతమగుచున్నదన్న యూహకలదు. ఇచటినుండి పోయినచో నడవి యెచట నంతమగునో? కిరాతుఁ డిట్లనెను. ఇచట నుండి యడవి చాలదవ్వు వ్యాపించియుండవలయును. అట్టి జంతువు నీటివద్దకు వచ్చెడు నట్టిస్థలమిదియైనచో నిచట యడవి మహాగాఢమైనదై యుండును. ఇచటినుండి యీ కాంతార మెంతమేర యావరించియున్నదో తెలియదు. కనుక మన మడవిని దాటిపోవలయునన్నచో మనము వచ్చినత్రోవనేపోయి తెలిసినచోటు గుర్తుపెట్టుకొని సులభముగా దాటిపోవలయును. మన మీ యడవిలో ప్రవేశించునపుడు మన యెడమవైపుననున్న యడవి ముందుకు చొచ్చియున్నది. అవి యన్నియు గుట్టలు. ఆ గుట్టలన్నియు మహాకాంతారములు. ఇచటనుండి పోయినచో నడవులు కొండలు వాగులు తప్ప మనము జనపదములకు చేరనేలేము. ఇంతకు వెనుదిరిగి పోయినను

మన మడవిని దాటిపోఁగలమా యన్న భయ మున్నది. నే నడవిలో వచ్చిన మార్గమును గుర్తుపెట్టికొంచు వచ్చితిని. చీఁకటిలో నా గుర్తు లెంతవఱకు నిలుచునో తెలియదు. అంతఁగాఁ గావలసినచోఁ మఱల నాలుగైదు దినములాగి యిచటికి రావచ్చును. అప్పుడు చూడవచ్చును. నామాట తమరు విశ్వసించవచ్చును. లేదా నేను చెప్పిన గుట్టవద్దకుఁ బోవచ్చును. అచట నింతకంటె విస్పష్టముగా నీ గుర్తులు కనిపించు చున్నవి. ఇచట సందేహాస్పదముగా నున్నవి. అచట నేను రెండుమూఁడుచోట్ల నిట్లే చూచితిని. అనఁగా నిద్దఱును వెనుకకు మఱలిరి. వారు చెఱువుగట్టు చేరిన స్థలమునకు వచ్చు వేళకు గాఢాంధకార మయ్యెను. అచటినుండి రెండు గడియల కాల మైనను నడచినఁగాని వా రడవిని వదలిపెట్టి పోలేరు. భయమనునది యిద్దఱకును లేదు. ఇద్దఱును సాహసులు. ఇద్దఱును బలిష్ఠులు. అయిన నడవిలో నర్ధరాత్రమున నేమూలనుండి యేది వచ్చునో తెలియని స్థితిలో బల సాహసముల ప్రయోజన మేమియుండును? అపుడు కిరాతుఁ డొక వృక్షము కొమ్మను విఱిచి ఒక కట్టెచేసి యా చీఁకటిలోననే యొక ఱాయి వెదకి దానితో నాకట్టె చివర నలగఁగొట్టి తన వద్దనున్న నిప్పును కలిగించు నాయుధములతో దానిని వెలిఁగించెను. అంధకారము వెలుఁగైనది. ఇంక పోదము రమ్మనెను. అపుడు రాజపురుషుఁడు "నీచేత నొక దివ్వె యుండును. నా చేతిలోఁగూడ నొక్కటి యుండును. ఇంకొక కట్టెను కొట్టుము. ఎవనిచేతిలోని దివ్వె వానికే యుపయోగముగాని రెండవవానికి కాదు. వెనుక

చెఱువు గట్లవెంట వృక్షములు చెఱువులోనికి వచ్చిన ప్రదేశమునకుఁ జేరిరి. అప్పటికి బాగుగా ప్రొద్దుపోయి యుండెను. మాటల నా స్థలమునుఁ జూచిరి. రెండు దివ్విటీలు దగ్గరకుఁ బెట్టి పులి కాలి గుర్తులు మనిసి కాలి గుర్తులు చక్కఁగా పోల్చికొనిరి. రాజపురుషుఁడు దివిటీ చేతఁ బూని నీటిలో దిగి యా మొసలి వంటి వస్తువేదియో చూచివత్తుననెను. కిరాతుఁడు దానివలనఁ బ్రయోజనమేమి? ఇచట మన మేమి చేయవలయును? మనము చేసెడిదేమియు నాకుఁ గనిపించుట లేదు. అది మొసలియైనచో దానిని తప్పించికొని వెనుకకు వచ్చుట కష్టమగును. పడవ యైనచో మనము దానిని కదల్పరాదు. పడవయే యనుకొందము. అయినచో నెవరో పురుషుఁడు దానిని కాచుచుండవలయును. దానినెక్కి యీ చెఱువులోనే చోటికి బోవును? పోయినచో నా కొండల్లలోనికిఁ బోవలయును. అచట నేదో గుహలో నతఁడు నివసించుచుండవలయును. ఇట్టి ప్రదేశమునందు నివసించెడివాఁడు జంతుసదృశుఁడై యుండును మహాయోగి యనుటకు వీలు లేదు. మహాయోగికి నిట్టి నావలతో బనియేమి? అందుచేత మనము నేటిరాత్రి దివిటీలార్పి యొక మహా వృక్షము నెక్కి కూర్చున్నచో నీ ప్రాంతములందు జరుగు కదలికను గుర్తుపట్టవచ్చును. చీకటి యైనను జంతువులో మనుష్యులో తిరుగుచుండిరేని లీలగాఁ దెలియును. మనుష్యులైనచో చెట్టు దిగివచ్చి వానినిఁ బట్టుకొందము. పులియైనచో బాణము వేసి చంపవచ్చును." అనఁగా రాజపురుషుఁడు 'పులినైనను చంపుటకు వీలులేదు. ఆ పులి యేపులియో!

దాని వెనుకపాదములు మనుష్యునిపాదములేమో. అయినచో నా పులినిఁ జంపరాదు. దాని సంగతియేమో కనుగొన వలయును.’ అనఁగాఁ గిరాతుఁ డిట్లనెను. అయినచో నీనాఁటి రాత్రి మన మూరకే చెట్లమీఁద నుందము. దాని సంగతి తెలిసినంతవఱకు తెలియును. రేపు ప్రొద్దుట నగరమునకుఁ బోయి పులిని జీవగ్రాహముగాఁ బట్టుకొనుటకు వీలైన ప్రయత్నములు చేసివత్తము” ఇద్దఱు నంగీకరించిరి. వా రెక్కు రాత్రిపూట భద్రముగా నుండుటకు వీలైన వృక్షమువంకఁ జూచిరి. కిరాతుఁడు రెండు మూఁడు వృక్షములను తానే ముందెక్కి చీఁకటిలో కొమ్మలపాటు తడవి చూచి యొక చెట్టును నిశ్చయము జేసెను. ఆ చెట్టుయొక్క రెండు పంగలలో నిద్దఱును చెఱియొక చోట కూర్చుండవచ్చును. మఱియు నావృక్షముయొక్క మొదలు పులియడుగులకు దూరముగానున్నను వృక్షశాఖలు తటాకములోని నిర్వృక్షకమైన ప్రదేశమునకు నభిముఖముగా వ్యాపించియుండెను. అది ప్రాలి తన దీర్ఘశాఖలను నీటి పైకి ప్రసారింపఁజేసినది. ఆ కొమ్మలలోఁ గూర్చున్నచో నిర్వృక్షకమైనస్థలము కనబడుచునేయున్నది. అచట నితర వృక్షములయొక్క శాఖలు లేవు. నక్షత్రముల వెలుఁగు సూటిగా నా తటాకప్రదేశమునందు పడుచున్నది. నీరు మిల మిల లాడుచున్నది. ఇతరములైన సర్వస్థలములయందు చెట్లనీడలే పడుచున్నవి. అచట పడుటలేదు. ఆసమయమున మింటికాంతి యొక విలక్షణముగాఁ బ్రసరింప నారంభించెను. కొండ లుత్తరమున నున్నవి. ఈతటాకము

పర్వతమునకు దక్షిణముగా నున్నది. ఈ నిర్వృక్షకమైన తటాకప్రదేశము దక్షిణదిశయందున్నది. పశ్చిమదిశయందు తెల్లని మబ్బులు పట్టినవి. ఆమబ్బులవెనుక చందమామ యున్నాఁడో యేమో. మబ్బులు తెల్లగాఁ గనిపించు చున్నవి. ఆకాంతి యుత్తరమువైపునఁగల కొండమీఁద నభి వ్యాపించినది. ఎందుకు వ్యాపించినదో తెలియలేదు. ఆ కొండమీఁద మబ్బులులేవు. పగటిపూట వెలుతు రున్న ప్పుడు తా మడవిలోఁ దిరుగుచుండఁగా నచట పర్వతము లున్నవన్నమాటయే యెక్కువఁగా తెలియలేదు. మొదట చెఱువుగట్టునకు వచ్చినప్పుడు దూరపుకొండలు కనిపించెను; గాని యీచెట్లు మొలిచిన తటాక ప్రదేశమునకు నెదురుగా నుత్తరమున నా పర్వతముల జాడగాని వానిపైన నిప్పుడు పశ్చిమ దిశాసితాంభోదచ్ఛటా ప్రతిబింబన హేతువులైన వస్తువులుగాని చూచుటకు వీలులేకపోయెను. తెల్లమొగిళ్ళ నీడ లా కొండమీఁది యేతెల్లనివస్తువులమీఁదనోపడి దాని నుండి మఱల కాంతి దక్షిణమునకుఁ గొట్టుచు నిర్వృక్షకమైన యీ తటాకైకదేశమును మాత్రమేకాక దానినుండి కాంతా రములోనికిఁ బోవుమార్గమునుఁగూడ భాసింపఁజేయుచున్నవి. వా రా కొమ్మపంగలలోఁ గూర్చున్నచో నాదారిని వచ్చెడు జంతువు, పోయెడు జంతువు కనిపించును. ఎవఁడైన పురు షుఁడు పడవనెక్కి తటాకములోఁ బ్రయాణముచేసినచో వాని సంగతికూడఁ దెలియును. వాఁ డెచ్చటికిఁ బోవునో తెలిసి కొనవచ్చును. అంతటి యోగ్యమైన యావృక్షశాఖాంతర ములయందు వారిద్దఱును సమధిరోహించి దివ్వెటీలనార్పి

వెంటనే వెలిగించుటకు వీలుగా నగ్నిసాధనములు దగ్గఱ పెట్టికొనికూర్చుండిరి. నిముసములు గడచుచుండెను. అడవిలోనుండి వనజంతువుల కూఁతలు వినిపించుచుండెను. అడవికోళ్ళ కీఁచులు, నక్కల యూలలు, భల్లూకముల రసితములు, వానరముల కిచకిచలు, పక్షుల కిలకిలలు, యేవియో పెద్దసర్పములవంటివి జఱ్ఱున జాఱిపోవుచున్నవా యను కొనఁగా నొక కంప నేలమీఁద వేసి లాగినట్లున్న ధ్వనులు వివిధములుగా నుండెను. తటాకములోనుండి చిత్ర చిత్రము లైన ధ్వనులు వచ్చుచుండెను. పెద్ద పెద్ద చేపలుకాబోలు నెగిరి హఠాత్తుగ మునుఁగఁగా నొక పడవను త్రోసికొని పోవుచు తెడ్డుతో నీటిని కొట్టిన ధ్వని యగుచుండెను. నీటి నడుమనుండి నడుమ నడుమ యొక వికారమైన ధ్వని విన వచ్చుచుండెను. అదియొక పసిపిల్ల యేడ్చినట్లుండెను. ఆ యేడ్పు గుండెలోని యొకానొక భీతిని జాలిని వెలికి త్రవ్వు చున్నది. కాని యా యిరువురి గుండెలలో నా రెండు ద్రవ్యము లున్నట్లు కనిపించలేదు. వారి దృష్టి సర్వదా మూఁడు స్థలములయందు ప్రసరించుచుండెను. నిర్వ్యాపకమైన తటాకైక దేశము, అడవిలోనికి పోవు త్రోవ, చెఱువు లోపలి భాగము. అడవిలోనే కొంచెము కదలిక గలిగినట్లు చూతురు. చెఱువులోని కూఁతలకుగాని చేప లెగిరిన ధ్వను లకు గాని యిట్లు చూతురు. తటాకమునందు పడవ కదలు చున్నదేమో యని చూతురు. చూచుచునే యుండిరి. కాలము గడచుచునే యుండెను. ఇంతకాలము గడచినదని తెలియదు, వారు కూర్చున్న స్థలములోనుండి వెక్కువ

మెసలుటకును వీలులేదు. అంటనుండి వారు మాటాడవచ్చునో మాటాడరాదో తెలియదు. పైన నెవరో యున్నారనన్న యలికిడి కలిగినచో మృగము పరారి యగును. మానిసి మఱల నచ్చోటికి రాడు. అట్టి స్థలములో నున్న మానిసి యెవడు? వాడు మానిసియా? జంతు సదృశుడా? సగము జంతువా? మఱల నిమేషములు నడువసాగెను. కిరాతుడు రాజపురుషుని చేతితో దాకెను. అది యొక సన్నగా గ్రహించి రాజపురుషుడు చెఱువులోనికి జూచెను. ఏమియును గనిపించలేదు. అడవిలోనికి జూచెను. అచట నేదో జంతువు కదలుచున్నట్లు స్ఫురించెను. కన్ను పొడుచుకొని చూచెను. ఇది యని తెలియరాని యొక జంతువు దారికి పెడగా నిలుచుండి నీళ్ళు త్రాగుటయో నీటిలోనికి దిగుటయో చేసినట్లుండెను. పెద్ద జంతువుకాదు. నక్క కావచ్చును. అడవిపిల్లి కావచ్చును. దాని భయమే యొక యచ్చెరువు కలిగించెను. ఆజంతువులు సంచరించు ప్రదేశమే యది. వానిసమయమే అది. ఈ జంతువులయొక్క కదలికలలో భయ మనునది తమకు స్ఫురించునట్లుండుట రాజపురుషుని తత్పూర్వమునం దతని హృదయమునందు గల యొక భావమునకు దార్ఢ్య మేర్పఱచినది. మఱల నిద్దఱు నిశ్శబ్దముగా గూర్చుండిరి. రాజ పురుషునకు నిదుర వచ్చుచుండెను. అతడు సేనలను నడపికొని పోవుచు గుఱ్ఱము మీదనే కూర్చుండి నిదురపోవుట కలవాటైనవాడు. అతడు కూర్చుండియే నిదురపోగలడు. ఇట్లుండగా నతని భుజము కిరాతుని చేతిచేత సన్నగా కదలింపబడినది. అతడు

కనులు తెఱచెను. ఆ సమయమున నిర్వ్యాకుల తటాకైక దేశమునుండు కాంతారములోనికి పోవు త్రోవ మిక్కిలియు ప్రకాశించుచుండెను. అటు చూడఁగా రెండు మిణుఁగురు పురుగులవలెఁ గనిపించెను. అవి పులి కన్నులు. పులివే. ఏమి చేయవలయును? తమ యున్న చోటికి పులియున్న చోటికి నలుఁబది గజములకంటె నెక్కువ దూర ముండదు. కిరాతుఁడు బాణ మెక్కుపెట్టెను. రాజపురుషుఁడు వారించెను. అది నీరు త్రాగుటకు వచ్చినదా? పులులు నీరు త్రావెడి స్థల మిది కాదు. విహరించుటకు వచ్చినదా? పులులు తమ యాహారముకొఱకు గాంతారమునందు లేళ్ళు బహుళముగా నుండెడు ప్రదేశములయందు యామినీ సమయముల సంచారము చేయును గాని నీళ్ళు నిలిచినచోట చెట్లు గుమ్ముగా క్రమ్ముకొన్నచోట విహరించవు. దాని పడక యిచట నెచ్చట నుండదు. ఆ పులి తిరిగెడి లక్షణము చూచినచో నిర్వ్యాపారముగా వినోదముకొఱకు వాహ్యాళికి నేగిన పురుషుఁడు పచారు చేయుచున్నట్లున్నది గాని వ్యాఘ్ర సంచార లక్షణము లేమియు లేవు. ఆ పులి యా ప్రదేశము నిర్జనమని నిర్జంతువని చక్కగా తెలిసినట్లు ప్రవర్తించుచున్నదా? తన పరాక్రమమునందలి విశ్వాసముచేత ధైర్యముగాఁ బ్రవర్తించుచున్నదా? ఈ రెండు లక్షణములు పులులకున్నట్లు వినికిడి లేదు. చూచుచుండఁగా నా పులి నీటిలోనికి దిగుచున్నట్లనిపించెను. నీరు త్రావఁబోవుచున్నదా? కాదు. బాగుగా నీటిలోనికే వచ్చుచున్నది. అది బయలుదేఱి ఈ పడవ యున్న చోటికి వచ్చునా. ఈదికొంచు వచ్చుచున్నది. అది

పులియేనా? ఎవఁడైన పురుషుఁడా? పురుషుఁడైనచో వాని కన్నులట్లు మిడుగురులవలెఁ బ్రకాశించునా? నీటిలో దిగువేళ చతుష్పాత్తులవలెఁ గనిపించెను గాని మానవుఁడు నీటిలోనికి దిగి కొంతమేర నడచి నీళ్ళందనిమేర నీఁతకొట్టుచు నీటిమీఁదఁ బరున్నట్లుగాలేదు. ఒక పొడుగైన శరీరమే నీటి లోనికి దిగినది. అదియే యీదికొంచు వచ్చుచున్నది. ఇపుడు వారిద్దఱికిఁ దెలిసెను. తాము చెట్ల యాకుల జొంప ముల నడుమనే దాఁగియుండవలయును. కదలరాదు. మెదల రాదు. తమనుండి యేమాత్రమును సవ్వడి కలుగరాదు. తమ యునికి దాని కేమాత్రమును తెలియరాదు. ఆ పులి వచ్చెను. ఆ రెండుచెట్ల నడుమనున్న మొద్దుమీఁది కెక్కెను. దాని నా రెండు చెట్ల నడుమనుండి వెలికిఁ ద్రోసెను. చెఱువు లోనికిఁ ద్రోసికొని పోవుచుండెను. అది పడవకాదు. మొసలి కాదు. వట్టి మొద్దు. ఆ మొద్దుమీఁద నెక్కి పడవనువలె చేతులతోఁ దోసికొని పోవచ్చును. ఇచటఁ జేతులేమి? చేతులెందుకు? ఒక జంతువు మొద్దుమీఁద నెక్కినచో నీటిని ముంగాళ్ళతో వెనుకకు లాగవచ్చును. మొద్దు ముందుకు సాగిపోవుచుండును. కాని జంతువునకు నిట్టి సదుపాయము తెలియునా? మహానదులు వరదలెత్తినపుడు యాదృచ్ఛి కముగా నొక జంతువు పెద్ద కొయ్య నొకదాని నాలం బముగా గ్రహించుట జరిగినచోఁ బ్రాణములు నిల బెట్టి కొనుటకు నా జంతు వీదుచున్నట్లు ప్రవర్తించ వచ్చును. ఒక పులి తా నొక చెఱువునం దీదుటకు పడవ నొకదాని నేర్పాటుజేసికొనునా? దానిమీఁద నెక్కి

నటు నిటు ప్రయాణము చేయుచుండునా? దానినొకచోటఁ గట్టివేయునా? పులి తటాకము నీదలేదా? ఎంతదూరమీఁద వలయును? చాలదూర మీదవలయును గనుక పడవకొయ్య నేర్పఱచుకొన్నదా? ఇట్టి యూహలలో కిరాతుఁ డుండఁగా ప్రక్కనున్న రాజపురుషుఁడు వానికిఁ దెలియకుండ వృక్షమును దిగి పోవుచుండెను. అతఁ డనుసరించెను. చెట్టుదిగిరి. మొదటికి వచ్చిరి. వచ్చిన దాలస్యముగా రాజపురుషుఁడు తన పాదరక్షలను కొన్ని వెలగల దుస్తులను మైనుండియొలిచి కిరాతునిచేతికిచ్చి ఖడ్గమాత్ర సహాయుఁడై నీటిలోనికి దిగఁ బోవుచుండెను. కిరాతుఁడు వానిచేయి పట్టుకొని నెమ్మదిగా ఇంత సాహసము వలదనెను. రాజపురుషుఁడు వానిచేయి వదలించికొనిఁ నీవు మఱల చెట్టెక్కి కూర్చుండుము. నేను వచ్చువఱకు నచ్చటనే యుండుము. నేను వచ్చువఱకు నే వేళయగునో? తెల్లవాఱునోఁ? జేపుదివాభాగమున నధికభాగము గడచునో? నీవు వెడలిపోకుము. ఆఁకలియైనచో నేఫలములో తినుము.' అని రాజపురుషుఁడు చెఱువులోనికి దిగెను. నిర్వ్యాక్షకమైన స్థలమునకుఁ బోవువఱకు లోతందలేదు. ఈద నారంభించెను. అప్పటికే నాపులి యెక్కిన పడవకొయ్య తేలికగా వందగజములదవ్వు పోయెను. ఇతఁడు మిక్కిలి వేగముగా నీదికొంచుఁ బోయినఁగాని దాని నందుకొనలేఁడు. దాని నందికొని యేమిచేయును? తనవెంట నెవఁడో యీది కొంచు వచ్చుచున్నాఁడని దానికి తెలిసినచో నది వెనుతిరిగి వీనిని వధించవచ్చును. అందుచేత వెనుక నీదికొంచు వచ్చు వాఁడు తన యనుసరించుట దానికి తెలియనట్లు చేయవల

యును. ఏసమయమునందును దానికి మిక్కిలి సమీపముగాఁ బోరాదు. చాలదవ్వుననుండి యీదుచున్నచో నది యే మలుపైన తిరిగినచో తనకు దాని పోయినతెన్ను తెలియదు. ఈతఁడు చువ్వవలె, త్రాఁచుపామువలె జఱ్ఱున నీటిమీఁద ప్రాకి పోవుచుండెను. ఇతఁడు మనుష్యుఁడేనా? ముందటిది పులియైనచో వీఁడు మహాసర్పమా? అతని శరీరము నీటిపైకిఁ గనిపించుటలేదు. అతనితల యొక్కటియే గనిపించుచున్నది. అతఁడిట్లనుకొనెను. ఒకవేళ పులి వెనుఁదిరిగి చూచినచో తాను తనతల హఠాత్తుగా ముంచును. ఎగురుచు మునుగు చున్న చేపలలో నది యొకటియని యాపులి యనుకొనును. నీటిలోఁ గొన్నిపులు లీదుచు చేపలను వేటాడును. ఈపులి అట్టిదైనచోఁ దన్ను తినుటకు రావచ్చును. అప్పుడు తన కోసమే వచ్చుట యెందులకు? దాని పార్శ్వములయందునను, పురతఃప్రదేశమునందునను చాల గండుమీ లెగురు చున్నవి. తా నీదుచు నడుమ నడుమ నెంత సవ్వడిలేకుండ యీదు చున్ననుఁ జేతితో నీటినిఁ గొట్టవలసి వచ్చుచునేయున్నది. ఆధ్వని పులికి తెలియకుండ నితఁడు జలమునందుండి యెగిరి పడుచున్న చేపలయొక్క ధ్వనిలో కలిసిపోవునట్లు చేయు చుండెను. అతనికిఁ బులికి నిరువది గజముల దూరముకంటె నెక్కువలేదు. ఆపులి నిర్భయముగాఁ బోవుచున్నది. తన్నెవరో యనుసరించుచున్నారన్న యూహయే దాని కున్నట్లులేదు. ఈపులి ఈపని అనేకములైన రాత్రులందు చేయుచున్నట్లున్నది. ఎన్నాళ్ళనుండి చేయుచున్నదో? ఇన్నాళ్ళనుండి లేనిది నేఁడు జరుగునా? జరుగుననుటకు

సూచనయు లేదుకదా? అందుచేత నాపులి ముక్కునకు సూటిగాఁ బోవుచున్నది. ఆజలమునం దీదుచున్న యితనికి దిశయు నెన్నను తోఁచుటలేదు. ఏదిశగాఁ బోవుచున్నాఁడో తెలియదు. అతనికిఁ దెలిసినదిశ యొక్కటియే. ముందున్న పడవ కొయ్య పోవుచున్నదిశ. అతనికి తా నా చెఱువును చాల డవ్వీదినట్లు తోఁచినది. అవును. అంతదవ్వు లేనిచో పులిమాత్రము పడవకొయ్య నెందుకు పట్టుకొనును? సుమారు మూఁడు గడియల కాలమైనను తాను నీటిలో నీదియుండును. అప్పటి కాపులి యొక మలుపుతిరిగెను. మింట నక్షత్రముల వెలుఁగు మరింత దృఢమయ్యెను. కృష్ణపక్షమేమో! మబ్బులలోనుండి చందురునికాంతి పడుచున్నదేమో యనిపించెను. తలయెత్తి చూచుటకు వీలులేదు. తాను నీటిమీఁద వెలికింతలుగఁబడి మిన్నుఁ జూడవచ్చును. ఈలోపుగా నాపులి తప్పించికొని పోయినచో తాను వెనుఁదిరిగి పోవుటకుకూడ దారి తెలియనివాఁడు. ఆ మలుపులోఁ బులి పోవుచుండెను. తా ననుసరించెను. చెఱువులోనికి కొండకొమ్మ త్రోసికొని వచ్చెను. ఆ వెనుకనున్న నీటిభాగములోనికి పులిపోవుచుండెను. చూడఁగా చూడఁగా నొక ప్రవాహమున కెదురు పోవుచున్నట్లనిపించెను. ఏదో కొండవాగువచ్చి చెఱువులోఁ బడుచున్నది. ఈపులి యావాగున కెదురుగాఁ బోవుచున్నది. అది వేసంగి యగుటచేత నావాగునీరు చెఱువులోనికివచ్చుట యంతవేగముగాలేదు. పులియు వాగుయొక్క ప్రవాహమునకు పెడపెడగాఁబడి పోవుచున్నది. నడిమి ప్రవాహమున కెదురుగాఁ బోవుటలేదు. మఱికొంతదూరము

పోయిన తరువాత పులి మిక్కిలి వాగునొడ్డునుబట్టి పోవు చున్నది. దాని నడక మందగించినది. ఈ రాజపురుషుఁడు తా నేమి చేయవలయును? ఎదుట దుర్ఘటముగా నుండెను. ఒకచోట లోతు. ఒకచోట కాలికందుచున్నది. కాలి కందినచోట లేచి నిలుచుండవలయును. లోతైన చోట మఱల నీదవలయును. నిట్టనిటారుగా నిలుచున్నమనిసి మఱల నీదుటకు జలమునందు వంగినచో కొంత సవ్వడితప్పదు. నిలుచున్నవాఁడు కూర్చుండి నీటిమీఁదికి వ్రాలనెంచినచో తనకుఁ గాలందినచోట్లు పంకమయములు. కాలినితీసికొను టయే కష్టముగానున్నది. ఇది పులికాదు. పులియగును. కాని పులిలక్షణములు దీనియందు లేవు. మానవలక్షణము లున్నవి. తానేదైన సవ్వడిచేసినచో నది వెనుకకు తిరిగి చూచును. తనమీఁదికి వచ్చును. ఈబురదలో యీ నీటిలో దానితోడి యుద్ధము క్లిష్టముగా నుండును. ధాత్రి యైనచో నెదురుపడవచ్చును. దానిని కత్తితో వధించ వచ్చును. తా నిదివఱకే రెండు వ్యాఘ్రముల నట్లువధించి నాఁడు. దాని కుత్తుకను చేతితో నదిమి ముంగాళ్ళగోళ్ళను చురకత్తితో నరకినాఁడు. అపుడు ఖడ్గముతో దాని ముఖ గహ్వరమునందు పొడిచినాఁడు. దాని ముంగోళ్లు తనమేన గ్రుచ్చికొని గాయపఱచుటయన్నది జరుగనే జరుగదు. అతఁ డంతటి మహాబలశాలి. తాళప్రమాణదేహుఁడు. ఆయస పరిఘభుజుఁడు. అతనికి భయములేదు. కాని యీ బుర దలో యీ నీటిలో నసమమైన యుద్ధము జరుగును. కనుక సాధ్యమైనంతవఱకు సవ్వడిలేకుండనే యనుసరించవలయును

తా నెంత జాగ్రత్తగానున్నను వనమునకు తటాకమునకు ఝరికి నసహజములైన కొన్ని ధ్వనులు తనకదలికనుండి వినిర్గమించుచునే యుండెను. వాని కాపులి వెనుతిరిగి యేల చూడదు? అది పులియైనచో నిస్సందేహముగాఁ జూచును. పులి జంతువు. వనసహజమైన మృగము. వనములోని సవ్వడులు దానికిఁ దెలియును. దానిసవ్వడులు వనమునకుఁ దెలియును. వనమునకు సహజములైన సవ్వడులుకానివి కలిగినచో పులి నిస్సందేహముగా వెనుదిరిగి చూచును. ఈ జంతువులో పులిప్రకృతిలేదు. దానికి పెఱసవ్వడుల పట్టింపు లేదు. వనములోఁబుట్టి వనములోఁబెరిగి, వనములో నివసించుటకే సృష్టింపఁబడిన జంతువైనచోఁ దానీపాటికి గుర్తు పట్టఁబడెడివాఁడే. కాని జంతువున కా గోడులేదు. ఇతరములైన సవ్వడులుకూడ వనమునకు సహజములైన సవ్వడులే యనుకొనును. తాను మఱికొంత వెసులుబాటుగా నడువవచ్చును. ఎగువకుఁ బోయునకొలఁది ప్రవాహములోతుగా నున్నట్లు నడిపాయ వేగతరముగానున్నట్లు నీటికి ప్రక్కనఁబడిపోవుట వాగులోనికిఁ జొచ్చిన చెట్లవేళ్ళచేతఁ దుర్ఘటముగా నుండును. ఇది పులియైనచో నా వృక్షమూలములను, వృక్షశాఖలనుఁ దొలఁగించుకొంచుఁ దెమలించుకొంచు నొక కిరాతుఁడు తన చిన్నిపడవను పట్టికొనిపోవునట్లుగాఁ బోవునా? ఈపులి యిట్లు నదిలో నీదుట యెందులకు? తానా యెగువ నెచ్చటికో పోవలయునన్నచో నొడ్డెక్కి కాంతారమునందుఁ బడి నడచిపోవచ్చునుగదా? అప్పుడు తాను వెన్నాడుట తనకు సుకరమగును. ఈపాటికి రాత్రి గడచియుండదా? మహాటవు

లకు బయటనున్న ప్రదేశములో సూర్యోదయ మగుచున్న దేమో! కనీస మహోరాగము సాగుచున్నదేమో! అంతవేళ కాకపోవచ్చును. ఈ మహోత్తాలగిరితరుశేఖరముల నివసించుచున్న ద్విజసంతానమువలన కాప్రాగ్దిశాసుందరీస్తన ప్రావారాంచల కనకరేఖాచ్ఛటాకాంతి మున్నుగా తెలియును. అది కలకలారావములు చేయును. ఈ చెట్లమీఁదఁ బక్షులే లేవేమో! పక్షి నివసించని చెట్టని యుండునా? ఎందుకుండకూడదు? మనిషియైన పులిలేదా? పులియైన మనిసియున్న చోట పక్షి నిలుచునా? నిలచినట్లే వాల్మీకి చెప్పినాఁడు. మారీచుఁడు లేఁడియయ్యెను. ఆ లేఁడి చనిపోవుచు మఱల మారీచుఁడయ్యెను. ఆయడవిలో పక్షు లుండెను. ఇచట కూడ నుండవచ్చును. వాని కీజంతువునుచూచి భయమేమో! అందుచేత నిర్వ్యాచాలములుగా నున్నవేమో! పక్షులు లేవుసరే. వానరము లుండవచ్చును. లేళ్ళుండవచ్చును. జంబుకము లుండవచ్చును. అడవిలోనే జంతువులైనను పెద్దపులి వచ్చుచున్నదనఁగా నా పెద్దమృగమువచ్చుచున్నదని తక్కిన జంతువులకుఁ దెలియఁజేయుటకు తమజాతి సహజములైన యఱపు లఱచును. అట్టి యఱపులుకూడ నిచట వినిపించుటలేదు. చాలదవ్వు పోయినతరువాత దూరముగా నితనికి నొకపర్వత మడ్డువచ్చుచున్నట్లు కనిపించెను. ఈవాగు తద్భూధరాంచలములనుండి జలపాతముగాఁ బడుచుండెను. ఆ స్రోతః వినవచ్చుచుండెను. అతనికి సంతోషమువేసెను. ఈక్లిష్టమైన ప్రయాణప్రయాసము తగ్గిపోయెడు వేళ వచ్చినది. ఇది యెంతవిచిత్రమైన పులియైనను పడవ

కొయ్యను కొండమీఁది కెక్కింపలేమకదా! అచట నాగి తీఱవలయును. దానికి తగినట్లు ప్రవాహము వెడల్పయ్యెను. వెడల్పగుటయే కాదు. నడుమ నడుమ పెద్దబండలు. బండల చుట్టును ప్రవాహములు. అదియొక పెద్దలోయ. ఆలోయ లోనికి జలము పడుచున్నది. అది విశాలమైన ప్రదేశము. జలపాతమైన వారికొన్ని ఱాళ్ల నడుమగాఁ బ్రవహించుచున్నది. చిలుకునీరు పెడపెడగాఁబోయి పెఱఱాళ్లచుట్టుఁ దిరిగినది. అదికూడ జలమయముగానే యున్నది. ఆజలము ప్రవాహ గతము కాకపోయినను ప్రవాహము ప్రక్కలకు విదలించు నీటి చేతఁ బోషింపఁబడుచున్నది. ఈ పెడగానున్న ఱాళ్ల నడిమి నీళ్లలోఁ బులికి ప్రయాణము సుఖమయ్యెను. అతనికిని సుఖమయ్యెను. ఇప్పు డితఁడు పులికి మిక్కిలి దగ్గఱఁగాఁ బోవుచుండెను. ఏఱాతి వెనుకఁబడిన నాఱాతి వెనుకనే యతఁడు దాఁగికొనవచ్చును. ఈవిశాలప్రదేశముచేరకమునుపు వాగు యిరకటముగా నుండెను. ఇపుడు విశాలముగానుండెను. తానొక ఱాతివెనుకఁ దాఁగియుండుట ఆపులి తిరిగెడి మలుపు గుర్తుపెట్టుకొనుట, ఱాతికి రెండవవైపునుండి తిరిగి వచ్చుట మఱల నావైపు తానుకూడ తిరుగుట, వెనుకటి త్రోవ వాగున కిరుప్రక్కలనున్న వృక్షములయొక్క క్రమ్ముదలచేత మింటి వెలుఁగును సమృద్ధిగా నీయలేదు. ఇచట విశాల ముగా నున్న నీలోయ లోతుగా నున్నను మింటి కాంతిని చక్కఁగా ప్రకాశింపఁ జేయుచుండెను. ఇట్లు పలు శిలల మలుపులు తిరిగి తిరిగి యాపులి యొక పెడగా పోయెను. అది పోవుచున్న మేర శిలలకు దవ్వుగా నుండెను. అదియు

నొక తటాకమువలె నున్నది. ఆ తటాకముమీఁద నొడ్డున నేటవాలుగానున్న కోసిన కొండకొమ్ముమైన పెరిగిన చెట్లు వ్రాల్చిన నీడ చిమ్మచీఁకట్లు చేసెను. అందులో నితని కేమియుఁ గనిపించలేదు. అతఁ డనుసరించుట యెట్లు? అనుసరించుట విస్పష్టముగా పట్టుఁబడుటయే. ఇదియే ఆపులి గమ్యప్రదేశమై యుండును. తానచట సుఖముగా నాగ వచ్చును. తెల్లవాఱిన తరువాత దాని దారి యేదియో చూడవచ్చును. అపుడు వెలుతురు వచ్చునుగదా. ఇది పెద్ద తటాకము. ఆ వెనుకనున్నది కోసిన కొండప్రక్క. అచట గుహయుండునా? లేనిచో నందులో నొకచోట నొక వాగు వచ్చి చెఱువులోఁ బడెడి పొంతన కలదేమో! ఆ వాగువెంట నిది పోవునేమో! అట్టి వాగువచ్చి యీ తటాకమునందుఁ బడుచున్నదైనచో నీ తటాకజలమును స్వచ్ఛముగా శాంతముగా నుండునా? దీని పొల్లఁకువయేమి? తా ననుసరించవలయునా వలదా? అనుసరించి యేమి ప్రయోజనము? ఆ చిమ్మచీఁకటి నీటిలో తట్టుముట్టాడవలసి నదే కాని పట్టుమని యిది యిదని తెలిసికొనుట సుకరము కాదు. కానిమ్మని యతఁడు తానొక ఱాతిమీఁదఁ గూర్చుం డెను. తాను కూర్చున్నచోఁ దన యాకృతి యా పులికి దూరమునుండి కనిపించవచ్చునేమో యని ఱాతిపైనఁ బరుం డెను. క్రమ క్రమముగా పక్షుల కలకలారావములు విని పించెను. అప్పటి కతని కనిపించెను. తానును కిరాతుఁడును చెట్టుమీఁద ప్రతీక్షించిన కాలము, పులి వచ్చినకాలము చెఱువులో నీదినకాలము, వాగులో వచ్చినకాలము, సర్వ

మును యామినీవేళయే నాలుగుజాముల కాలము. ఇది వేసఁగి గనుక మఱికొంతవేళ కలుపవలయును. తానీదిన లెక్క ప్రకారము మూఁడు గడియలకు నరయోజన మీఁదును. రాత్రి రెండు జాములకు తానచట నీదుట యారంభించినచో చెఱువులో నీదిన పొడవు యోజనమైన నుండును. ఇది యంతటి పెద్ద తటాకము. ఆకసమునందు చెట్ల పచ్చఁదనమును విఱుచుచు చిగుళ్ళను మఱియు నెఱ్ఱనఁ జేయుచు నొక కాంతి వ్యాపించుచుండెను. సంధ్యాకాలమున నస్తమించుచున్న సూర్యుఁడు పశ్చిమదిశ నావరించిన దెల్లని మొయిళ్ళతుదలు తన యెఱ్ఱని గోళ్ళచేత ఘునికినట్లు సూర్యుఁడు తా నుద యించుచు వృక్షశేఖర కిసాలయ పరివారమును స్పృశించు చున్నట్లున్నది. ఆ సూర్యుఁడు ప్రాగ్దిశ నుదయించుట యెప్పుడు? ప్రొద్దెక్కుట యెప్పుడు? ఈ కొండమీఁదికి వచ్చుట యెప్పుడు? ఈ యఖాతమైన లోయలోనికి దిగుట యెప్పుడు? తన కీతటాకముయొక్క సంగతి తెలియుట యెప్పుడు? మానిసి శరీరముచేత నినుము కావచ్చును. పరా క్రమముచేత సింహము కావచ్చును. ధీబలముచేత బృహస్పతి కావచ్చును. కాని వానికి మనస్సన్న దొకటి యున్నది. ఆ మనస్సు వాని శరీరముయొక్క యినుపతనము, పరాక్ర మము యొక్క వాఁడితనము, బుద్ధియొక్క లోతును వంచించు వస్తువు. అది నిలువనీయదు. పట్టుకొననీయదు. అందుచేత నా రాజ పురుషుఁడు శిలమీఁదఁ దాను బరుండి పడిన బాధ వానికి బాధ యనిపించెను. అర్ధరాత్రమున చెట్టు దిగుటయు ప్రతి నిమేష మృత్యు ప్రతీక్షా సన్నిభమైన తత్తటాకమునఁ

ప్రవేశించుటయు నీదుటయు బురదలో చెట్ల కొమ్మలలో తాళ్ళలో నీటి గుంటలలో పులివెంటఁబడి వాగునొడ్డునఁబడి వచ్చినదంతయు బాధ యనిపించలేదు. ఒకవేళ నా పులి నా చీఁకటి నీటిలోలో నాగనేమో! తాను వెంట వచ్చుచున్న విషయము దానికిఁ దెలియునేమో! సందేహముగా నుండె నేమో! ఆ సందేహము నివృత్తిఁ జేసికొనుటకుఁ దా నాగె నేమో! ఈ సూర్యకాంతి తనపైఁ బ్రసరించినపుడు తన యునికి దానికి తెలియును. అందుచేతఁ దాను నెమ్మదిగా నా తాటినుండి నీటిలోనికి జాఱి చీఁకటిగల నీటిచోటికిఁ బోవలయును. అతఁడుగూడ చీఁకటిలోనున్నచో వెలుతురులో నున్న కథ వానికినిఁ దెలియును. అతఁ డా తాటిమీఁదినుండి నీటిలోనికి జాఱిన వైఖరి సరిగా నొక మొసలి జాఱినట్లే యుండెను. నిజముగా పులి వానిని సందేహించినచో దాని కన్నులలో నిది మన్ను కొట్టినట్లే యగును. అతఁ డా నీటి లోనికిఁ ద్రవ్వుకొంచుఁ బోయెను. ఆ చెఱువులో నెచట నుండవలయును? నిలుచుటకు స్థాన మెచ్చట వెదుకవలయును? నిలువీఁతమీఁద నెంతసేపు సంబాళించుకొనవలయును? కొండ దాకఁబోయినచో నచట నేదైన యాధారము దొరకు నేమో చూడవలయునని యీదికొంచుఁ బోయెను. అతని యీఁదుటలో సవ్వడియే లేదు. బ్రహ్మ గుర్తు పట్టలేఁడు. యాదృచ్ఛికముగా నతనికొక నీటిలోనికిఁ జొచ్చిన వృక్ష మూలము లభించెను. అది యంతయుఁ బ్రాకుడుపట్టి గ్రహణ యోగ్యముగాలేదు. అతని బొడ్డులోఁ జురకత్తియున్నది. ప్రక్కన కృపాణము బిగించఁబడి యున్నది. చురకత్తిని తీసి

దాని ప్రాకుడంతయు నోకివేసెను. ఒక విధముగా నచటఁ గాలూనెను. అప్పుడు తాను వదలివచ్చిన జాతివంకఁజూచెను. ఆ పులి దానిచుట్టు నీదుచున్నది; అతని కానందమువేసెను. అతఁ డనుకొనినది నిజమే. తా ననుసరించి వచ్చుట యాకట్టి నది. అగునా కాదాయని పరిశీలించుటకే యిట్లుచేసినది. అతనికొక ధైర్యమువేసెను. అది నిజముగాఁ బులియైనచో నీట్లువచ్చి పరిశీలించదు. పరిశీలించినచో దానికిఁ దాను మనిసినని నిజముగాఁ దెలియును. జంతువులు మనిసిని పసికట్టును. ఆ పసికట్టుట వానికి సహజము. ఇది జంతువు కాదు కనుకఁ దన్నది గుర్తుపట్టలేదు. మున్ను తాను చూచిన దొక మొసలి. అది నీటిలోనికి దిగిపోయెను. ఈభావమే దీనికుండును. ఒకవేళ నీపులి యాజాతిమీఁది కెక్కినచో తన తడిసిన మేనియొక్క పురుషాకారరేఖాలక్షణము దానికిఁ గనిపించునుకదా! ఆజాయి వేయివిధములుగాఁ దడిసి యుండును. ఆజాయి యెప్పుడును దడిసియేయుండును. పగలు రెండుజాములవేళ నెండనేమో! తక్కినప్పుడు దానికి పొడియెక్కడిది? ఆపులి దానిచుట్టు రెండు మూఁడుసార్లు తిరిగి తానా జాతిమీఁదినుండి దిగిపోయిన దెసకుఁబోసాగెను. అతఁడు మఱల సంతోషించెను; తా నీ వైపునకు రాఁగల వాఁడు దిగునప్పుడే నీటిలోని కావైపునకు దిగెను. కొంత దవ్వు నట్లీదుకొని పోవునట్లు నటించెను. తన యిచ్చట నున్నస్థితి దానికి తెలియదు. నేను నిజముగా మనిసినన్న సందేహము దానికున్నచో మానవుఁడిట్టి కృత్రిమములు చేయునుగావున నది వెనుకకువచ్చి చూడవచ్చును. నేను

మానవుఁడనన్న సందేహము దానికి కలుగలేదు. లేకపో వచ్చును. మఱి యేదో జంతువు తన్ననుసరించి వచ్చు చున్నదని దానియూహ కావలయును. అది మొసలి కావచ్చును. ఇట్లుండఁగా వెలుఁగు క్రమక్రమముగా బూడిద గుమ్మడిపూలవలె చెలఁగుచుండెను. తెలుపులు బైనుండి క్రుమ్మరించుచున్నట్లుండెను. ఆపులి తొలుత తా నొడ్డిగిలిన తటాక సదృశమైన ప్రదేశము జలపాతమునకుఁ గుడివైపున నున్నది; ఇపు డెడమవైపునకుఁ బ్రయాణముచేయ నారం భించెను. ఆ పోవుటలో సందియము తొలఁగిపోయినజాడ గోచరించెను. ఇతఁడు దానిని మఱల తాళ్ళ చాట్లు చాట్లుగా ననుసరించెను. అట్లు పోఁగాపోఁగా నావైపున కోసిన కొండకొమ్మ లేదు. నదీప్రవాహము రేవుగాకట్టినది. చిన్ని చిన్నితాళ్ళున్నవి. దిగి యొడ్డునకుఁ బోవచ్చును. పోయిన తరువాత కొంతదవ్వునఁ గొండ లున్నవి. ఎక్కుటకు వీలుగా నున్నది. అచట గుహ లుండవచ్చును. ఆపులి తన పడవ కొయ్యనువదలి గట్టెక్కెను. ఇతఁడు చూచుచుండెను. దానియొక్క వెనుకటిభాగము విస్పష్టముగాఁ గనిపించు చుండెను. దాని వెనుకటికాళ్లు పులికాళ్లేనా ? అవి మను ష్యుని పాదములా? రాత్రి తాను చీఁకటిలో చూచినప్పుడు తనకీ యనుమానముకలిగెను. సామాన్యముగా జంతువుల యొక్క మునుఁగాళ్ల వెనుఁగాళ్ల యెత్తుసమానమునుండి మూపు మొదలు పృష్ఠమువఱకు నొకటే యెత్తుగా నుండును. రాత్రి తాను చూచిన పులికి వెనుకభాగ మెత్తు ముందుభాగము పల్లము ననిపించెను. పడవకొయ్యమీఁద నేగినపుడీ విచారణ

కలుగుటకు వీలులేదు. ఇపుడు తెలిసినది. ఈ పులి వెనుక భాగమున నెత్తుగా నున్నది. ముందుభాగము వ్యాఘ్ర ప్రమాణముగా నున్నది. వెనుకవి పులికాళ్ళు మాత్రము కావు. ఇది లేచి నిలువఁబడఁగలదేమో! మనిసివలె నడువఁ గలదేమో! ఎందుకు నడువదు? పులిబొమ్మ బరువు. తల బరువు. అందుచేత నడువలేదు. ఇంకొక జంతువైనచో సులభముగా లేచి నడచెడిది. అతఁడు శిలచాటుననుండి దానివంకఁ జూచుచుండెను. అది పడవకొయ్యమీఁదినుండి దిగెను. ఆ పడవకొయ్యను రెండు ఱాళ్ళనడిమికిఁ ద్రోసెను. అపుడు మఱల వెనుఁదిరిగి చూచునని వానికిఁ దెలియును. తాను ఱాతి వెనుక దాఁగికొనెను. మఱలఁ జూచువేళకు నొడ్డెక్కి పోవుచుండెను. అతనికొక యనుకూలమైన ఱాయి కనిపించెను. దాని వెనుక నతఁడు నీళ్ళలో నిలఁబడి తొంగి చూచుచుండ వచ్చెను. ఆ పులి గట్టెక్కినది. కొద్ది గజముల స్థలము నడచినది. అచట మెట్టగా నున్నది. మెట్లున్నవి. పైకెక్కినది. మఱియొక వంద గజముల దవ్వున కొండ నాను కొని యొక గుహ యున్నట్లున్నది. ఆ గుహలోనికి పులి ప్రవేశించినది; తానింక బయటకు రావచ్చునా? మఱల నా పులి బయటికివచ్చి తన సందేహమునుఁ బరామర్శించు కొనునా? ఇది పులి యైనచో నింతటి దవ్వెందుకు? ఈగుహ యెందుకు? ఇచట నాహార మెట్లు దొరకును? నిత్య జలపాత కృతమహాధ్వని భీతములై యిచట వనజంతువు లుండవు. పక్షుల నిదివేటాడలేదు. అందుచేత పులికాదు. మనుష్యుఁడా? మనుష్యుఁడైనచో నాహార మెట్లు లభించును? ఈ పడవ

మీఁదఁ బోవచ్చును. జనపదములమీఁదికిఁబోయి యాహా రాదులు కొని తెచ్చుకొనవచ్చును. ఇది పులికడా? జనపద ముల కెట్లుపోవును? దీనితోపాటే గుహలో నొక పురుషుఁడు కూడ నివసించుచుండెనేమో! వాఁడు నీ పులియు జతకట్టి రేమో! ఇట్టి కథ లపుడప్పుడు వినుచుందుము. అయినను తాను తొందరపడి గుహవద్దకుఁ బోరాదు. తానున్నచోటనే యుండి చాలసేపు ప్రతీక్షించవలయును. విచారించవలయును. కాని యప్పటికే యీ రాజపురుషుని శరీరములోని జవసత్త్వ ములు సన్నగిల నారంభించెను. ఎంత మహావీరుఁడైనను, ఎంత మహా బలశాలియైనను కడచిన యీ రాత్రి యింతటి ప్రతీక్ష, ఇంతటి నిరాహారస్థితి, ఇంచు మించుగా నిశార్ధకాలభాగము జలమునందు నివసించుటచేసి నిలువఁ గలఁడా? అతఁడు తానింక నిలువలే ననుకొనియెను. కాని మనసులోని పట్టుదల నిలుపుచుండెను. అతని మనసులో నొక యావేగముకలదు. వచ్చినచో నాపులి వెంటనే గుహనుండి బయటకు రావలయును. ఆ పులితోఁబాటు మఱియొక పురుషుఁ డందు నివసించుచున్నచోఁ ప్రాతఃకాల మైనదికదా! వాఁడు వెలికివచ్చి స్నానమాడవలయును. ఇంకొక పురుషుఁడే యచ్చటనున్నచో వానినిఁ దాను బలుక రించవచ్చును. వానితో మాటాడవచ్చును. ఇప్పుడు తనకుఁ గావలసినది విశ్రాంతి. ఏదో కొంత యాహారము. విశ్రాంతిమాట యెట్లున్నను కడుపులోని కేదో కొంత పోయి నచో మఱల నతనికి జవసత్త్వములు వచ్చును. అతని కింకొక యూహతోచెను. ఆగుహకు దూరముగా మఱల

వెనుక కీడికొనిపోయి పీలైనచోట నాతలియొద్దెక్కి యడవిలో నేఫలములో భుజించి విశ్రాంతి తీసికొని మఱల నిచ్చటికివచ్చి యీ గుహాస్వరూపమెట్టిదో తద్వ్యాఘ్ర మెట్టిదో విచారించి నచో బాగుగా నుండునని తోఁచినది. కాని మఱలఁ దాను వచ్చెడులోపున పులి యాగుహాలోనుండి వెడలిపోయినచో దానిని కనుఁగొనుట యెట్లు? తానుపడిన యింతప్రయాసయు, తానుచేసిన యింతప్రయత్నమును వ్యర్థమగును. ఏమైనను సరే తానుకూడ నొద్దెక్కి, గుహావద్దకుఁ బోవలయును. లోన జూడవలయును. తాను గుహావద్దకుఁబోయినంతనే యాపులి గాండ్రించి మీఁదఁబడినచో నేమగును? తానున్న యిప్పటి స్థితిలో తాను పులితో యుద్ధమాడఁగలఁడా? ఆ పులికూడ యింతశ్రమయుఁబడినదికదా! దానికి నోపిక యుండను. అదియు గాండ్రించునేమోగాని మీఁది కురుకదు. తాను గుహాముఖము నకుఁబోయి దాని గాండ్రింపు విన్నచోఁ దన కది పులియని నిశ్చయ మగును. తాను గుహా ముఖమునుండి యీతలికి వచ్చినచో నది తన్ను వెంటాడదు. అప్పుడొక నిశ్చయము చేసికొనవచ్చును. ఇది పులియే. కాని ఎందుచేతనో దాని పృష్ఠభాగ మట్లున్నది. ఈ సృష్టిలో నే జంతు వెట్లుండునో యెవరు చూచిరి. ఎనుఁబదినాల్గు లక్షల జీవరాసులలో నే జంతువుయొక్క స్వరూప మెట్లుండునో యెవరికిఁ దెలియును. మానవుఁ డన్నవాఁడు చూడని మహాగహన ప్రదేశమునందు సముద్రాధః ప్రదేశములయందు కొన్ని జంతువులు పరమ వికారముగా నుండవచ్చును. మానవుల మొగములతోఁగల జంతువులు కలవు; కొన్ని హింస్రమృగము లట్లుండును.

మానిసి మొగమునకు దాని మొగమునకు నెక్కువ భేద ముండదు. ఇది మానవ పృష్ఠ సమానమైన జంతువు.—— అప్పటికి పగలి వెలుతురు మొగలిపూఁజాయ నుండును. అతఁడు నెమ్మదిగా నడచిపోయెను. గుహాముఖమువద్దకుఁ బోయెను. ఎదురుగాఁ బోలేదు. అతఁడు తాను దాఁగియున్న శిలాఖండమును వదలి గుహాముఖమువఱకుఁగల వంద గజముల మేర నడచుట మూఁడు గడియలకు తక్కువ పట్టలేదు. సాహసించి గుహాముఖమునందు నిలుచుండెను. లోనుండి ఎవరు నీవు అన్నమాట వినిపించెను. ఎవరు నీవన్న కంఠధ్వని మనిసిదో యేదైన మృగముదో తెలియలేదు. లోనఁ జీఁకటి గానే యున్నది. ఏమియుఁ గనిపించుటలేదు. చీఁకటిలోఁ దొలుతఁగాఁ జూచినపుడు గనిపించదు. కంటికి చీఁకటి యలవాటు కావలయును. అపుడుగాని లీలగానైన లోని వస్తు పరిజ్ఞానము కలుగదు. ఆ రాజపురుషుఁడు లోపలికిఁ బోవలయునా? వలదా? సమాధానము చెప్పకుండ నచటఁ గొంతసేపు నిలువవలయును. నిలచినఁగాని కంటికలవాటు కాదు. సమాధానము చెప్పకుండ నిలుచుండవచ్చునా? అతఁడు మఱలఁ బ్రశ్నించినచో నేమనవలయును? లోనున్న వ్యక్తియొక్క స్వరూపము తెలియకుండ సమాధాన మెట్లు చెప్పఁగలము? రాజపురుషుఁ డిట్లనెను. “నా కాకఁలి యగు చున్నది. కొంత యాహారము కడుపులోఁ బడినఁగాని సావ కాశముగా నా కథ చెప్పుటకు వీలులేదు. ఎవఁడైన యోగి నాకుఁ గనిపించవలయును. అతనివలన నేను తరించవలయును. అని పలు దినములుగాఁ బ్రయత్నించుచుంటిని —— ఇంతలో

లోన లీలగాఁ గనిపింప నారంభించెను. లోనుండి మఱల సమాధానము రాలేదు. ఆగుహ కొంతవిశాలముగా నుండెను. గుహకు గోడలుగానున్న కొండఁ జాతినంటి విస్పష్టముగా భాసించని వస్తువు లేవో యున్నవి. ఒక పురుషుఁడు తానొక చోటఁ బండుకొని యున్నాఁడు. అతఁడే యీ ప్రశ్న వేసిన వాఁడు. ఆ రాజపురుషుఁ డక్లే మఱికొంతసేపు నిలుచుండెను. లోనున్న పురుషుఁడు మఱల ప్రశ్నవేయలేదు. క్రమ క్రమముగా కనుచూపు ఆనుచుండెను. ఆ పురుషుఁడు పండుకొన్న స్థలము రంగు రంగులుగా నుండెను. పసుపు, కుంకుమ, ముగ్గు, బొగ్గుమొదలైన పదార్థములతోఁ గలిపినపిండి నేలపై చల్లినట్లుండెను. దానిమీఁద నీ పురుషుఁడు పండుకొని యుండెను. రాజపురుషుఁ డిట్లనెను. స్వామీ! తమరెవరు? ఈ గుహలో తపస్సు చేయుచున్నారా? ఈ గుహయంతయు నిట్టి కాశ్మీర వర్ణధూళి పిహితమై యున్నదేమి? ఒక పులిని నేను వెన్నాడి వచ్చితిని. ఆ పులి పృష్ఠభాగమునందు మానవాకృతి కలదిగా నున్నది. అది యీ గుహలో ప్రవేశించినది. నేను దానిని వెన్నాడి వచ్చితిని. లోనికి వచ్చువేళకు పులి కనిపించలేదు. ఆ పులి యీ గుహలోనికి వచ్చినదా? ఈ గుహలోనుండి మఱియొక గుహలోనికి త్రోవయున్నదా? ఆ పులిని తమ కెఱుఁగుదురా? మీరున్న గుహలోనికి వచ్చిన పులి మీకు తెలియకుండ నెట్లుండును?

ఒక కిరాతుఁడు నాల్గుదినములనుండి తానొక పులియడుగులు చూచుచున్నాఁడనని దాని ముందటికాళ్ళు పులిపాద

ములని వెనుకటిపాదములు మనుష్యపాదములని నాతోఁ జెప్పుచువచ్చినాఁడు. నేను విశ్వసించలేదు. కాని వాఁడు గొప్ప వేటకాఁడు. ఈ మగధధారుణీకాంతారములలో వాఁడెఱుంగని చోటులేదు. సర్వమృగారావములు వానికిఁదెలియును. వానిలోని భావములతఁడు చెప్పఁగలడు. ఒకమృగముయొక్క కూఁతనుబట్టి యా మృగముయొక్క పరిస్థితిని వాఁడు వచింపఁగలఁడు. ఆమృగ మాస్థితిలోనుండి యట్లుకూసినదని చెప్పును. పది పదేను విధములైన హరిణము లడవిలో సంచరించుచుండును. వాని నన్నిటి నతఁ డెఱుఁగును. మంటిలోఁ గనిపించినవాని కాలిగిట్టలనుఁబట్టి యా గిట్టలేజంతువులో వాఁడు చెప్పఁగలడు. ఆ గిట్టల ప్రమాణమునుపట్టి దాని వయస్సు చెప్పును. దానియెత్తు చెప్పును. దానిపొడుగు చెప్పును. అది తొందరగా నడచెనో నెమ్మదిగా నడచెనో వాఁడు చెప్పఁగలఁడు. మఱేజంతువైన దానిని వెన్నాడిపోయినదియుఁ జెప్పఁగలడు. వాఁడు సర్వకాంతార రహస్యవేది. వాఁడనినమాట నేను విశ్వసించకపోవుట యెట్లో నాకు తెలియదు. వాఁడువచ్చి యీమాటలు చెప్పెను. వాఁడు నా కిరువదియేండ్ల చెలిమికాఁడు. నేను సర్వకాంతార రహస్యములను వానినుండి నేర్చికొంటిని. ఏవయసులో నున్నపులి యెంత యెత్తెగురఁగలదు? ఏపులి యెట్లు ప్రవర్తించును? యెపుడు మీఁదికి వచ్చును? ఎపుడు తొలఁగిపోవును? ఎపుడు దాని బెదరించవచ్చును ? మీఁదికి వచ్చినపులినెట్లొడ్డు కొనవలయును? ఏతాదృశమైన సర్వవిద్యయు వాఁడు నాకు నేర్పెను. ఏ వన్యజంతువు తా నేవేళ విహరించును. వాని

యొక్క సహజమైన యాహారమేమి? ఏజంతు వెచటస్థావర మేర్పఱచుకొనును ఇవి యన్నియు వానికిఁదెలియును. ఒక జంతువుకొఱకు మాటుపెట్టుట యెట్లు? పెట్టినమాటు జంతువున కెఱుకలేకుండ గోపనముచేయుట యెట్లు' అడవిలో సంచరించుచుండఁగాఁ దీవ్ర విషజంతువులు తిరుగుచుండును. అవి కరచినచోఁ గుట్టినచో సద్యోమృతియే కాని వేఱుమార్గ ముండదు. వానికి సర్వప్రతిక్రియలును వాఁ డెఱిఁగినవాఁడు. ఇచట సర్పదంశనము జరుగును. వాఁ డేదో పసరు తెచ్చి పూయును. ఇంతయాకు తినిపించును. ఆ పామేమియు చేయదు. ఒంటిపూసతేలు కాంతారములందు భ్రమించు చుండును. అది కుట్టినచో దానికి తిరుగులేదు. అది దారి వెంటఁ బోవుచుండఁగా మన మొకకఱ్ఱ దాని కడ్డుబెట్టుదుము. అది యాకఱ్ఱను కుట్టును. ఆకఱ్ఱ క్రిందనుండి పైకి రెండుగా చీలును. అంత విషవంతమైన జంతువది. అది కుట్టినచో దానికిఁ బ్రతిక్రియలేదు. ప్రతిక్రియ యున్నదిగాని దాని నుపయోగించుటకు సావకాశ ముండదు. అందుచేత నతఁడు సర్వకాలముల చెప్పుచుండునుగదా! కాంతారములో జాగ్రత్తగా నడువవలయును. దేనియాపదనైననుఁ బరిహరించు కొనవచ్చునుగాని యొంటిపూసతేలు కుట్టినచో మనమేమియు చేయలేమనుచు. అట్లనునుగాని దానికిఁగూడ వానికిఁ బ్రతిక్రియ తెలియును. ఒకయాకుపసరు మోకాళ్ళవఱకు రాచి కొని తిరుగుచున్నచో నా యొంటిపూసతేలు దానివాసన వ్యాపించినమేర సంచరించక దూరముగాఁబోవును. అట్టి వృశ్చికభయము సర్వారణ్యములయం దుండదు. ఈమానిసి

పులియొక్క యడుగుజాడలు వాఁడు చూచిన బలిమకపర్వతమునందుఁ గలవు. ఆ పర్వతమునందు నీ యొంటిపూస తేళ్ళుకలవు. తక్కిన యేచోట్లను లేవు. దానికి బలిమక పర్వత మని పేరు. ఆపర్వతముమీఁదఁ గొన్నిలక్షలయేండ్ల క్రింద నిర్మింపఁబడిన యొకదుర్గముయొక్క శైథిల్యముయొక్క చిహ్నములుకలవు. పడిపోయిన కోటగోడలు పూడిపోయిన కందకము, విహరించిన గదులు, మొదలైనవాని చిన్నెలు దానిమీఁదఁ గనిపించును. దానికి బలిమకపర్వత మని పేరు. ఆ పర్వతము నధిరోహించుట చాల క్లిష్టమైనపని. సర్వ కాంతారక్రూరమృగములు దానియందు నివసించుచుండును. అల్పజంతువు లచటికేఁబోవు. పోలేవు. అందఱు వేట కాండ్రును తత్పర్వతాధిరోహణము చేయరు. చేయలేరు. వారికి భయము. ఇతఁ డొక్కఁడే చేయును. వీని పేరు 'తోహారు' ఈతోహారు మహాసాహసుఁడు. మహాధైర్య వంతుడు, అబద్ధమాడఁడు. బ్రహ్మదేవుని లెక్కచేయఁడు. ప్రతినిమేషము మృత్యువునకు సిద్ధముగానుండును. ప్రతినిమే షము సింహపరాక్రమమును సాహసమునుఁ బ్రకటింపఁగలఁడు. వాఁడు తొలుత నీ పులియడుగులు చూచిననాఁడు దాని ననుస రించెడివాఁడే. కాని యాపులియడుగులు వరుసగాఁ గని పిఁచలేదు. పర్వతముమీఁద ఱాతినేలయందు జంతువుల యడుగులు గనిపించవుకదా! ఆ పర్వతముపైన నొకప్రదేశ మున్నది. అదియొక చిన్నచెఱువు. ఆ చెఱువు నొడ్డున నిసుకయు మట్టియుకూడియుండుటచేత నచటమాత్రమే నీ యడుగు కనిపించినది. అది సగముపులియు సగము మనిసియు

నైన జంతువై తీఱవలయును. లేనిచో నచట మానిసియడుగు కనిపించుటకు వీలేలేదని వాఁడు వాదించెను. నీవు వెళ్ళితివి కదరా! నీయడుగు పడరాదాయని నేనంటిని. అతఁడు స్వామీ నాయడుగునకు నచటియడుగునకు చాల భేదము కలదు. నాది చిన్నకాలు. ఆ పురుషునిది పెద్దపాదము. మఱియు నాపులియొక్క ముందడుగులతోపాటు వెనుకటి యడుగుల గుర్తులుకూడ నుండవలయునుకదా. అవి లేనప్పు డేమనుకొనవలయును? అని యతఁడు పదివిధముల బోధించఁగా నాపులి యడుగులను చూతమని నేనును బలిమరము నకు బయలుదేఱితిని. బలిమరము నే నెఱిఁగియున్న పర్వతమే. క్రొత్తదికాదు. ఈ మగధరాజ్యమునకు మొట్ట మొదటిరాజు కురురాజునకుఁ బూర్వుఁడు. అతనియునికి కలియుగము ప్రవేశించకపూర్వము వేయియేండ్లక్రిందటి నుండి యీ మగధరాజ్యమునఁ దెలియును. అతఁడు గిరి వ్రజపురము రాజధానిగా నీ మగధరాజ్యమునుఁ బాలింప నారంభించెను. అతనితరువాత నైదువందలయేండ్లకు నుపరి చరవసువు మగధములనుఁ బాలించెను. కలి వందయేండ్లకుఁ బ్రవేశించుననఁగా జరాసంధుఁడు రాజ్యముచేసెను. ఆనాఁడీ రాజవంశమునకు-బార్హద్రథవంశమని పేరు. ఉపరిచరవసువు యొక్క కుమారునిపేరు బృహద్రథుఁడు. ఇప్పుడు కలియుగ ములో రెండువేల మూఁడువందల సంవత్సరములు గడచినవి. అవి యొక వేయియేండ్లు. ఇప్పటికి మూఁడువేల మూఁడు వందల యేండ్లనుండి యీ మగధరాజ్యముయొక్క చరిత్ర తెలియును. కాని యీ బలిమరము తత్పూర్వకాలమునందలి

దని చెప్పుదురు. ఇది యంతటి పురాతనమైన పర్వతము. బలియన్నమహారాజు యయాతి సంతానములో నొకఁడుగా చెప్పుదురు. ఆతని కాఱ్ఱుఱు కుమారులనియు వారందఱు నీ భారతదేశమున నీ ప్రాచ్యభాగము నావరించి యుండెడివారనియు వంగవంగ కళింగ సుంహ పుండ్రాంధ్రదేశములన్నియుఁ బూర్వకాలమునఁ బ్రాచ్యకదేశమని చెప్పఁబడుచుండెననియు నందు దీర్ఘతముఁడన్న ఋషియొక్క దయవలన బలిమహారాజునకు నీ యాఱ్ఱుఱు కొడుకులు కలిగిరి. వారు తరువాత నీ ప్రాచ్యకదేశమునుఁ దమలో తాము విభాగించుకొనిరి. అంగుఁడన్న పేరుగల కొడుకు పాలించిన దేశమునకు వంగదేశ మనుపేరు వచ్చెను. అట్లే యాయా రాజ కుమారులు పాలించిన ప్రాంతములకు వారి వారి నామధేయములు వచ్చి యంగవంగాంధ్రాది నామములు కలిగెను. చమత్కార మెచ్చట నున్నదనఁగా నీ మగధదేశము బలిరాజుయొక్క యదుపులో నుండి యుండవలయును. ఈబలిపురమే బలిరాజుయొక్క రాజధానియై యుండవలయును. అతనికోట యిచ్చట నుండి యుండవలయును. అతని కొడుకులు తక్కిన భాగములన్నియు నావరించఁగాఁ దండ్రియొక్క నేల తండ్రిగానే మిగిలిపోయెను. దాని నెవ్వరు నాక్రమించలేదు. తరువాతఁ గొన్నివేల యేండ్లకు వారు పిగు వచ్చి దీనిని పాలించుటయు వదలిపెట్టుటయుగా జరిగియుండును. ఎప్పుడో వచ్చి బార్హద్రథు లాక్రమించిరి. కాని యీ పడిపోయిన కోటకు బలిమఠమన్న పేరట్లే మిగిలిపోయినది. కొందఱు బౌద్ధసన్యాసులు వచ్చి దీనియందు నివాస మేర్పఱచుకొనుటకుఁ

ప్రయత్నించిరి. కాని సులభనిర్వాణ ప్రాప్తిహేతువున దానినిఁ బరిత్యజించి పోయిరి. ఆబలిమతమునకు తోహారుతో నేను బయలుదేఱితిని. నిన్న ప్రొద్దున బయలుదేఱితిని. నేను బయలుదేఱినది బలిమత పర్వతమునకు. నా పాదము లింకొక పెడగా నీడ్చినవి. దారిలో నొక చిన్న ప్రవాహము కలదు. అది నదికాదు. వాగుకాదు. దానిపేరు అరిష్టా నది. అది దాటినఁగాని సూటిగా బలిమతమునకుఁ బోము. నేను దానికి కుడివైపున తిరిగి మొగనకుఁ బోయితిని. అచట నది దాటితిని. ఈ గుహాముందు జలపాతము జరుగును. లోయ కలదుకదా! ఆ పడుచున్న నీళ్ళు కొంత దవ్వున వాగుగా కట్టి యా వాగుపైననున్న మహా తటాకములో పడును. నిన్న ప్రొద్దుగ్రుంకువేళకు మే మా తటాకపుటొడ్డు చేరితిమి. తటాకపు పశ్చిమ ప్రదేశమునందు నా యద్భు వ్యాఘ్రపు పాదచిహ్నములు చూచితిమి. దాని మర్మము తెలిసికొనుటకు నచటి యొకచెట్టుపై నుంటిమి. అర్ధరాత్రమున నాపులి వచ్చినది. నేను దానిని వెన్నాడితిని. చెఱువులో నీదుచు దానివెంటఁబడి వచ్చితిని. బురదలో గుంటలలో ముండ్లలో చీఁకటిలో నీవాగులో ప్రవాహమున కెదురుగా దానిని వెన్నాడుచు వచ్చితిని. చివర కాపులి యీగుహ లోనికిఁ జొచ్చెను.

ఇంతసేపు నా పురుషుఁడు మాటాడలేదు. రాజ పురుషుఁడు మఱల నిట్లనెను. స్వామీ! ఈసృష్టిలో నెచ్చోట నేయాశ్చర్యముండునో తెలియదు. అట్టిపులి యున్నట్లు మన పురాణములలో నెచ్చటనులేదు. వాడుకలో లేదు.

అనేక జీవరాసులలో నట్టిజంతువుండుననన్న ప్రథ కూడలేదు. అర్ధరాత్రమునఁ దటాకములో దాని వెనుక నీదెడువేళ దాని స్వరూపము నాకుఁ దెలియదుగాని తెల్లవాఱిన తరువాత నా పులి జలప్రవాహమునువదలి గుహలోనికి వచ్చుచుండఁగా దాని పశ్చాద్భాగమును విస్పష్టముగాఁ జూచితిని. నా సందేహము తీఱినది." అనఁగా నాపురుషుఁ డిట్లనెను. "సందేహ నివృత్తికొఱకేగదా వచ్చితివి. సందేహనివృత్తి యైనది. ఇంకఁ బోవచ్చును." రాజ:-స్వామీ! నా ప్రవర్తనచేత తమకుఁ గోపము తెప్పించితినా? పురు:-నాకుఁ గోపమెందుకోయీ! నీవింత కట్టుకథయల్లి చెప్పితివి. విశ్వసింపరానికథ చెప్పితివి. ఆపులి యీ గుహలోనికి వచ్చెనంటివి. ఇంక నేనేమి చెప్పవలయును? నే నిచ్చటనే పండుకొని యుంటిని. ఈగుహలోనుండి మఱియొక గుహలోనికి త్రోవలేదు. పులివచ్చినచో నాకుఁ గనిపించవలయును గదా! నేనాపులిని చూడలేదు. ఆపులి యెట్లుండునో నాకు తెలియదు - నీకన్ను చెదరినదేమో! రాజ:-స్వామీ! కన్ను చెదరుట యనఁగా నిమేషైకదేశమున జరుగును. ఒకనిశాకాలమునందలి సగభాగము కన్ను చెదరియుండునా? పురు:- అల్పకాలమునందు కలిగిన భ్రాంతికి కన్నుచెదరుటయందురు. దీర్ఘకాల మున్నదానిని భ్రాంతియందురు. ఆ భ్రాంతి కావచ్చును. మఱియును నీవు పులియొక్క పృష్ఠభాగమును చూచిన దెంతసేపు? కొలఁదిసేపేకదా? ఆపులి గుహలోప్రవేశించుచుండఁగాఁ జూచితివి. అపుడు దాని పృష్ఠభాగము పురుషాకృతి మత్తుగాఁ గనిపించినది. దానిని నేను కన్ను

చెదరుటయందును. నీవు భ్రాంతి యనుకొనుము. రాజ:- అయినచో నడవిలో తోపారుచూచిన కాలిగుర్తులు నేను చెఱువు నొడ్డున చూచిన కాలిగుర్తులు నేమికావలయును? పురు:-అవి యేమికావలయునన్న ప్రశ్నకాదు. అవియట్లు కనిపించినవి కనుక నీ పులియొక్క వెనుకటిభాగము మానిసి కావలయును—రాజపురుషునకు నా పురుషునియొక్క వివేకము కత్తివాడి కలదిగాఁ గనిపించెను. అతఁడు మాటను మఱలించుటలో నెంత యొడుపుకలవాఁడు. ఇప్పటికి రాజ రాజపురుషునకు గుహాంతర్భాగ మంతయు జక్కగాఁ గని పించుచున్నది. ఆపురుషుఁడు పండుకొన్నచోటినుంచి ఇంత సేపు లేవలేదు. అతనిక్రింద వన్నెల వన్నెల పొడి యలకఁబడి నట్లుండెను. ఈపొడి యేమి? ఇతఁ డిందులోఁ బండుకొనుట యేమి? ఇతని కింతటి వివేకమేమి? నివసించుట కింతటి గూఢ కాంతారగత శిలాగుహాయేమి? ఇతఁ డింతటి నిశ్చలుఁ డేమి? రాజపురుషుఁ డిట్లనెను. స్వామీ! మనస్సు చెడ్డది కదా! దాని కేదో సందేహము కలుగును. ఆ సందేహము యొక్క యాథార్థ్యము తెలిసికొనుటకది ప్రయత్నించును. ఎంతసేపు మనస్సు తాను నిర్మించుకొన్న యూహలఁమీఁదనే నడచును. చూచిన విషయములను తన యూహలతో పొసఁగించుకొనును. ఒక లౌకికమైన సామంజస్యమును సమ కూర్చుకొనుటకుఁ బ్రయత్నించును. పురు:- భ్రాంతియన్న దచ్చటనే యుదయించును. మనస్సులో నేమియు పెట్టుకొన కుండ విషయమును విషయముగాఁ జూడఁగలశక్తి నలవఱచు కొన్నచో నిట్టి భ్రాంతులు పుట్టవు. రాజ:- స్వామీ! అట్టి

స్థితి సాధ్యమా? పురు:- సాధ్యముకాదు. కాదు కనుకనే లోకమంతయు నీరీతిగా నున్నది. రాజు, రాజ్యము, దైవములు, గౌరవములు, మర్యాదలు, సర్వమైన యీ భావ ప్రపంచకము బుద్ధియం దారోపితమైన విషయములు. ఆరోపితముగాని బుద్ధి లేనేలేదు. అదియె యీ సృష్టియొక్క ప్రధాన జాడ్యము. రాజ:- తమవంటి యోగులకు నట్టి స్థితి సుకరముగాని మాదృశులకుఁ గాదు. పురు:- ఒక మాట చెప్పెదను వినుము. తమవంటి యోగులకంటివి. నేను యోగి ననుచుంటివి. యోగియన్న దొకమాట. నేను యోగిని కాను. అట్టి శబ్దము నాయందుఁ బ్రయోగించుటకు నే నంగీకరించను. యోగ మనునది యనూచానముగా వచ్చుచున్న మానవ జాతిలోని యొక సాధనా మార్గము. నా కేమార్గమును లేదు. నేను నిరాలంబుఁడను. అప్రమేయుఁడను. నీతో మాట్లాడుచున్నాఁడను. కనుక నీ మాట యుపయోగించుచున్నాను. నా కీ లోకమునందలి శబ్దజాలము నందే తిరస్కృతి కలదు. ఈ సర్వశబ్దములు కొన్ని కొన్ని భావముల ప్రేరేపణచేత సమావిర్భవించినవి. ఆ శబ్దముల యొక్క యుదయమునకు హేతువులైన తత్తద్భావముల యొక్క స్థితియందే నాకు విశ్వాసములేదు. యోగమన్న మాట నొక పద్ధతియైన జీవసాధనయం దుపయోగింపఁబడెడు మాట. ఈ నడుమ నొకఁడు యోగమునకు రూపముకల్పించి దానినొక శాస్త్రముచేసి దానికి సూత్రములను వ్రాసెను. నీవు వింటివా? రాజ:- చిత్తము. విన్నాను. ఆయన పేరు పతంజలి మహర్షి. మారాజుపేరు సుశర్మ. ఈయన కాణ్వాయనుఁడు

ఇపుడు మగధదేశములు కాణ్వాయనులు పాలించుచున్నారు. ఈ కాణ్వాయనులలో మొదటివాఁడు వాసుదేవుఁడు. ఆయన యెనుఁబది యైదేండ్లక్రింద శుంగవంశపు చివరిరాజైన దేవభూతిని వధించి యీరాజ్యమునకు వచ్చెను. ఆ వాసుదేవునకీ సుశర్మ మునిమనుమఁడు. శుంగవంశపురాజులు మగధములను మూఁడువందలయేండ్లు పాలించిరి. ఆ శుంగవంశపు రాజులలో ప్రథముఁడు పుష్యమిత్రుఁడు. ఆయన కలి ప్రవేశించిన తరువాత పదునెనిమిదివందల యెనుఁబదియేండ్లకు మగధముల నాక్రమించెను. తత్పూర్వులు మౌర్యవంశులు. తత్పూర్వులు నందులు. తత్పూర్వులు శిశునాగులు. తత్పూర్వులు ప్రద్యోతులు. తత్పూర్వులు బార్హద్రథులు. ఈ మగధరాజ్య చరిత్రమేమోకాని యిన్నివంశములు మాఱినవి. మాఱినప్పుడెల్ల తత్పూర్వరాజును వాని సేనానాయకుఁడు వధించి రాజ్య మాక్రమించుటగానే జరిగినది. అది యట్లుంచి నేఁటికి మూఁడువందల యెనుఁబది యేండ్లకు పూర్వము పతంజలి మహర్షి యుదయించెను. ఆయన యెప్పు డుదయించెనో తెలియదుకాని పుష్యమిత్ర మహారాజు కాలములో జీవించియుండెనన్నమాట యథార్థము. ఆయన వ్యాకరణమునకు మహాభాష్యము వ్రాసెను. యోగశాస్త్రమునకు సూత్రములు నిర్మించెను. పురు:-అబ్బో! నీవు పెద్ద పండితుఁడవే. మాకా యోగము - గీగము గిట్టదు. అది యంతయు నొక కితవమార్గము. రాజ:-స్వామీ! తమవంటి మహానుభావులే యిట్టిమాటలన్నచో నీజీవలోక మేమికావలయును? పురు:-ఇదివఱ కేమైనది? ఇప్పు డేమగుచున్నది? రేపే

మగును? నీ వింతకుమున్ను చెప్పిన లెక్క ప్రకారమే యీ మగధదేశము కొన్ని లక్షలసంవత్సరములనుండి యున్నది కదా? ఆ బలియన్న రాజెవఁడో తెలియదుగదా! వానికొడుకుల పేళ్లనుఁబట్టి యంగ వంగ సుంహాపుండ్ర కళింగాంధ్ర దేశము లేర్పడినవి. మగధదేశ మెవ్వనిపేర నేర్పడినది? ఆపర్వత మొక్కఁడుమాత్రము బలిమతముగా నున్నది. ఓయీ! ఈ పురాతనకథలు నాకు చెప్పకుము. నాకు వానియందు విశ్వాసములేదు. అవియన్నియు నభూతకల్పనలు. తొట్ట తొలుత కల్పించినను నడుమ నింకెవఁడో కల్పించినను కొన్నాళ్లు పోయినతరువాత మఱియింకొకఁడు కొంతమార్పుగాఁ జెప్పినను సర్వమును మిథ్యావాదములు. స్వార్థపరత్వముతోఁ గూడిన మాటలు. రాజ:-అయినచో యథార్థమేది? పురు:- నీ విందాకనే యాఁకలి యగుచున్న దంటివికదా? ఆ యాఁకలి యేమైనది? రాజ:- తమరి యమోఘ దర్శనము చేత నే నాఁకలిమాటయే మఱచిపోతిని. స్వామీ! తెల్ల వాఱలు నీటిలోననే యుంటిని. వేఱే స్నానము చేయ నవసరములేదు. తమ రేదైన నిప్పించినచో భుజింతును. పురు:- ఇంతకును యథార్థమేది యని యడిగితివి. నేనా యథార్థమును చెప్పుటకు మొదలుపెట్టినచో నీవు క్షుత్తుమాట మఱల మఱచిపోదువుగదా? రాజ:- మఱచిపోదును. దాని పేరే యోగము. ఒక విషయమునందు వ్యగ్రమైన బుద్ధి తక్కినవానిని మఱచిపోవును. అట్లు సాధన చేసినచో సిద్ధి కలుగును. పురు:- సిద్ధి యనఁగా? రాజ:- ఈ లోకమంతయు వట్టి మనోవికారము. మన యూహలచేత కల్పించుకొన్నదే

గాని యథార్థమైనది కాదు. పురు:- నీవు చూచిన పులియు నట్టిదే. రాజ:- చిత్తము. నా కాఁకలి యగుచున్నది. పురు:- అగుచున్నదని నీ వనుకొనుటయే. రాజ:-స్వామీ! ఈ ప్రసంగము మాలినవేళ నాకు క్షుత్తు తలసూపుచున్నది. పురు:- ఆ ప్రసంగమునందే మనస్సు నిలఁబెట్టుము. రాజ:- తమరు ప్రసంగమును మానివేసితిరికదా! పురు:- ఓయీ! నా గుహాలో నేమియు లేదు. నేనే యడవిలోఁ దిరిగి కాయ గసరు లేఱికొని తిందును. ఆ వాగులోని నీరు త్రావుదును. నీవుకూడ పోయి యోగ్యములైన ఫలములు లభించినచో తిని రమ్ము. సరేకాని నీ బొడ్డులో కైజారు కలదు; నీ చేతిలో ఖడ్గమున్నది; ఆ పులిని సంహరించుటకు వచ్చితివా? ఆపులి నన్ను చంపుటకు వచ్చినచో సర్వజీవులాత్మరక్షణము చేసికొందురుకదా! పురు:- ఆ పులి నీవు చెప్పినట్టిదైనచో సది వట్టి పులికాదు; దానిని నీవు వధించి యుండజాలవేమో యనిపించుచున్నది; రాజ:- కాను వచ్చును; దాని చేతిలో నేనే చనిపోయినచో చనిపోయియుందునుగాక! పురు:-ఓయి పిచ్చివాఁడా! ఇట్టి సాహసమువలన నేమి ప్రయోజనము? బ్రతికియున్నచో బలుసాకుతిని బ్రతుకవచ్చును; నామాట విని యెచటనో నాలుగు పండ్లు కోసికొని తిని మఱల నీదారిని నీవు పొమ్ము; రాజ:- నాకు దారియన్నది తెలియదు; ఈ వాగు వెంటఁ దటాకము చేరుదును; అచటినుండి యెంతద వ్వేద వలయునో తెలియదు; ఏ దెసకుఁ బోవలయునో తెలియదు; పురు:- వచ్చినదారి నెఱుఁగవా? రాజ:- ఆ పులివెంట నీదుకొంచు వచ్చితిని; అర్ధరాత్రివేళ నా కేమియుఁ దెలి

యదు; పురు:- మఱి యెట్లు పోదువు? రాజ:- ఒక్కటియే మార్గము; ఇచటనేయుండి యాపులి మఱల బయలుదేరు వేళఁ బ్రతీక్షించి దానికి తెలియకుండ వచ్చినట్లే వెనుక నీదికొంచుఁ బోవలయును; అప్పుడది యచ్చోటికిఁ బోవును; నేను దాని వెంటఁ బోదును; పురు:- నీ వెంట మీతోహారు రాలేదా? రాజ:- తమరికి వాని పేరు జ్ఞాపక మున్నదే. పురు:-నీ వడవిలోనికిఁబోయి యేదైన తినిరమ్ము. రాజ:- నాకు తినివచ్చుటకు తీరికలేదు. తోహారును నే నొక చెఱువుగట్టుమీఁద వృక్షముమీఁద వదలిపెట్టి వచ్చితిని - వాఁడు నాకొఱ కెదురుచూచుచుండును. ఇవ్వేళ పగలు రెండుజాములు కాకపూర్వమైనను నే నచటికిఁ బోలేకపోయి నచో వాఁడు గుబ్బిసలాడును. ఏమిచేయవలయునో తెలి యదు. పురు:-నిన్ను వెదకికొనుచు నిచ్చటికి వచ్చును. రాజ:-వానికి త్రోవ తెలియదుకదా! పురు:-నీవు బలిమత పర్వతమునకు పోవుద మనుకొంటివి. ఈ చెఱువుగట్టునకు వచ్చితివి. నీకు త్రోవ తెలిసియే వచ్చితివా? ఏదో గ్రుడ్డి వేటుగా వచ్చితివి. అట్లే వాఁడును రావచ్చును. రాజ:- స్వామీ! నేను గ్రుడ్డివేటుగా వచ్చినను నాకా ప్రదేశము లన్నియు తెలియును. పురు:-మీ తోహారున కీపర్వతము తెలియదని నీకెట్లు తెలియును? వాఁడు సర్వదా యడవులలో నుండెడివాఁడు. నీవు వేటకు వచ్చినపుడుమాత్రమే వాని ననుసరింతువు. ఇదివఱకు నీవీ చెఱువు చూచితివా? రాజ:- నేను చూడలేదు. ఇట్టిచెఱువున్నదని విన్నానుగాని చూడ లేదు. పురు:-అతఁడు చూచెనా? రాజ:- చూచితిననియే

చెప్పెను. పురు:- అట్లుచూచినవాఁడు సహజముగా నాట విముఁడై యుండి యీ చెఱువులోనుండి వెనుకనున్న కొండలకు త్రోవ యెట్లో ఆకొండలలో నేమున్నదో చూడకుండనుండఁడు. వాఁ డీ పర్వతమునుచూచియే యుండును. ఈపర్వతము మనుష్యున కగమ్యమైనచో నేనువచ్చి యిచట నివసించుట సంభవించదుకదా! నావలెనే యింకొకఁడువచ్చి యిచ్చోటు చూచియుండును. నీ తోహారు నీవుచెప్పినట్టివాఁడైనచో వానికేమియు భయములేదు. వాఁ డీదుకొని రాఁగలఁడు. ఈ ప్రదేశము కనుఁగొనఁగలఁడు. మఱియు వాఁడు నీకిరువది యేండ్లనుండి మిత్రుఁడైనచో నిన్నుఁ దప్పకుండ వెదకికొంచు వచ్చును. రాజు:-నాకాఁకలి యగుచున్నది. పురు:-ఓయీ! నీ వడవిలోనికిఁబోయి పండ్లుకోసికొని తినుట కిష్టములేదా? ఇచ్చటనుండి వెళ్ళినచో నీవులేనపుడు నా గుహాలో నేవో విచిత్రములు జరుగును. వానినిఁ జూచుట సంభవించదని భయమా? నీవున్నంతసేపు సంభవించవేమో! ఆ సంభవించెడి చిత్రములు నీవు వెడలినతరువాతనే సంభవించునేమో! నీ విచ్చటనే యున్నచో చిత్రములు సంభవింపవు. లేనిచో సంభవించును. నీవిచటనుండుట యాచిత్రములు జరుగును? పురు:-ఓయి పిచ్చివాఁడా? నిన్నుఁ బ్రితారించుటకంటె నీ గుహాలో నేమియు జరుగవు. పోయి క్షుత్తునార్పికొనిరమ్ము. రాజ.-నేనిచటనుండి పోలేను. ఏమైన తమగుహాలోనున్నచోఁ బెట్టుడు. తిని జలపాతముకడకుపోయి దప్పి తీర్చికొని వత్తును. పురు:- దప్పి తీర్చికొనుటకైననుఁ బోవలయునుగదా! ఆ జరిగెడి చిత్రమేదో నీవు వాగువద్దకుఁ బోయినప్పుడు జరిగి

నచో నేమి చేయుదువు? రాజ:- స్వామీ! క్షమింపుడు. ఇచట నేవో చిత్రములు జరుగునని నే ననుకొనుటలేదు. నిజముగానే క్షుధాతురుఁడనై ప్రస్తుతము సత్త్వహీనుఁడనై యున్నాను. పురు:-అట్లయినచో నేను నీకుఁ గొన్ని ఫలము లొసంగెదను. కాని యీ ఫలములనుఁగూర్చి నీకుఁ గొంత చెప్పవలయును. ఆ ఫలములు నేను కోసికొని రాలేదు. నే నారగించు ఫలములు నేను కోసికొనిరాను. ఈ యడవిలో నొక వానర మున్నది. అది యీ ఫలములను కోసి తీసికొని వచ్చును. రామాయణ కథలో చెప్పినట్లు వానరమది ప్రతి ఫలమును కొఱికి తీసికొనివచ్చును. క్రోఁతి పండ్ల గాట్లుగల ఫలములే నా గుహలో నుండును. మఱియు నా వానర మా ఫలములను తీసికొని వచ్చినంతనే ప్రతి ఫలమును నేను గూడ కొఱికి రుచి చూతును. ఆరీతిగా నాగుహలోనున్న ఫలములు మున్నిద్దఱిచేత కొఱుకఁబడి రుచి చూడఁబడి యున్నవి. మొదటిది వానరము. రెండవది నేను. నీ కిష్ట మైనచో నా ఫలములు నీకిత్తును. వానరముయొక్క యెంగిలి యెట్లు తిందువు? రాజ:- తమ యెంగిలి తిన్నను వానరము యొక్క యెంగిలి యెట్లు తిందును? పురు:- నా యెంగిలి తినుట కభ్యంతరము లేనపుడు వానరమునెంగిలి తినవచ్చును. నేను దాని యెంగిలి తింటినికదా! ఆ పండ్లు నీకుఁ గావలసి నచో నా మూల నున్నవి. అవి తెచ్చికొని తినుము—

రాజపురుషుఁ డా మూలకుఁబోయి యాఫలములను తెచ్చెను. కొన్ని జామిపండ్లు, కొన్ని మామిడిపండ్లు, కొన్ని యేవో యడవిపండ్లు. పరిశీలింపఁగా నా ఫలములమీఁద కోఁతి

దంతములుగాని మనుష్య దంతములుగాని దిగినజాడ కనిపింపి లేదు. "స్వామీ! ఈ ఫలములు శుభ్రముగా నున్నవే. వీనిలో గాట్లు కనిపించుటలేదే! పురు:- అట్లైనచో మఱియు నయము. తినుము. తినుము. తినకముందు నీతో నొకమాట చెప్పవలయును. నీ వాఫలములు తిన్నచో నీవు నాకు శిష్యుఁడ వైపోదువు. నేను చెప్పినట్లు విందువు. నీకు స్వాతంత్ర్య ముండదు. నీ యుద్యోగమేమియో నాకు తెలియదు. నీ యూరు నాకు తెలియదు. నీ పేరు నాకు తెలియదు. నే నిచట నిన్నుండిపొమ్మన్నచో నీవుండిపోదువు. ఇంటికి పోవలయునని నీ వనుకొన్నను నాయాజ్ఞ లేకుండఁ బోఁజాలవు. యథార్థము చెప్పితిని. నీ కిష్టమైనచో తినుము. రాజ:- స్వామీ! తమరు నన్ను పరీక్షించుటకు చెప్పుచున్నారు. ఈ ఫలములు తమరిచేత కొఱుకఁబడనుఁగూడ లేదు. ఈ గుహలో నొక దేవతయు లేదు. వానికి నైవేద్యమైన ఫలములుగూడ కావు. మీరువట్టి యోగులేకాని గుపాసకులుకారు. ఒక యుపాసకుఁ డెవఁడైన నుండినచో వానినిఁగూర్చి యిట్లు మాటాడవచ్చును. మీ గుహలోనున్న ఫలము లారగించి నంతమాత్రముననే నట్లైపోవుదునన్న భయమునాకు లేదు. అయినను నాకుభయములేదు.—అని రాజపురుషుఁడు తత్ఫల ముల నారగించెను. రాజపురుషుఁ డా గుహలోఁ బ్రవేశించి నది మొదలు పురుషుఁడచటినుండి లేవనేలేదు. ఆ వన్నె పన్నెల పరాగరాశిలోనుండి యటు నిటు పొఱలుచుండెను. ఆ పొఱలుటలో నెంతవఱకును బోర్లబొక్కలుగాఁ దిరుగు చుండెనేగాని పార్శ్వమునకుఁగాని వెలకింతలుగాఁగాని పండు

కొనుటలేదు. అతఁడు తనముంజేతులను తనయురముక్రింద నుంచికొని వానిని తిరిగి తిరిగి కర్షణముచేయుచున్నట్లు కనిపించెను. రాజపురుషునకు క్షుత్తు బలవత్తరముగానుండెను. ఆ ఫలములను తాను కడుపార నారగించెను. కడుపు నిండిన తరువాత "స్వామీ! యేటిలోనికిఁబోయి నీరు త్రావివచ్చెదను" అని వెడలిపోయెను. అతఁడు వెడలిపోయిన తరువాత గుహాలోనున్న యా పురుషుఁడు తనచేతులు చాచెను. ఆ యెఱ్ఱని ధూళితో బాహుదండములు ముంజేతులు హస్తములు మాటిమాటికి రాచుకొనుచుండెను. ముంజేతుల యందు సన్నని లోమములుకలవు. ఆ లోమములు పోవుటకు నతఁడేదైన ప్రక్రియా విశేషము తెలిసికొని దాని నభ్యసించుచుండెనేమో! అట్టి వన్నెలధూళితో ముంజేతులను పులుముకొని, రాచికొని నలచినచో నాలోమములు తగ్గిపోవునేమో! రాజపురుషుఁడు వచ్చులోపల నతఁడు లేచి నిలుచుండి యావన్నె యలధూళినంతయుఁ ద్రోవుచేసి తానుకూడ స్నానార్థము బయలుదేఱెను; అప్పటికి జాము పొద్దెక్కెను; రాజపురుషుఁడు గుహకు తిరిగి వచ్చుచుండెను; ఇతఁడు వాగు వద్దకుఁ బోవుచు నే నిప్పుడే వచ్చెదను; స్నానముచేసివత్తును. నేను వచ్చువఱకు నీవుగుహాలో నుండుమనెను; ఆపురుషుఁడు మాటాడుచుండఁగా నతని వదన బిలమునుండి యొక విచిత్రమైన వాసన వినిర్గమించుచుండెను. ఆ వాసన యొక్క స్వరూపమేమో రాజపురుషునకుఁ దెలియలేదు. అదియేమి వాసన? తా ననేకవిధములైన వస్తువులవాసనలు తెలిసినవాఁడు. ఈ వాసన యెప్పుడు నెఱుఁగఁడు. రాజపురుషుఁడు

గుహలోనికిఁ బోయెను. పోవుచు యీ పురుషుఁ డెవరు? పులి యేమైనది? ఈ గుహలోనికి నా వ్యాఘ్రము పోవుచుండఁగా నేను నా కనులార చూచితిని. ఇతఁ డది భ్రాంతి యనును. ఇతని సిద్ధాంతమేమి? ఇప్పటి వఱకున్న సర్వభాషయుఁ గృత్రిమమనుచున్నాఁడు. ఏవో భావములు పెట్టికొని తద్భావము లర్థములగునట్లు కల్పించఁబడిన శబ్దసముదాయ మనుచున్నాఁడు. లేనిచో శబ్దమెందుకు? లోనున్న భావము చెప్పుటకేకదా! అట్టిది కాని శబ్దముండునా? ఉన్నచో నది వట్టి సవ్వడి జంతువుయొక్క యఱపు. ఆ యఱపులోకూడ నొక భావముండును. క్షుధాతురమై యొకజంతు వఱచును. ఆ యఱపులో దానిక్షుద్బాధ భాసించును. ఏదియో యొక యర్థము లేకుండ శబ్దమెట్లుత్పన్నమౌను? ఒక కఱ్ఱ నింకొక కఱ్ఱతోఁ గొట్టుదుము. ఒక ధ్వని పుట్టును. దానియం దేమిభావ మున్నది? భావము లేకపోయినను దానియం దొక లక్షణ మున్నది. తాడనమను క్రియ జరిగినది. ఆ ధ్వని తత్క్రియా ద్యోతకముగా నుండును. ఒక గోడమీఁదకు నొక చెట్టుకొమ్మ వ్రాలియుండును. పెద్దగాలి వీచినపుడు చెట్టుకొమ్మ యా రాతిగోడ పైభాగమున గీసికొని యొక కీచు నినదము కలుగవచ్చును. అది యది యని జనులు విచారింతురు. తెలిసిన తరువాత నిర్భయులగుదురు. దానియందొక భావము లేకపోయినను అది యభావమయినను ఆ యభావ లక్షణమే దానియొక్క యర్థము. ఆ భావమును కొందఱ అంగీకరించరు. ఎందుకంగీకరించరాదు? వ్యతిరేకాన్వయ మున్నట్లే దానియందునొక సామంజస్యము

భాసించును. అచట నేదో యున్నదని భయపడుదుము. పోయి చూతుము. ఏమియును లేదు. భయము పోయినది. భయము పోవుట యనుదానికి హేతువేమి? అచట నేమియు లేకపోవుట. అచటి యభావమువలన నీ భయరాహిత్యము కలిగినది. ఆ యభావము ద్రవ్యముకాదు. ద్రవ్యమువలెఁ బలిచేయుచున్నది. శబ్దములు భావమయములు. భావము లేకుండ శబ్దములేదు. ఇతని దండయాత్ర శబ్దముమీఁదనా? భావముమీఁదనా? ఇతని సంగతి పూర్తిగాఁ దెలిసికొనిగాని యిచటనుండి పోను. ఆ ఫలము లారగించినంతనే యితనికి నేను దాసానుదాసుఁడ నగుదునన్నాఁడే! ఆ ఫలములు తింటిని. జలములును సేవించితిని అనఁగాఁ దిన్న పదార్థము జీర్ణావస్థ కభిముఖమైన దశయందు ప్రవేశపెట్టితినని యర్థము. అది యంత నిజమైనచో నీపాటికి సూచనగానైనఁ దదభిమానము నాయందు స్ఫురించవలయును. అది మొదలుపెట్ట లేదు. ఇతఁడు స్నానముచేయుటకుఁ బోవుచున్నాఁడు. స్నానముచేయుట కొంతసేపు పట్టునుగదా! ఈ లోపుగా నా గుహలో నేమేమి యున్నదో పరిశీలింతును. ఆ గుహలో నుండి మఱియొకచోటికి మార్గముండవలయును. అది తగినంత పెద్ద త్రోవయే యగును. లేనిచో వచ్చినపులి యేమగును? ఆ పులివిషయము నాకు తెలియకుండ దాచుటకే యితఁడు త్రోవలేదని చెప్పెను. నేనచట నున్నంతసేపు కనులతోఁ ద్రోవకోసము వెదకుచునే యుంటిని. ఆ త్రోవ కనిపించ లేదు. అతఁడు పండుకొనియున్న ప్రదేశమునకు వెనుక భాగము గుహకుడ్యభూతమైనశిల ముందుకువచ్చి వెనుకదారి

యున్నట్లు సందేహముఁ గలిపించుచున్నది. అచ్చట నేము న్నదో చూడవలయును. అనుచు నతఁను గుహలోఁ బ్రవేశించెను. చీఁకటి యెప్పటికప్పుడే క్రొత్తమగుటఁ గన్నులు సరిగాఁ గనిపించలేదు. సరిగాఁ గనిపించువఱకు రెండు మూఁడు నిముసములు పట్టెను. కనిపించుట యారంభించిన తరువాతఁ దా నా స్థలమునకుఁ బోవలయుననుకొని యీ లోపుగా నా పురుషుఁ డేమిచేయుచున్నాఁడో చూడవలయు నని గుహలోనుండి బయటకు చూచెను. అతఁడు మహా వేగముతో గుహాభిముఖముగా వచ్చుచుండెను. అరే! ఇతని కేమిభయము? ఈ గుహలో నేమున్నది? తన సొమ్మును నే నేమి దొంగిలింతును? ఇతని రహస్యమిచట నేది బహిర్గతము కాఁబోవుచున్నది? ఒకవేళ నితఁడు వచ్చువేళకు నే నీగుహలో నున్న రహస్యమును కనుఁగొనుటకుఁ బ్రయత్నించుచుంటినని యతనికిఁ దోఁచినచో నతనికిఁ గోపమువచ్చునా? ఎందుకు రాదు? వచ్చి యేమిచేయును?. ఇతఁడు నన్నేమి చేయఁ గలఁడు? నేను ఫలము లారగించి జలములు త్రావినంతనే నా శక్తియంతయు మఱల నాకు వచ్చినది. నన్నిప్పు డేనుఁగైది రించియు నేమియు చేయలేదు. తోహారునకేమి? వానికి భయములేదు. ఒకవేళ నీపురుషుఁ డన్నట్లు వాఁడు నన్ను వెదకికొనుచు నిచ్చటికి వచ్చినను రాఁగలఁడు. ఏమైనను సరే. ఇచటనేయుండి యితని రహస్యము సంపూర్ణముగాఁ దెలిసికొని పోవలయును. గిరివ్రజ పురమునఁ గొన్ని తొందర పనులున్నవి. నేను నాల్గైదు దినములు రాజధానికి తిరిగి రానని చెప్పిరాలేదు. సుశర్మను రెచ్చకొట్టవలయునని యొక

రిద్దఱి ప్రయత్నము. నేను రాజును చేతిలోఁ బెట్టికొని యాడించు చుంటినని కొందఱు రాజబంధువుల కృత్రిమ వాక్కులుగానున్నవి. సుశర్మ యట్టిమాటలు వినఁడుగాని వినెడునంత వివేక మతనికిలేదుగాని కృత్రిములైనవారియూహ లకుఁ గొంత యెడమిచ్చినట్లగును. తోహారు వచ్చినచో నీలకంఠునకు వార్తనంపి యవసరమైనచో నేనిచటనే గొన్నాళ్ళుండుటకుఁ బ్రయత్నింతును. అని రాజపురుషుఁడు నవ్వి కొని మఱల నిట్లూహించెను. అతని ఫలములు తిన్నచో నిచ్చటనే యుండిపోవలయునన్న యూహ నాకుదయించునని యతడు చెప్పెను. ఊహ పుట్టిన కారణము వేఱుగాని ఫలితమొకటిగాలేదా? అతని రహస్యము కనుఁగొనవలయు నని నేనిచటఁ గొన్నాళ్లుండ వలయునను కొనుచుంటిని. ఫలితార్థ మొక్కటియే. అతని ఫలము లారగించితిని. నాకీ యూహ దృఢమైనది. ఇది చమత్కారముగానే యున్నది. కాని యింతదవ్వువచ్చి యేమియుఁ దెలిసికొనకుండ పోవుట వలన ప్రయోజనమేమి? వెనుఁదిరిగి పోయినచో మార్గము కనుఁగొనుట యంత క్లిష్టముకాదు. ఈ వాగు తటాకములోఁ బ్రవేశించినంతనే దాని యాతలియొడ్డు కనిపించదా? సము ద్రము కాదుకదా! ఆతలియొడ్డు కనిపించును. కనిపించుట కచ్చట కాంతారమున్నది. ఆతలికిఁ బోయినతరువాత నటు నిటు తిరిగినచో నా బయలుదేఱిన స్థలముకూడ కనిపించును. కొంత యిబ్బందియైనచోఁ గావచ్చును. వెళ్ళుటలో పెద్ద కష్టములేదు. కాని యిచట నుండవలయును. ఇది చూడ వలయును. ఆ వెనుక త్రోవ యున్నదో లేదో. ఉన్నచో నది

వేఱొక చోటికి పోవునో యేమో! ఆ పులి నిశ్చయముగ దాఁచుచుండెనేమో! ఎందుకు దాఁచుచున్నాఁడు? ఇతఁ డింకను రాలేదేమి? మఱల జలప్రవాహమువైపునకు జూడఁగా నా పురుషుఁడు కనిపించలేదు. అంత తొందఱగా వచ్చుచున్న వాఁ డేమయ్యెను? అంత తొందరఁగా నిచ్చటికి వచ్చుట కాదేమో ఆ లోయలో నెళ్ళినాఁడో యేమో! ఏమి పని మీఁద వెళ్ళినాఁడు? తానేమిచేయునో చూడవలయునని యెచ్చటనైన దాఁగియున్నాఁడా? తా నెచ్చటికో వెళ్ళినాఁడని నే ననుకొని యిచట నదియు నిదియు పరిశీలించు పనిలో నుండఁగా హఠాత్తుగా వచ్చి నాయందు దోషము నిరూపించునా? నిరూపించి యేమిచేయును? అతఁడు బలహీనుఁడుగా నున్నాఁడు. అతనివద్ద నాయుధము లేమియులేవు. నన్నేమి చేయఁగలఁడు? ఇతఁడు పిలిచినచో నా పులి వచ్చునేమో! ఆ పులి నామీఁదఁ గలియఁబడునేమో! అట్టిదొక్కటియే పులియా? ఇంకను కలవా? అట్టి రెండు మూఁడు పులు లున్నచో నవి యొక్కసారి వచ్చి నామీఁదఁ బడినచో నేనేమి చేయఁగలుగుదును—— అని రాజపురుషుఁడు గుహాముఖమునుండి వినిర్గమించి బయటకుపోయి యా చుట్టుపట్ల నా పురుషునికోసము వెదకెను. అతఁ డెచ్చటను కనిపించ లేదు. ఆ ఱాతి వెనుక నీ రాతివెనుక నెంతయో వెదకెను. అతని జాడ లేదు. ఇతఁ డేమైనాఁడు? ఇంతలో నేరీతి మటుమాయమైనాఁడు. తనకు తెలియని యొక సన్నిహిత రహస్య ప్రదేశ మచట నెచ్చటనో నుండవలయును. ఈ స్వల్పకాలములోఁ నతఁ డిచటనుండి కనిపించకుండఁ

బోవుట సాధ్యముకాదు. ఎట్లైనను కానిమ్ము. ఏదైన నది యగును. గుహలో నీ రహస్యమంతయు చూడవలయును. అని రాజపురుషుఁడు మఱల గుహలోనికిఁ బోయెను. ఈ లోపుగా మఱల నతఁడు గుహలోనికిఁ బ్రవేశించి యుండు నేమో యని యతఁ డనుకొనెను గాని యతఁడు లోనలేఁడు. ఇతఁడు గుహలోనికిఁ బోయెను. గుండ్రముగా తిరిగెను. తాను పండ్లుతీసిన స్థలమున్నది. ఒకచోట నతఁడు ధరించు దుస్తులు కలవు. నాలుగైదు కౌపీనములు రెండు మూఁడు వస్త్రములు. ఇంక నేమి యున్నవి? మఱియొకచోట నేవో యెండిన యడవితీగలు కలవు. అవి యేమైన యోషధులా? రాజపురుషుఁడు కుడ్యమువలెనున్న యా శిలాఖండమువద్దకుఁ బోయెను. తత్కుడ్యము వెనుక నేమున్నదో చూడవలయు నన్నచో నాపురుషుఁడు ప్రోవుచేసిపెట్టిన వన్నియల పరాగపు ప్రోవును దాటి పోవలయును. లేదా దానిలో కాలు వేయ వలయును. దానిలోఁ గాకపోయినను దాని ప్రక్కనున్న యా ధూళిపిహిత శిలాధాత్రీ భాగమునందు పాదము నుంచి తీఱవలయును. అతని కెందుకో తద్ధూళిని పాదతాడనము చేయుట యన్నచో నొడలు గగుర్పొడిచెను. ఈ ధూళి యేమి? ఇన్ని వన్నియల పరాగ మితఁ డెందుకు ప్రోవు చేసినాఁడు? ఈ పరాగమ్ములోఁ బండుకొని పొఱలుచున్నాఁ డేమి? శిలాఖండముమీఁదఁ బండుకొనుటకు కఠినముగా నుండును గావున పఱుపువలె మెత్తగా నుండుటకు ధూళిని పఱచుకొన్నాఁడా? తానతనితో చాలసేపు మాటాడినాఁడు. అంతకాల మతఁడు పొట్టమీఁదఁ బండుకొనినాఁడు. చేతులు

పొట్ట క్రింద పెట్టికొన్నాడు. ఈ పరాగము వానికి శయ్య. నిద్ర లేచిన తరువాత జనుడు ప్రక్క చుట్టుకొన్నట్లు వీడు ధూళిని ప్రోవుచేయునా? ఆ ప్రోవుమీద కాలు పెట్టకుండ నా గోడ వెనుక చూడకుండ వీలులేదు. ఆ గోడ వెనుక చూడకున్నచో నా గుహలోఁ జూచెడి దేమియు లేదు. ఆ గోడ వెనుక నిస్సందేహముగా త్రోవ యుండును. ఇంత తటపటా యించి మఱల నతఁడు వచ్చుచున్నాఁడేమో చూడవలయునని రాజపురుషుఁడు గుహా ముఖమునకుఁ బోయి చూచెను. అతని పొడ లేదు. తానా గుహలోనున్న సర్వ విషయములు చూడవలయు ననియే యతని యుద్దేశ్యము. లేనిచో వచ్చుచున్నవాఁడు వెనుతిరిగి యేల పోవును? కానిమ్ము చూతమని రాజపురుషుఁడు పాదమెత్తి యా వన్నియ ధూళిప్రోవుమీఁద పడకుండ ప్రక్కగా నుంచెను. దించి రెండవపాద మెత్తెను. అంతలో నతని యొడలు జలదరించెనా? దిమ్మెక్కెనా? స్తబ్ధమైపోయెనా? ఒక విష ప్రసరణము జరిగెనా? అతనికి తెలియలేదు. రెండవ కాలు తీసి దూరముగాఁ బెట్టవలయునా? పెట్టకూడదా? ఏమి చేయవలయును? ఇది వన్నియధూళియా? వ్యాజాగ్నియా? అతఁడు తన రెండవపాదమును ధూళిచేసినచోట దూరముగా వేసెను. వేసి మొదటిపాదమును తీసికొనెను. అప్పటికి చక్కగా నే స్థలమున మఱియొక గుహలోనికి త్రోవ యుండు ననుకొనెనో ఆ స్థలమునకుఁ బోయెను. అచటఁ ద్రోవలేదు. అదియొక గూడుగా నుండెను. లోతైన గూడు. ఆ లోపల రాతి గోడలో నాలైదు కొయ్య లమర్పఁబడి యుండెను.

అటునిటు తాళ్ళలో గూళ్ళు చెక్కఁబడి వానిలోనికి దాపు లమర్పఁబడి యుండెను. ఆదావురులమీఁద ననేకవస్తువులు సమకూర్పఁబడియున్నవి. కొన్నియడవియాకులుదొన్నెలు. కొన్ని కొంతపల్లముగలిగినతాటిముక్కలు. ఇవియేమి? అవియేమియో చూచుటకు మున్ను వానిమనస్సు పులిమీఁదికిఁ బోయెను. ఆపులి యేమైనది? ఇందులోనుండి మఱియొకచోటికిఁ బోవుటకు త్రోవలేనేలేదు. ఆపులి యేమైనది? ఈధూళియేమి? తనయడుగు దానిమీఁద పడినంతనే తన యొడలెల్లు జలదరించుటకు హేతువేమి? రెండుపాదములు నాధూళిలోఁ బెట్టినచో నేమగును? ఏమగునో? అది కాకపూర్వము గూళ్ళలో నరలలోనున్న ద్రవ్యములనుఁ బరిశీలించవలయును. పోయి పరిశీలించెను. అవి వన్నెవన్నెల ధూళులు. ఏది దేని ధూళియో తెలియదు. ఒకటి యెఱ్ఱనిది. ఒకటి పసుపు పచ్చనిది. ఒకటి నీలి వన్నెది. ఒకటి తెల్లగానున్నది. మఱియొకటి పసుపుపచ్చగానున్నది. ఇంకొకఁడు నీలము. పది పన్నెండు విధములైన వర్ణములుకల ధూళులు కలవు. ఈధూళులేమి? ఈధూళులన్నియుఁ గలిపినచో నతఁడు పండుకొనినచోటఁగల ధూళియగునా? ఈ దుమ్ములనే యతఁడు నేలమీఁదఁబోసి పఱచి మఱలఁ బ్రోవుచేసికొనుచుండునా? అట్లైనచో నన్నియుఁగలపియే యుండవచ్చును. విడి విడిగా నుంచుట యెందులకు ? ఇంతకంటె నాగుహలోఁ జూడవలసినదేమియునులేదు. ఇప్పుడు రెండుపాదములు ధూళిలోఁ బెట్టవలయును. ఏమగునో చూడవలయును. ఏమియైన నైనచోఁ జూచెడిదేమున్నది? అది యగుటయే. ఆ మైన

దెట్లుండునో? ఒకపాదము దానియందు నిక్షేపించు నప్పటికే తనయొడ లారీతిగా నఖశిఖాపర్యంతము నొక యవిజ్ఞాత చలనము జరిగినది. రెండుపాదములు దానియందు నిక్షేపించినచోఁ దనయొడలు తనకు తెలియదేమో? తానచటనుండి కదలఁడేమో! ఒకటాయి యగునేమో! అతఁడు రానే రాఁడేమో! తానట్లే యుండిపోవలయునేమో! సీసీ! అతఁడీ ధూళిని పఱచికొని పండుకొన్నాఁడు. పఱచికొని పండినచో నంతటి యేకనిష్ఠమైన తన్ముద్ర కలుగదేమో! అని యతఁడు కూర్చుండి యాధూళిని రెండుచేతులతోఁ బఱచ నారంభించెను. ఆధూళి చేతులకు తగులఁగా పాదములకు తగిలినప్పుడెట్లున్నదో అట్లేయున్నది. తన శరీరము జివ్వున లాగు లాగుచున్నది. ఏదోమార్పు పొందుట కభిముఖముగా నున్నట్లున్నది. అతఁ డా ధూళిని పఱచెను. పఱచిన తరువాత నింకొక సందేహము తోఁచెను. ప్రోవుగానున్నప్పుడు దాటిపోవచ్చును. ఇపుడు త్రొక్కికొంచుఁ బోవలయును. ఇంతకును తద్ధూళి స్పర్శ తన రెండుహస్తములకు కలిగినది. తన యెడమ పాదమునకు కలిగినది. కుడికాలేమి పాపము చేసికొన్నది. అతఁడు లేచి నిలుచుండి ధూళిలో నడచి పోవుద మనిపించలేదు. ఎట్లును కూర్చున్నాము కదా! చేతులు దుమ్మైనవికదా! ఆ చేతులు ముందునకుసాచి జంతువు నడచినట్లు చేతులమీఁదఁ గాళ్ళమీఁద నడచి పోదమనిపించినది. అట్లే లేచినాఁడు. రెండుచేతులు రెండుకాళ్లు పఱచఁబడిన ధూళిలోనున్నవి. అతనికొక యూహతోఁచినది. నేనిపుడు మనుష్యుఁడనా? జంతువనా? తనయొడలు తాను

చూచికొన్నాఁడు. తాను జంతువుకాదు. తన మనుష్యావయవములు తనకుఁ గనిపించుచునే యున్నవి. కాని యా పఱచఁబడిన ధూళిలోనుండి బయటకుఁ బ్రాకిపోవలయును. ప్రాణ మొప్పుటలేదు. అప్పటి తన శరీరములో ప్రవహించు రక్తములో నొకవేడి యొకవేగము, ఒక సముత్సాహము, తజ్జనితమైన యొక సాహసము, ఒకబిలము, భాసించునట్లు దానిని వదలిపోవుటకు మనస్కరించనట్లు వానికిఁదోఁచెను. అతఁ డనుకొనెను. అయ్యో! ఒకజంతువున కిట్టి యనుభూతి యుండునా? దానికింత ధైర్యముండునా? దానికింత సాహసముండునా? అది తనజన్మనుఁగూర్చి తనబ్రతుకునుఁగూర్చి యింత తృప్తితో నుండునా? అన్నిజంతువుల కిట్లుండునా? ఒక మహావ్యాఘ్రమైనచో నొక మహారాజునకున్న ధైర్యము వంటి ధైర్యము దానికుండవచ్చును. తా నిప్పుడొకవ్యాఘ్ర జీవలక్షణముచేత సమావహింపఁబడెనా? అతనికి వెంటనే తెలిసినది. ఆపులి యెచ్చటికిని బోలేదు. ఆపులి యిచ్చటనేయున్నది. దీనినిఁగుఱించి యూహించవలయును. ఈ ధూళి పరిధినుండి తాను బయటికి పోవలయును. అపుడు గాని వానికి మఱల నూహ సరిగాసాగదు. ముందు చేతులానించి వెనుకకాళ్ళానించి పశ్వాకృతిగ నా పఱచఁబడిన ధూళిలోనున్న యతఁడు తానచటనుండి లేచుటకు తత్ప్రదేశమును దాటిపోవుటకు నతఁడెంతయో ప్రయత్నము చేయవలసి వచ్చెను. చేయి లేవదు. కాలు కదలదు. ఈధూళియందింత శక్తికలదా? అతఁడు పెగుల్చుకొని నెమ్మదిగా తనచేతులు పాదములు దూరముగాఁదీసికొనెను. వెలికి వచ్చెను. అతఁడు

తెల్లవాఱలు నా మహాతటాకము నీదెను. ఎంతయో కష్ట పడెను. అది యింతటి కష్టముగా లేదు. అతనికి వెంటనే యొక యూహకలిగెను. తానప్పుడే యొకజన్మను పరిత్యజించి యింకొకజన్మను స్వీకరించెను. అట్లతఁడు నిస్తబ్ధుఁడై యర గడియసేపు కూర్చుండెను. అప్పటి కితనికి పూర్తిగా తన స్మృతి తనకుఁగలిగెను. అతఁ డిట్లూహించ నారంభించెను. అతఁడేపులి. అతఁ డీ ధూళిలోఁ బండుకొనును. అతఁడు పులియగును అట్లైనచోఁ దానుకూడ కావలయును. అందు చేత వట్టిధూళిలోఁ బండుకొనఁగా నొడలు జలదరించుటయు దిమ్మెక్కుటయు మొదలైనవే జరుగునుగాని పులియగుట జరు గదు. ఆధూళి నొకవిధముగా పఱచవలయునేమో! కాదు. ఈధూళి పనికిరాదు. ఆయరలలోనుంచిన పలువన్నియల దుమ్ములతో క్రొత్తగా నేమిచేయవలయును? అన్నియుఁ గలిపి పఱచరుగదా! పఱచినచో నిదియే ధూళిగదా! దీని ప్రయోజన మింతియేగదా! కనుక నాదుమ్ములతో నేదో ముగ్గుపెట్టవలయును. ఏరంగుతరువాత నేదియో. ఆముగ్గు యొక్క స్వరూపమేమో! తనకుఁ దెలియదు. ఆపురుషు నకుఁ దెలియును. వాఁ డాముగ్గునువేయును. అందులో నతఁడు పండుకొనఁగాఁ దాను పులియగును. పాదములెందుకు కావు? అవి మనిసిపాదములుగానే యేలయుండెను? కొంత భాగము మనుష్యశరీరభాగముగా లేనిచో మఱల మనుష్యుఁ డగుట కష్టమేమో! లేదా యతని కావిద్య తద్దేశమునందు కొఱవడియుండెనేమో! అతఁడు మఱల నాముగ్గునంతయు నొకచోట ప్రోవుచేసెను. ఆ ప్రోవు నాగూటికి దూరముగాఁ

దొలఁగించెను. ప్రోవుచేసినంతసేపు తన కాయనుభూతి కలుగుచునేయుండెను. దానిని ప్రోవుచేసి మఱల నాగూటి వద్దకుఁబోయెను. అందులోనున్న దొన్నెలు రాతిచిప్పలు చేతితోఁదీసి చూచుచుండెను. ఇంతలో నతనికొక యాశ్చ ర్యము కనిపించెను. ఒకవరుసలో నడ్డముగా పెట్టఁబడినకఱ్ఱ వెనుక నొకఖడ్గ ముండెను. అతఁ డా ఖడ్గమును చేతితోఁదీసి కొనెను. అది మంచివాడిగానున్నది. ఆగూటిలో నైదర లున్నవి. అతఁడు తక్కిన నాలుగరలనుఁ బరిశీలించెను. ఒక్కొక్కయరలో నొక్కొక్క ఖడ్గమున్నది. ఐదు ఖడ్గ ములు. వీనితో నితఁడేమిచేయును? ఇతఁడు ఖడ్గవిద్యా నిపుణుఁడా? అడవిలో సంచరించునప్పుడు వనమృగములనుండి తన్నుఁ దా రక్షించుకొనుటకు ఖడ్గములను చేఁబూనిపోవునా? వాని నిచ్చట దాఁచెనేమి? చేతి కందుబాటులో పెట్టుకొన వలయునుగదా? అతని కర్థముకాలేదు. అయిదు ఖడ్గము లను మఱల యథాప్రకారముగా నున్న స్థలముల యందుంచ వలయునా? వలదా? అతఁడు వచ్చినతరువాత దానివి యన్ని యు వెదకెనని యతనికిఁ దెలియునుగదా! కాదు. ఈఖడ్గము లెచ్చటి వచ్చట పెట్టినమాత్రము వాఁడు తానివి యన్నియు వెదుకలే దనుకొనునా? అని ఆ రాజపురుషుఁడు ఖడ్గముల నైదింటిని ఱాతిగోడ కానించెను. వీని కొరలులేవు. ఖడ్గ ములు త్రుప్పువట్టిపోవును. ఒర లెచ్చటనైన నున్నవేమో యని మఱల గుహయంతయు వెదకెను. కొండగోడలో నేదైన తెలియకుండ మార్గమున్నదేమోయని యతని యొకఖడ్గమునుఁ దీసికొని గుహలోపల చుట్టును కుడ్యమునుకొట్టి చూచెను.

త్రోవయన్నదిలేదు. ఇంకఁదాను చేయవలసినపని యేమి కలదు? ఇతఁడేపులి. ఎందుకిట్లగుచున్నాఁడు? ఈవిద్యయెచ్చటిది? ఇది యశ్రుతపూర్వము. ఇతఁడే దీనికిఋషియా? ఇతఁడే దీనికి ద్రష్టయా? ఇదియేమిదర్శనము? మఱల నారాజపురుషుఁడు ఖడ్గముల నైదింటిని వాని యొదువనుసలలో నుంచెను. ఆ ధూళి ప్రోవు తొలుత నతఁడెచ్చటఁ జేసియుంచెనో యచ్చటికే త్రోసెను. తాను గుహాముఖమునకు వచ్చెను. అతఁడెచ్చటను కనిపించలేదు. శతవిధముల నతనికి భయము వేసెను. ఇతఁడెల్లును తన రహస్యమును తెలిసికొనును. తన్నేమి చేయునోయని అతఁడు పాఱిపోయి యుండును. తానచట నున్నంతవఱకు రాఁడు. ఇది యేమివిద్య? క్షుద్రవిద్య. మ్లేచ్ఛులవలంబించవలసిన విద్య. కిరాతులును శకయవన హూణులలోఁ బరమనీచులైనవారును సంపాదించెడు విద్య. సీసీ! దీనివలన నేమి ప్రయోజనము? తాను పెద్దపులియై యడవులవెంటఁ దిరుగును. అది సుఖమా? ఒక లేఁడిని చంపి తినును. పచ్చిమాంసమును తినును. అది తృప్తియా? ఎక్కువ తినుట కొందఱకుఁ దృప్తియే. దానినరగించుకొనుట యెట్లు? ఒక లేఁడిని చంపి తినినచో నా లేఁడిమాంసమంతయుఁ దన కడుపులో జీర్ణమగువఱకు తాను పులిగా నుండితీరవలయును. వెంటనే మనుష్యుఁడైనచో మానవుని యల్పప్రమాణమగు కుక్షిలో నంతటి పచ్చిమాంసము నిలచి జీర్ణమునకు రాదు. పొట్ట పగులవచ్చును. ఇట్లు విపరీతమైన యాహార వాంఛకొఱకా పెద్దపులి యగునది? అడవిలో నల్పమృగములు బాధించని యొక మహా

జంతుజన్మ కావచ్చును. తాను పులిగా నున్నప్పుడు తాను నిజమైన పులి యనుకొని యొక వేటకాఁడు మాటువెట్టి యంప కోలనేసినచోఁ దా నేమగును? మానిసిగా చచ్చునా? పులిగా చచ్చునా? గ్రంథములయందు రాక్షసులు కామ రూపులై మరణవేళయందు సహజరూపము పొందుదురని యున్నది. వీఁడు రాక్షసుఁడుకాఁడు. కావున యంపకోల తగిలినపుడు పులిగానుండి పులిగానే చచ్చిపోవునేమో? ఆ పులిగా నగుటకు నతఁడు వేసెడి ముగ్గెట్టిది? మఱల మనిసి యగుటకు నేమిచేయవలయును? మనిసి యగుటకు నా ముగ్గును కలఁగలిపి దానిలోఁబడి దొరలవలయును. క్రమముగా మనిసి యగును. వాని ముంజేతులు పులి పంజాలుగానుండి హస్త ములు కాలేదు. దానికిఁ జాలసేపు పట్టును కాఁబోలు. వాఁడురము ధాత్రికి నానించి యంతసేపు పండుకొని యుండు టకుఁ గారణ మది కావలయును. అంతయు నైపోయిన తరువాత నా పులితనము ముంగాళ్ళయందు నిలుచునేమో! శిరస్సంత సులభముగా నెట్లుమాఱును? నిజముగా మాఱు టకు క్లిష్టమైన పరిస్థితిగల యవయవము దేహములో నున్నచో నది ముఖము కావలయును. అది శిరస్సు కావలయును. ఆ శిరస్సు సులభముగా మాఱి ముంగాళ్లు మాఱుట కంత యాలస్య మెందులకు? ఇందులో కూడ నేదో రహస్య మున్నది. వాని మేధాశక్తి చాల యధిక మైనదై యుండవలయును. వాని భావనా బలముగాని తదేకాగ్రతగాని వాని యోగలక్షణముకాని విపరీత మార్గ మునఁ బోవుచున్నను మహాశక్తివంతమై యుండవలయును.

అతఁ డల్పుఁడుకాఁడు. అధికుఁడు. అతఁడు చేయుచున్నపని దూష్యమైనదే కాని వాని శక్తి యల్పముకాదు. వాఁడు వచ్చినంతనే వానితోఁ గలహము పెంచెదను. వానికీ ఖడ్గములతోఁడి యేమిపనియో చూచెదను. వానిని బతిమాలి వాని రహస్య మేల తెలిసికొనవలయును? వానిని శిక్షించి వానిని భయపెట్టి నేను వానిరహస్యములనుఁ దెలిసికొందును. ఇచట పులి లేదు. నేను చూచుచుండఁగా వాఁడు పులి కాలేఁడు. ఆ పులి యగుటకు నా వన్నియల దుమ్ములతో నేదో యొక ముగ్గో, పటమా, పులి యాకారమో నాకు తెలియని దేదో చేసి దానిలో నిలుచుండుటయో పొరలాడుటయో, తత్స్వరూపము తన్నావహింపఁ జేసికొనుటకు నొక ధ్యానమేదో చేయును. అప్పుడుగాని పులి కాఁడు. నేను వానితోఁ గలహించుచున్నవేళ నతఁ డట్లు చేయుటకు వీలుండదు. అయిదు కత్తులతో నొకసారి యుద్ధమాడ లేఁడుకదా! మఱియు నైనచో రెండుచేతుల రెండుకత్తులు పూనవచ్చును. నాకును కైజారుకలదు. కరవాలము కలదు. సమీపదేశము నుండి పొడుచుటకు కైజా రుపయోగించును. నే నిరువది యేండ్ల సేనాధిపతిని. అనేక యుద్ధముల నాఱితేఱినవాఁడను. సేనాపతి కాకపూర్వము ఖడ్గవిద్యలలో బహు యుద్ధములు చేసినవాఁడను. నానాదేశములయందలి ఖడ్గవిద్యా రహస్యములను తెలిసికొనినవాఁడను. వీఁడు నన్ను మించఁగలఁడా? ఇతఁడు బక్కపలుచనివాఁడు, బలహీనుఁడు. శరీరలాఘవ ముండిన నుండవచ్చును. ఖడ్గవిద్యలో శరీర బలముకంటె శరీర లాఘవ మధికముగా నుపకరించును. అయినను నా

శరీరముకూడ నేఁడు చాల లఘువుగా నున్నది. నేను గాలిలోఁ దేలిపోవుచున్నాను. వెనుకనుండి యొక నిద్రారేఖ మనస్సు నావరించుటకుఁ బ్రయత్నించుచు చున్నది. కాని మఱియొక లోప మేదియు లేదు. ఇపుడు నిర్వ్యాపారముగ నుంటిని గాన తత్సుషుప్తి రేఖాలక్షణము కొద్దిగాఁ గనిపించుచున్నది. బుద్ధి దేనియందో వ్యాప్రియమాణ మైనచో దాని లక్షణమే గోచరించదు. అతఁడింక నెంతసేపు రాకుండ నుండును? నిజముగా పరారి యైనాఁడా? అయినచో నా పడవకొయ్యను తీసికొనిపోయి యుండును. అని రాజపురుషుఁడు పడవకొయ్యవద్దకుఁ బోయెను. ఆ పడవకొయ్య యచటనే యుండెను. అతనికొఱకు వెదకి యేమిలాభము? గుహాముఖముననే కూర్చుండి వానికోసము ప్రతీక్షించవలయును. అతఁడు ప్రొద్దుగ్రుంకువఱకును రానిచో నేమి చేయవలయును? రాత్రికికూడ రానిచో? రేపుకూడ రానిచో.

ఈ ధూళియంతయు మూటకట్టుకొని యైదు ఖడ్గములనుఁ దీసికొని తాను తెప్పకొయ్యను పట్టుకొని ధూళి తడియకుండ నింటికిఁ దీసికొనిపోయి పలుమందిచేత నీ ధూళిని త్రొక్కించి దీనిపేరు పులిదుమ్మ్మ. ఒక ముగ్గుగా వేసినచో దానిలోఁబడి పొరలాడినచో మానిసి పులియగును అని చెప్పుదును. దీనిని త్రొక్కినవారి యెడలు పశు సమానభావమును పొందుట జరుగుచున్నదికదా? వారు నిస్సందేహముగా విశ్వసింతురు. నమ్మనివారుందురు. విశ్వసించెడివాని హృదయములో, మనస్సులో, విశ్వసించుటయన్న యొక సనాతన పదార్థముండును. విశ్వసించనివాని గుండెలో మనస్సులో,

నా సనాతన పదార్థ ముండగు. విశ్వసించుట యనునది యాలోచనాజనితమైన బహు పూర్వ పరమేశ్వర భావనిష్ఠమైన యొక సంస్కార విశేషము. ఎవఁడు తన వెనుకటి జన్మలయందు బహు పసుజన్మ లెత్తునో వాని హృదయములో వాని మనస్సులో విశ్వాసమన్నది యుదయించదు. విశ్వాసమనఁగా పండిన తర్కభావము. తర్కమనఁగా సామంజస్యముకల యితర పరిస్థితులను సంయోజనపఱచి వానినుండి యొక మహార్థమును బుద్ధికి భాసింపఁజేసికొనుట. విశ్వాస రహితుఁడు విషయములను వినును. చూచును. పొసఁగించుకొనలేఁడు. ఒకనికి పాము కఱచినది. అది విషము. విషము ద్రవ్యము. దానికి విఱుగుడై యింకొక పృథివీ పదార్థము చేతనే యది పరిహరింపఁబడవలయును గాని మఱి యింకొక దానిచేత పరిహరింపఁబడ దనుట యీ సృష్టియందున్న భిన్న పదార్థములయు భిన్న భావములయు నైక్యము నెఱుఁగ లేకుండుట. మనస్సులోనున్న భావము శబ్దముగా నెట్లు వచ్చినది. ఈ యొక్క దానికి చక్కఁగా నాస్తికుల మనుకొను వారు సమాధానము చెప్పినచో వారియందు నాస్తికత మిగులదు. నాభినుండి శబ్దోదయము కలుగుటయేమి? అది గాలి హృదయమువఱకు, కంఠమువఱకు వచ్చుటయేమి? నాలుక, దవడలు, అంగలి దంతములు, పెదవులు, వీనిచేత నాపఁబడి, కొట్టఁబడి శబ్దము వెలిపఱచఁబడుటయేమి? ఆ భావ మీ శబ్దముగా నవతరించుటకు నీ జంతువులయొక్క శరీరములోని యవయవములయొక్క సన్నివేశక్రమము హేతు వగుటయేమి? భావమునకు శబ్దమునకు సంబంధము

లేదు. అది యిదిగా మార్పు పొందినది. మార్పుపొందుట కీ జంతు శరీర యంత్రము నిర్మింపఁబడినది. ఇట్లే నదృశ్యము లైనవి సమ్మోహితము లైనవియునైన వానిని యంత్రముల ద్వారా మఱియొక రూపకిమునకు మఱలింపవచ్చును. ఇతఁ డేమి చేసినాఁడు? మానిసి పులి యగుటకు నొక యంత్రము వంటి దానిని చేసినాఁడు. ఇచట యంత్రము పనికిరాదు. అందుచేత నొక ముగ్గును కల్పించినాఁడు. ఎట్లు కల్పించి నాఁడు? క్రిందఁ బడినాఁడు. మీఁదఁ బడినాఁడు. తొలుత నెప్పుడో యొక యనుభవములో నేసీ బూదిరాశిని స్పృశించి నపుడు కలిగిన శరీర రక్తప్రవాహమునందలి యొక దిమ్మును తా ననుభవించియుండును. దానినిఁబట్టి వాని కీ యూహ వచ్చియుండును. ఆ యూహ వచ్చినతరువాత కొంత మార్గ మున్నట్లున్నదే. పులివన్నెల మెకము. దానిమేనఁ బలు వన్నెలు కలవు. ఆ వన్నియల పరామర్శ జాగ్రత్తగాఁ జేసి యా పద్ధతిగా ముగ్గుల ననుసరించినచోఁ బూర్తిగా పులి యగును కాఁడు. కొంత దూరము వెళ్ళియుండవచ్చును. ఇట్టిబాధ యెన్నాళ్ళు పొందినాఁడో. చివరకు కృతార్థుఁ డైనాఁడు. ఇంకను కృతార్థుఁడు కాలేదేమో! అతని వెనుకటికాళ్లు పులికాళ్లు కాలేదు. అవి యట్లే యుండునో. మఱికొంత ప్రయత్నము చేసినచో నవికూడ మాఱిపోవునో తెలియదు. నే నిచట నుండెడివాఁడ నైనచో నా ముగ్గు లతోఁ గొంత ప్రయత్నము చేయఁ గలుగుదును. ఎట్లు చేయవలయును? పులులను జాగ్రత్తగాఁ బరిశీలించవలయును. వాని యొడలఁ జార లుండునని తెలియునేతప్ప నీ వన్నియ

తరువాత నీవన్నియు యుండును. దీని దైర్ఘ్య మింత యుండును. ఈ రేఖ యిచట వ్రాలును. దీని దళసరితన మింత, మొదలైన జాగ్రత్తతోడి పరిశీలనముచేతఁగాని నిది సాధ్యము కాదేమో! అతఁడింత పరిశీలించెనా? మమ్ము పరిశీలించికొమ్మని పులులువచ్చి యతనిని సేవించెనా? కానిచో చనిపోయిన యొకానొక వ్యాఘ్రము దేహమునద్దఁ గూర్చుండి దానినిఁ బరీక్షించి చూచెనేమో! ఇంతకుమున్ను వట్టి ముగ్గుతో నింతపని జరుగునా? ఇది తంత్రభాగమేమో! తంత్రభాగ మేమైన నున్నదేమో! ఏవిధమైన యోషధీ విశేషములుకూడ కలవేమో! ఈ తంత్రభాగముచేసి యా ముగ్గులో నా మంత్రము నుచ్చరించుచుఁ బండుకొనినఁగాని పులి కాఁడేమో! తత్పూర్వ మేదైన నోషధిని సేవించ వలయునేమో! మఱల మానిసి యైనతరువాత తదోషధీ సేవనము చేసినగాని మఱలఁ దాను మానవునివలెఁ బ్రవర్తిం చుట కష్టమగునేమో! ఇతఁ డిప్పుడా యోషధసేవనమునకై యేగనేమో! అట్టి యోషధులం దితఁడు ప్రవేశముకలవాఁ డనుటకు నీ గుహలోని యీ తీవలగుంపు సాక్ష్య మిచ్చు చున్నది. ఆ తీవ యొకటి యిందులో లేదేమో! అతఁడు నేనీనాఁడు వత్తునని కలఁగనెనా? పూర్వమునకువలెనే యథే చ్ఛముగా నుండవచ్చు ననుకొనెను. నా రాక వానికి వాని యొక్క సహజ సంచరణమునకు వీలులేకుండఁ జేసెను. ఇట్లనుకొనుచుండఁగా దూరమునుండి యా పురుషుఁడు వచ్చుచుండెను. అతఁడు మంచి తేజశ్శాలివలె కనిపించు చుండెను. బలిష్ఠునివలె కనిపించుచుండెను. ఔను. ఇతఁడు

తద్దోష నివారణార్థ మేదియో చేసివచ్చుచున్నాఁడు. ప్రతి క్రియగా నేవో యోషధాలను సేవించినాఁడు. మొగము కూడ తేజోవంతముగ నున్నది. ఇందాఁక బలహీనునివలె వృద్ధునివలె క్రుంగిపోయినవానివలె బడలినవానివలెనున్నాఁడు. ఇప్పుడా యే లక్షణములునులేవు. ఇతఁ డోషధీ సిద్ధుఁడు కావలయును. ఇతనితో విరోధము పెట్టికొనిన లాభము లేదు. వీనితో మంచిగానే యుండవలయును. అయినను వీని ఖడ్గవిద్యాప్రవేశ మెంతవఱకో తెలియదు. నట్టి యడవి మృగములను వారించుకొనుటకే యీ ప్రయత్నమా? లేక యీవిద్యయందు వీనికి గాఢమైన ప్రవేశము కలదా? ఇంతటి యోషధీసిద్ధునకు వన్యమృగములను వధించుటకు కరవాల ములు గావలయునా? ఇతని ఖడ్గములు మృగములను చంపిన లక్షణములు కనిపించుటలేదు— అంతలోఁ బురుషుఁడు బాగుగా సమీపించెను. అతఁ డిట్లనెను. "ఓయీ! నా గుహాయంతయుఁ జక్కఁగాఁ బరిశీలించితివి. గుహాలో నే మున్నవి? ఏమియునులేవు. నీకాశ్చర్యము కలిగించు వస్తు వులు రెండే. మొదటి దా వన్నియలధూళి. రెండవది నా ఖడ్గములు. నీ వెవరవో చెప్పితివికావు. రాజవా! మంత్రివా! సేనాపతివా? వట్టి రాజపురుషుఁడవా? ఒక సామంత ప్రభువవా? నీ వెవరవో చెప్పినచో నీతో నేను కత్తియుద్ధమాడెదను. రాజ:—నేను రాజనైనచో నాడెదవా? సేనాపతి నైనచో నాడెదవా? పురు:— నీవు నా లెక్కప్రకా రము యోగ్యుఁడనైనచో నాడెదను. నీయోగ్యత యెట్టిదో నిన్నుఁగూర్చి నీవు చెప్పినచో నాకుఁ దెలియును. రాజ:—

నేను మగధరాజ్యమునకు మంత్రిని. సేనాపతిని. పురు:- ప్రధానమంత్రివా? మహాసేనాధిపతివా? రాజ:- అవును. పురు:-ఇందాక నీవు నాతో మాటాడుచు నొకమాటయంటివి. ఈ మగధరాజ్యముల దుస్థితి యేమోకాని పదునేను పదు నాఱు వందల యేండ్లనుండి రాజును సేనాపతి చంపుటయు వాఁడు రాజ్యము నపహరించుటయు జరుగుచున్నది. రాజ:- అవుననాన్నను. పురు:-నీకుఁగూడ నట్టియూహ యున్నదా? రాజ:-మీ రడిగిన ప్రశ్న నా కర్థమగుటలేదు. పురు:-ఎందు కగుటలేదు? నీవు సామాన్యమంత్రి వైనచో సామాన్య సేనాపతివైనచో నీ యడవులందు తిరుగుట యెందులకు? ఏవో విద్యలు సంపాదింతమనియేకదా ? కృత్రిమముగా రాజును వధింపవలయుననియేకదా! రాజ్యము మన కెట్లు వశ మగునన్న యూహయేకదా! ఆశయేకదా! నీమనస్సునందు శాంతిలేకుండ చేయుచున్నది. రాజ:-నాకట్టి యూహలేదు. పురు:- అందఱకును తమకుఁగల యూహలు సర్వవేళల యందుఁ దెలియవు. ఆ యూహ లంతరాంతరములయం దుం డును. ఏయూహయైనను మనస్సుచేత సుపరామృష్టమై నపుడుకాని మానవునకుఁ దన కాయూహ యున్నట్లు తెలి యదు. మనస్సుయొక్క లోతులో వెనుక నొకయూహ తారాడుచుండును. ఇదివఱకు నీవనుకొననిచో నేనీ మాట యనిన తరువాత నీ కా యూహ మున్నే నీమనసులోనున్నట్లు సుంత తోఁచుచున్నదికదా! అది యూహలక్షణము. అది యాశాలక్షణము. అది యట్లుంచి నీరాజు పేరేమి? రాజ:- సుశర్మమహారాజు. పురు:-అవును. ఇతఁడు **నాల్గవవాఁడు.**

శుంగవంశరాజులలోఁ జివరివాఁడైన దేవభూతిని వధించి వాసుదేవుఁడు రాజ్యమును స్వీకరించెను. వాసుదేవుని కుమారుఁడు భూమిమిత్రుఁడు. భూమిమిత్రుని కుమారుఁడు నారాయణుఁడు. అతనికొడుకు సుశర్మ. మగధరాజ్యము కాణ్వాయనులవశమై యెనుఁబదియైదేండ్లైనది. ఇది వారికి రాజ్యము నశించెడుకాలము. నీపేరు సిముఖసాతకర్ణి. రాజ:-అవును. నాపేరు శ్రీముఖుఁడే. పురు:-నీవు శాతకర్ణివి. అనఁగా నేమో తెలియునా? నీ వాంధ్రుఁడవు. శాతవాహన వంశము వాఁడవు. పూర్వ మెప్పుడో నీపేరి మీ పూర్వుఁడుండెను. అతనికి సంతానములేదు. ఒకనాఁ డతనికి స్వప్నమున నొక దేవతతోఁచి యిట్లనెను. ఈ పుదయమున నీ వడవికిఁబొమ్ము. అచట నొక సింహముమీఁద నొకబాలుఁడు కనిపించును. ఆ సింహమునుచంపి యా బాలుని తెచ్చికొని పెంచికొనుము. నీవంశము తామర తంపరగా వృద్ధిపొందు నని. అతఁడు మఱునాఁడు కాంతారమునకేగఁగా కలలో నన్నట్లే కనిపించెను. ఆ సింహము నతఁడు బాణముతోఁగొట్టెను. ఆ సింహ మొక గంధర్వుఁడై రాజా! నాపేరు శాతుఁడు. నేనొక గంధర్వుఁడను. నా భార్యపేరు శుక్తిమతి. ఆమె చని పోయెను. ఈ పిల్లవానిని నీకోసమే తెచ్చుచుంటినని చెప్పి యంతర్హితుఁ డయ్యెను. నాఁటినుండి మీ యాంధ్రులు సింహధ్వజులు సింహము, పులియు రెండు నించుమించుగా నొకజాతివేకదా. అందుచేత నీవు పులిని వెదకుచు వచ్చితివి. మీ పూర్వునకు సింహము కనిపించి కొడుకునిచ్చి మాయ మయ్యెను. నీకు పులి కనిపించి రాజ్యమిచ్చి మాయ

మయ్యెను. రాజ:-నాకు రాజ్యమీయలేదుకదా! పురు:-పరమార్థముగా నిచ్చెను. లౌకికముగా నిచ్చుట భవిష్యత్తులో జరుగును. రాజ:-నా కర్థముకాలేదు. పురు:-నీ కర్థము పనికిరాదు. సంపూర్ణముగానే కావలయును. దేవభూతిని వధించి వాసుదేవుఁడు మగధరాజ్యమును స్వీకరించినపుడు మగధముల క్రిందనున్న భూభాగమునంతయు స్వీకరించలేదు. ఆ వాసుదేవునకుఁ బుష్యమిత్రుఁడన్నచో నెంతయో గౌరవము. వారందఱును బ్రాహ్మణులు. వారి యభిమాన మట్లుండును. పుష్యమిత్రుని సంతానమైన దేవభూతిని సంపూర్ణముగా రాజ్యములేనివానిగాఁ జేయుట కిష్టములేక విదిశానగరము రాజధానిగాఁగల దశార్ణదేశములు, సుంహదేశములు ప్రసుమ్న దేశములు వాసుదేవుఁ డాక్రమించకుండ వదలిపెట్టెను. అది నీ కిష్టములేదు. ఆ రాజ్యభాగములు కూడ నీవే కలుపుకొనవలయునని నీ కున్నది. సర్వ భారతదేశము నాక్రమింపవలయుననియు నీ కున్నది. ఇదికాక ప్రతిష్ఠాన నగరమున, ధాన్యకటకమున మీ యాంధ్రరాజులున్నారు. వారు బలహీనులై యున్నారు. భోగ పరాయణులై యున్నారు. అసమర్థమైన వైదికమార్గమందున్నారు. వారికిని నీకునుఁ బడలేదు. నీవు రాజవంశీయుఁడవు. ఇప్పుడు రాజ్యము చేయుచున్నవాని తాతయు నీతాతయుసహోదరులు. మీతాతలనాఁడే రాజ్యముమీఁదియధికారమునుఁ గూర్చిన వివాదము జరిగినది. అతనితాత సేనాబలముచేత రాజ్యమును బలవంతముగా నాక్రమించెను. మీ తాత సాధువై యూరకున్నాఁడు. మీ తరము వచ్చునాఁటికి నేఁటి యాంధ్రరాజు

మీకు నొసంగు భృతికూడ వార్షికముకూడ సరిగా నిచ్చుట లేదు. నీ వతనితోఁ బోరాడితివి. రాచపుట్టువుఁ బుట్టితిని. నా చేతిలోని కత్తికి పదునున్నచో నేను బ్రతుకలేక పోవుదునా యని బయలుదేఱి వచ్చితివి. ఆంధ్రులు పరాక్రమవంతులు. ఆంధ్రుఁడైన సైనికుని యేరాజైనను కనుల కద్దుకొని తీసికొనును. ఈ సుశర్మ తండ్రియైన నారాయణుఁడు నీ కుద్యోగ మిచ్చెను. ఏడాది తిరుగకమున్న నీవు చమూపతి వైతివి. నీవిచట నుద్యోగములోఁ జేరితివనియుఁ బైకి వచ్చుచుంటివనియు నాంధ్ర సైనికులు మగధములకుఁ జేరిరి. వారిదే యొక పెద్ద సేన యయ్యెను. నారాయణుఁడు భోగియై రాజనీతి యెఱుఁగనివాఁడై తన దేశయులను విశ్వసించనివాఁడై నీ యాంధ్రసేనకు నిన్ను సేనాధిపతినిఁజేసి సర్వరాజకార్యములు నీ చేతఁ జేయించుచుండెను. సర్వాధికారము నీ చేతిలోనికిచ్చెను. దానికి తెలియకుండ నీకు తెలియకుండ నీవు మహాసేనాధిపతి వైతివి. ఆంధ్రసైన్యము లన్నచో మగధసైన్యములకు భయముపుట్టెను. అపుడు నారాయణుని మంత్రియైన జీవలుఁడు వృద్ధుఁడై చనిపోయెను. నీ రాజనీతిజ్ఞతకు సంతోషించిన నారాయణుఁడు నిన్నే మంత్రినిగా నిన్నే మహాసేనాధిపతిగా నియమించెను. అంతలో నారాయణ మహారాజు చనిపోయెను. సుశర్మ రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు నీవుఁ కూర్చుండుమనుచోఁ గూర్చుండును. నిలుచుండుమనుచో నిలుచుండును. నీరు త్రావుమన్నచో నీరు త్రావును. అతనికి నలుగుఱు భార్యలు. ఆ నలుగుఱు నతని నాల్గుప్రాణములను తీసివేయుచున్నారు. మిగిలిన

దొక్కటేప్రాణము. ఆ ప్రాణమును నీవు తీసివేయవలయునా! వలదా యని నీకాందోళనగానున్నది. నీచేతిమీఁదుగాకాకుండ నాప్రాణము దానియంతట నది పోయినచో నీవు సుంహ ప్రసుమ్న దశార్ణదేశములమీఁద గరుడి తనరెక్కలను చాచి నట్లు నీయధికారమునుచాతువు. ఆంధ్రదేశమును జయింతువు. అప్పు డాంధ్రములను జయించుట నీకు సులభమైనపని, మగధ సేనలు దశార్ణసేనలు సుంహప్రసుమ్నసేనలు నీయధీనములో నుండును. వంగదేశము బలహీనముగా నున్నది. దాని నాక్రమించినచో నీ కాంధ్రములమీఁదికి దండెత్తి పోవుట చాల సులభమగును. కోసలములు, కళింగములు, పుండ్ర దేశములు నీముందు నిలువలేవు. ఆంధ్రములను తేలికగా కైవసము చేసికొనవచ్చును. బలిమహారాజుయొక్క కొడుకు లీ భూభాగమును పంచికొనకముందు నీ సముద్రతీర ప్రదేశ మున కంతకు ప్రాచ్యక దేశమని పేరు. అదియే అంగవం గాంధ్రాదులుగా విభజింపఁబడినది. సదానీరానదీ ప్రదేశము నుండి భారతమున కొసవఱకు నీ దేశమంతయుఁ బ్రాచ్యక దేశము. నీవు దీనికంతకు రాజవగుదువు. ఆ పిదప మఱల మగధములకువచ్చి పశ్చిమదిశకు విజృంభింపవచ్చును. నిన్ను భారతదేశ చక్రవర్తిగా మన్నించనివాఁ డుండఁడు.

శ్రీముఖుఁడు:- అయ్యా! ఇంత పెద్ద చదువు చదివితిరి. నాకీ యూహాలేమియును లేవు. మీరు నాకు రాజద్రోహము నుపదేశించుచున్నారు. సుశర్మను నేను చేతులార నభిషే కించితిని. అతనిని నేను సంహరించను. అతని రాజ్యము నే నాక్రమించను. మీది వట్టి యూహాగానము. పురు:—

కానిప్పు నీవు మహా సేనాధిపతివికదా! నాతోఁ గత్తి యుద్ధము సేయుదువా? శ్రీముఖుఁడు:- నీకు కత్తియుద్ధము తెలియునా? నీ కెట్లు తెలియును? నీ వొక సన్యాసివి. జయద్రథుఁ డిట్లనెను:- నా గుహలో నైదు ఖడ్గములను చూచితివికదా. నాకా విద్య తెలియనిచో నైదు ఖడ్గము లెందుకుండును? అదికాక నీవు మనసులో నాతోఁ గల హించి నాతోఁ గత్తియుద్ధ మాడవలయు ననుకొంటివికదా"—— శ్రీముఖుఁడు దిగ్భ్రాంతిఁ బొందెను. వీఁడెవఁడు? నా మన సులో వచ్చిన యూహ వీని కెట్లు తెలియును? మఱల జయద్రథుఁ డిట్లనెను. "ఓయీ! నివ్వెఱపోకుము. నాకు నెదుటివారి మనసులోని యూహలు తెలిసికొనెడి శక్తి కలదు. నీవు తొలుత నిరువది యేండ్లక్రింద మగధరాజ్య సేనలో నుద్యోగమును సంపాదించితివి. ఎట్లు సంపాదించితివి? నీకు జ్ఞాపకమున్నదో లేదో. నలువురు మంత్రులు, నలువురు సేనానులు, ఆనాఁడు నీకు పరీక్షకులుగా నుండిరి. నీవు పది మంది చమూపతులతో యుద్ధము చేయవలయును. ఆ పది యుద్ధములలో కనీస మైదింటిలోనైన నీవు జయము పొంది నచో నారాయణుఁడు నీ కుద్యోగ మిత్తునన్నాఁడు. ఆ నారాయణుఁడు చిత్రమైన ధరాపతి. అతని కాంధ్రు లన్నచో ద్వేషము. వారి పరాక్రమ మన్నచో గౌరవము. ఆంధ్రులు కుత్సితులు. న్యాయమైన యూహ చేయనివారు. వారి వివేకము గొప్పదేకాని వారి మనస్సు కుటిలమైనది. వారు పరాక్రమవంతులే కాని తమ పరాక్రమము నుపయో గించుకొనుట వారికి తెలియదు. మొదలైన యెన్నో

యూహలు మిమ్ముఁగుఱించి నారాయణున కుండెడివి. మీరు ద్రోహులని యతనియుద్దేశ్యము. ఆంధ్రు లాత్మద్రోహులు. సంఘద్రోహులు. వేదధర్మ ద్రోహులునని నారాయణుని యూహ. అతనియూహయేకాదు. భారత దేశమునందలి సర్వప్రాంతములవారు మీయాంధ్రులనుఁగుఱించి యట్లే యను కొనెదరు. దానికి తగినట్లు మీరు ప్రవర్తింతురు. ఏయితర దేశములలోనైనను వట్టి యెడారిలో నొక దర్భమోడు లేచి నచో నది మహావృక్షమని మన్నింతురు. మీ యాంధ్రులు మహావృక్షములను దర్భమోడులని చెప్పుదురు. మీజాతి లక్షణమది; మీజాతియన్నచో నాకెంతయో యభిమానము. మీది నాకిష్టమైనజాతి. నాకభిమతమైనజాతి. ఆ పది యుద్ధములలో నీవు కడతేఱుదువని నారాయణుఁ డనుకొనెను. నీవు చావలేదు. పదియుద్ధములయందును గెలిచితివి. వట్టి గెలుచుటయేకాదు. నీ కెదురుతీర్చిన పదిమందిని నీవుచంప కుండ వదలిపెట్టితివి. వారు మాంగధులు. వారిలో నొకనిని నీవు చంపినను నారాయణుఁడు నీ కుద్యోగమిచ్చుమాట యట్లుంచి నిన్ను సంహరింపించెడివాఁడు. నీ పరాక్రమము నకు నీ యౌదార్యమునకు నతఁడు మెచ్చికొని యాంధ్రు లన్నచో నతనికున్న ద్వేషమునుఁగూడ తొలఁగించికొని నీ వుత్తముఁడవని భావించి నీ కుద్యోగ మిచ్చినాఁడు. ఆ పది యుద్ధములలో నీవెట్లు గెలిచితివో చెప్పఁగలవా? రాజ:-ఇన్ని తెలిసినవాఁడవు నీవే చెప్పుము. జయ:-నేనే చెప్పుదును. నీకు చిన్నప్పుడు ధాన్యకటకమున నొకఁడు ఖడ్గవిద్యా గురు వుగానుండెను. వాని పేరు జయద్రథుఁడు. వాఁడు నేర్పిన

విద్యనీది. ఆవిద్య లోకోత్తరమైనవిద్య. ఆవిద్యాబలము చేత నీ వుద్యోగమును సంపాదించితివి. శ్రీముఖుఁడు:- బాగుగానున్నది. ఒప్పికొంటిని. కాని యాజయద్రథుఁడు తన విద్యనుఁగూర్చి నాతోఁ గొన్నిమాటలుచెప్పెను. నీ వా మాటలను నా కప్పఁజెప్పినచో నేను విశ్వసింతును. జయ:- ఇన్ని చెప్పినవాఁడ నది చెప్పలేనా? ఆవిద్య రెండువేలయైదు వందల యేండ్లనుండి యా జయద్రథుఁడు భిన్న దేశములందు, భిన్న కాలములందు సంపాదించితినని చెప్పినాఁడు. శకయవన హూణదేశములలో రెండువేల యేండ్ల క్రింద నొక విలక్షణ మైన ఖడ్గవిద్య యుండెడిదనియు కొన్ని శాబరమంత్రముల సాహాయ్యముతో నావిద్య యొక్కొకపుడు శత్రుమారకము చేయఁగలిగి యుండెడిదనియునుఁ జెప్పెను. మఱియొక విశేష మునుఁ జెప్పెను. బార్హద్రథవంశ మంతరించు చున్నది. ప్రద్యోతునితండ్రి మునీకుఁడు. వాఁడు మంత్రియు సేనాపతియు. వాఁడు మహాఖడ్గవిద్యానిపుణుఁడు. ఆనాఁడు గంధవాహుఁ డన్న యొక మహాసేనానికలఁడు. వానిఖడ్గవిద్యముందు నిల చెడివా రుండెడివారుకారు. వారివిద్యలోని యంశలనుకూడ జయద్రథుఁడు తాను గ్రహించితినని నీతోఁజెప్పెను. శ్రీము ఖుఁడు:- స్వామీ! నీవే నాగురువవు. నీవే ఆ జయద్రథుఁ డవు. నేను గుర్తుపట్టలేకపోయితిని. ఇప్పుడు లీలగా నీముఖ లక్షణములు సన్న సన్నఁగా గుర్తుకు తగులుచున్నవి. కాని తమ రెంతో మాఱిపోయినారు. పూర్వము మీకన్నులలో దయ్యములు కనిపించెడివి. ఆనాఁడు తమతోనే నీమాట యంటిని. మీరునవ్వి యూరకున్నారు. జయ:- ఇప్పుడు

నాకన్నులలో దయ్యములు కనిపించుటలేదు. పులులు కని పించుచున్నవి. నిజమేనా? శ్రీముఖుఁడు:-స్వామీ! నిజమే కాని ఈపులియేమి? మీరు పులియగుట యెట్లైనది? ఈ ముగ్గు నెచ్చటనేర్చితిరి? ఆముగ్గువేయుట సంపూర్ణముగాఁ గుదిరినట్లు లేదే. మీ పృష్ఠభాగమునకు మనుష్యలక్షణము పోలేదే. ఈవిద్య యెచ్చట నేర్చితిరి? ఎందుకు నేర్చితిరి? దీని ప్రయోజనమేమి? ఇది యెట్లునేర్చితిరి? జయ:- ఓయీ! ఈ సర్వసృష్టియుఁ జాల విచిత్రమైనది. ఎవఁడీసృష్టి నేక దేశమునందు భావించునో వానికి దీనిరహస్యమేమియుఁ దెలి యదు. వాఁ డేకదేశమునందు గగ్గోలుపడుచుండును. వానికి మొదలు తుద తెలియదు. అట్టిమూర్ఖుఁడు దానినే జ్ఞాన మనుకొనుచుండును. నీకు సులభముగా నొకటి చెప్పెదను. వినుము. ఈసృష్టియున్నది. ఆకాశమున్నది. భూమియున్నది. గోళములున్నవి, కాలమున్నది; భావమున్నది; శబ్దము లున్నవి; రేఖలున్నవి; పదార్థములున్నవి; గణితమున్నది; జాగ్రత్తగా విచారించినచో నన్నియు నొక్కటియే; ఇవి యొకదానియందొకటి యభివ్యాప్తములై యున్నవి; ఈరహ స్యము తెలిసినవాఁడు సృష్టిరహస్యము తెలిసినవాఁడు; ఒక్కటి యేవస్తువు భిన్నదేశముల, భిన్నకాలముల భిన్నాకృతులతో నుండుచున్నది; వృద్ధిఁబొందుచున్నది; కొంత సహజముగా దానియంతట నది మాఱుచున్నది; నీకీ రహస్యము తెలియ నిదికాదు. నే నిచ్చటికి రాకముందు నీవీ యూహచేసితివి. భావము శబ్దముగాఁ బరిణమించినచో నింకొకటి యింకొక టిగా నేల పరిణమించదు? మనసులోనున్న భావము శరీర

యంత్రముద్వారా శబ్దముగాఁ బరిణమించుచున్నది. అట్లే యాకాశగతగోళములు మానవులుగాఁబరిణమించుచున్నారు. కాకపోయినను ఆ గోళములయొక్క నడకనుఁబట్టి మానవుల జీవితములు నడచుచున్నవి. వాని ననుసరించి నడచుచున్నవి. మానవులేకాదు. దేవతలుకూడ తన్మహావియత్కటాహ గతనక్షత్రాదుల యాకృతులు గమనములు ననుసరింతురు. అనుసరించుటకాదు. అవియే యివిగా భాసింతురు. ఇది సృష్టియొక్క రహస్యము. ఇది మహావిషయము. ఇందులో నల్పవిషయము లెన్నియోకలవు. మనసులోని భావము శబ్దాకృతిగా వినిర్గమించినపుడు మనసులోనున్న వాంఛ శక్తిమంతమై మంత్రముగా నేల బహిర్గమించదు. ఆ మంత్రముయొక్క వేఱొక స్వరూపము యంత్ర మెందుకు కాదు? కాని వియత్కటాహమునఁగల గోళ ములు భూమియందు జంతువులుగా, వృక్షములుగా మాఱుచున్నపుడు జరిగినపుడు వానియంతట నవి జరిగినవా? కొన్నిఁటి సాహాయ్యమువలన నా పరిణామము జరిగినదా? దానియంతట నది జరుగలేదా? ఈ విషయమును విచా రించినచో కాలమునుఁబట్టి సందర్భములనుఁబట్టి తత్తద్భావ ముల యొక్క యభివ్యాప్తి లక్షణమునుఁబట్టి యొక్కొక్కపు డొక్కొకటి జరుగుచున్నది. సర్వథా జరుగుటలేదు. ఈ సాహాయ్యకములైన హేతువు లన్నియు మంత్రయంత్రముల దగ్గఱకు వచ్చునప్పటికి తంత్రము లగును. ఈ పులియగుటకు యంత్ర మున్నది. ఆ యంత్రమును కనుగొనవలయును. మనుష్యుఁ డేజంతువైనను కావచ్చును. ఏ జంతువైనను

మనుష్యుఁడు కావచ్చును. జీవులు చనిపోవుచున్నారు. దుష్కర్మ ఫలితముగా జంతువులై పుట్టుచున్నారు. ఏట్లు పుట్టుచున్నారు. ఆలోచింపుము. వట్టివాని జీవలక్షణము నందలి సంస్కార బలముచేత వాఁడు జంతువై పుట్టు చున్నాఁడు. ఆ జంతువై పుట్టుటకు లోకమునందు జంతువు లున్నవి. స్త్రీ జంతువులు, పురుష జంతువులు సంగమించు చున్నవి. పురుషజంతు రేతోనిహితమై యీ జీవుఁడు ప్రవర్తించుచున్నాఁడని యందువు. ఇది అంతయును పసర లక్షణము. సర్గవేళ నెట్లు జరిగినదందువు? జీవుఁడే తన్నుఁ దాను తన బుద్ధి కనుకూలముగా జంతు శరీరమును భావించి భావనా బలముచేత నట్లైనాఁడని చెప్పక తప్పదుకదా? సృష్టి సిద్ధాంత వాదులలో నీ రెండు విస్పష్టములైన భేదములు కలవు. ఒకరు నేను చెప్పినది చెప్పుదురు. మఱియొకరు పరిణామమును చెప్పుదురు. పరిణామమును చెప్పెడివారైనను తొట్ట తొలుతఁటి యా స్థితిలో తదాకృతి యెట్లు కలిగినదో చెప్పవలయునుకదా? తొలుత మత్స్య ముదయించినది. ఎట్లుదయించినది? 'మొదట చేప; తరువాత తాఁబేలు; తరువాత నడవిపంది. తరువాత సగము మనిసి సగము సింహము; తరువాత మానవాకృతి పొట్టిది. ఈ రీతిగాఁ బరిణామము జరిగినదందుము. ఆ మొట్టమొదటిచేత యెట్లైనది? ఒక భావము తదాకృతి వహించినదని చెప్పవలయును గదా? ఒక తీవ్రతరమైన భావనాపథమున తద్భావమునకంటె యీ యాకృతి భిన్నమని చెప్పుటకు వీలులేదుకదా? ఈ విషయ మెంత చెప్పిన నింతే. వివేకికి తెలియును. అవివేకికి

తెలియును. నీవనుకొంటివికదా! విశ్వాసమనఁగా నెట్టిదో, అవిశ్వాసమనఁగా నెట్టిదో. అదే రహస్యము. నీ కెక్కువగాఁ జెప్పవలసిన యవసరములేదు. నేను విచారించితిని. రెండు వేల మూఁడువందల యేండ్లనుండి— మూఁడు వంద లేవి? ఇంకను ముప్పది యాఱేండ్లున్నవి. అప్పటినుండి నా ప్రకృతి యెట్టిది? నాది వ్యాఘ్రప్రకృతి. నాకుఁ దెలియును. క్రూరజంతువుయొక్క ప్రకృతి. నేను జంతువుగా నెందుకుమాఱలేదు? మాఱుటయెట్లు? దీనికై పెద్ద తపస్సులు చేయనక్కఱలేదు. మంత్రవర్ణములను దర్శించనక్కఱలేదు. కొంత తీవ్రమైనభావన చేయవలసినమాట నిజమే. చేసితిని. ఇది యంత్రతంత్రములకు నెక్కువ సాధ్యమైన విషయము. ఇచట మంత్రము కించిత్కారి. విద్యలు క్షుద్రములైనకొలఁది యంత్రతంత్రముల నాశ్రయించుకొని యుండును. ఇంకను క్షుద్రములైనచో వట్టి తంత్రములను, ఓషధులను సమాశ్రయించుకొనియుండును. ఓయిసిముఖా! నీ విరువదియేండ్లు నీ పరాక్రమముచేత రాజనీతిజ్ఞతచేత చిన్న దళపతి యధికారమునుండి మంత్రివియు సేనాపతివియు నైనావు. రాజవు కాలేదు. నేను ఈ యిరువదియేండ్లు నిత్యప్రయత్నముద్వారా నీపులి నైనాను. నాకుఁ గాళ్లు మిగిలియున్నవి. నీకు రాజ్యము రావలయును. నాకీపృష్ఠభాగముకూడ, ఈ పిక్కలుకూడ పులికాళ్లు కావలయును. నీకది మిగిలినది, నాకిది మిగిలినది. నీవెప్పుడు రాజవగుదువో, నేనప్పుడు సంపూర్ణముగా పులి నగుదును. లేదా నేను సంపూర్ణముగా నెప్పుడు పులినగుదునో నీవప్పుడు రాజవగుదువు.

శ్రీముఖుఁడు:-దాని కాలమునుఁగూడ నిర్ణయించి పెట్టితిరా? జయ:-ఆదినములు దగ్గఱకు వచ్చినవి. శ్రీముఖుఁడు:-మీ యింతప్రయత్నము వృథా. నేను రాజ్యము వాంఛించుట లేదు. సుశర్మను నేను సంహరించను. జయ:-దేవభూతిని వాసుదేవుఁడు సంహరించలేదు. వానిమీఁదికి నేనొక విష కన్యను ప్రయోగించితిని. ఈ సుశర్మను నేనే వధింతును. అందుకనియే యీప్రయత్నము. నీవూరకే చక్రవర్తివై కూర్చుందువు. ఓయీ! నిన్ను సర్వభారత చక్రవర్తిని చేయుటకు రెండువేల మూఁడువందల యేండ్ల క్రిందనుంచి ప్రయత్నము చేయుచుంటిని. జనమేజయ మహారాజు పాలించువేళ నీ ధాన్యకటకమునఁ ప్రవేశించితిని. ఈ నా ప్రయత్న మప్పటినుండి. ఈనడుమ నీ శుంగవంశీయులు, కాణ్వాయనులు బ్రాహ్మణులువచ్చిరి. వారిని రాకుండ చేయుట నాకు సాధ్యము కాకపోయెను. మీరు బౌద్ధులు. మీరు శూన్యవాదులు. నాకు ప్రియతములు. మీచేత నీ సర్వభారత సామ్రాజ్యము నైదువందలయేండ్లు పాలింపఁ జేయుదును. మీ కెదురులేదు. సర్వభారత నాగరకతను ఆంధ్రనాగరకతా ముద్రితమునుఁ జేయుదును. నా కాంగ్రెసుల కంటె నిష్ఠులెవ రున్నారు?—జయద్రథుఁడు శ్రీముఖునితో గత్తియుద్ధము చేసెను. కొన్ని క్రొత్తమెలకువలు నేర్పెను. పడవ కొయ్యమీఁదఁ దీసికొనిపోయి తోహారువద్ద దించెను. తాను మఱల తిరిగిపోయెను.

87

౨

నాస్థితి నాకే చమత్కారముగా నున్నది. ఈలోకమునందు నాకెంత విరక్తి గలిగినదో చెప్పలేను. ఏది యేమైనను సరే. నాకేమియు పట్టదు. రాజ్యముమీఁదనే యాశలేదు. జనము పుట్టుచున్నారు. బ్రతుకుచున్నారు. చచ్చుచున్నారు. ఇది యనంతకోటి సంవత్సరములనుండి జరుగుచున్నది. ఇట్లే మఱి యెన్నికోట్ల సంవత్సరములు జరుగునో మనకుఁ దెలియదు. ఎందుకు పుట్టుచున్నారు? పుట్టిన ప్రతి జీవియు తానేదో బావుకొనవలయునని ప్రయత్నించుచున్నాఁడు. ఇచట బావుకొనుట కేమున్నది? మనుష్యుఁడు మిక్కిలి బ్రతికినచో నూటయేఁబది సంవత్సరములు బ్రదుకవచ్చును. కాలము గడచినకొలఁది మానవుల యాయుర్దాయము తగ్గునని వారి శక్తులు తగ్గునని వారి బుద్ధులుకూడ పెడమార్గమునఁ బట్టునని మన గ్రంథములు చెప్పుచున్నవి. ఆ సంగతి యట్లుంచుడు నూటయేఁబది యేండ్లలో నిజానికి చిన్నప్పుడు పదునెమిదేండ్లైనను బాల్యముక్రింద తీసివేయవలయును. తుది యేఁబదియేడులు వార్ధక్యమనియే చెప్పవలయును. ఒక యెనుఁబదియేండ్లు వ్యాధులు మొదలైనవి లేనిచో కరచరణాద్యవయవములు సరిగా నాడుచున్నచోఁ గొంత సుఖ మనుభవించుచున్నా మనవచ్చును. ఇందులో సుఖమేమున్నది? నీవొకదానిని కోరుదువు. దానికొఱకు ప్రతీక్షించుచుందువు. దాని యిష్టమువచ్చినపుడది సమకూడును. సమకూడిన తరు

వాత దానియందలి యనుభవ మెట్టిదో దెలియదు. దానిని తృప్తియందుము. ఆ తృప్తియొక్క స్వరూపమేమి? తృప్తమైన మనస్సుయొక్క లక్షణమెట్టిది? ఆ తృప్తి యెంతసే పుండును? ఇది యేమియు చెప్పరాదు. ఈ తృప్తికంటె నా యూహకొఱకు ప్రతీక్షించు సమయమే అధికమైనది. తృప్తి నిమేషకాలభాసమైనది. లేదా యొకఁడు మఱియు మూర్ఖుఁడై యా తృప్తివేళను పొడిగించుకొనవచ్చును. పొడిగించుకొనుట యనఁగా తిరిగి తిరిగి దానిని భావించుట. తిరిగి తిరిగి భావించుటలో నధికాధికమైన తృప్తి యున్న దనుటకు వీలులేదు. తదధిగమన ప్రథమ నిమేషమునందే తృప్తి యన్నది యుండును. తరువాత వచ్చునది తత్తృప్తి యొక్క భావనగాని తృప్తి యనుటకు వీలులేదు. తద్భావన చేత నొక సంతోషమో, యొక సుఖమో, కలుగునని చెప్పవలయును గాని యదిగూడ తృప్తి యనుటకు వీలు లేదు. ఆ భావించిన సర్వకాలమును తృప్తి క్రిందనే జమ కట్టినచో చెప్పనదిలేదు. కాని తృప్తియన్న వస్తువు మాత్రము నిమేష పరిదీపనావధి. ఇట్లుండఁగా నా కోరిక సమకూడునా సమకూడదా యన్న విచారణాకాలము బహు దీర్ఘమైనది. అది సమకూడునన్న యాస యున్నచో ప్రతీక్షా భావమునం దొక మాధుర్య మున్నదని చెప్పవచ్చును. నిరాశా సహితమైన బుద్ధితో దానినిఁ బ్రతీక్షించినచో దాని యందు వైధుర్యమేయున్నది. మాధుర్యమో వైధుర్యమో జీవితములోని సారాంశము మాత్రము ప్రతీక్షాగతములైన యా భావములే తప్పఁ దక్కినవి లేవు ఇదియంతయు ప్రతి

వ్యక్తియుఁ దనకుఁ దాన పొందవలయునన్న యభిలాషయు నితరుల యనుభూతి తనకు రుచించక పోవుటయు దానియందు విశ్వాసము లేకపోవుటయుఁ దానే యనుభవించవలయు ననుటకు మొదలైన మానవుని విచిత్ర స్వభావముమీఁద నీ సృష్టి సాగుచున్నది. అందఱును జన్మించుచున్నారు. ప్రతివాఁడును తన యనుభవమును తనదే యనుకొను చున్నాఁడు. ఇది చమత్కారముకదా! అందఱును మను ష్యులే. అందఱును కరచరణాద్యవయవ విశిష్టమైన దేహ ములు ధరించినవారే. అందఱికిని బాల్యమున్నది. బాల్య మునం దందఱును పశుతుల్యులే. వార్ధక్యమునందు శరీర దార్ఢ్యముమాలి వట్టి యాశాజీవులుగ బ్రతుకుచున్నారు. ఆ యనుభవమన్న వస్తు వేదైన నున్నచో నడిమికాలమునం దున్నది. అది మహాగర్తము. మహావర్తము. అచ్చటికిఁ బోయి వాఁడు నశించి పోయినాఁడు. అని మనముచెప్పినచో నీ మానవునిబుద్ధి యేమి బుద్ధియో, ఆయావర్త మెట్లు న్నదో ఆ నశించిపోవుట యెట్టిదో తాను చూడవలయు ననుకొనును. తా ననుభవించవలయు ననుకొనును. అనుభ వించున దేమున్నది? చనిపోవుటయేకదా? అట్లు చనిపోవు టయు నొక యనుభవముకాఁబోలును. ఈమానవజాతి యింత విచిత్రమైనది. ఇది యిట్లుండఁగా నీ యాకాశమేమి? ఈ సముద్రములేమి? ఈ దిక్కులేమి? ఒక దేశమేమి? ఈ జనమందఱు నిట్లు పుట్టుచుండుటయేమి? ఎవనికి వాఁ డీ సృష్టి నంతయు నేదో తలక్రిందులు చేయుచున్నా ననుకొనుట యేమి? వాఁడు తలక్రిందులుసేయుట యంతయుఁ గలిపి

ముప్పది నలుబది యేండ్లు. కాదా యిరువది యేండ్లు. ఇంకను వీలు మిగిలినచో వందయేండ్లు. అంతకంటె మించి లేదుకదా! దానికొఱకు వాని యారాటమెంత ఈ యనంత కాలములో వందయేండ్లే సూక్ష్మాతి సూక్ష్మమైన కాలము. పాతికయేండ్లు, పరకయేండ్లు, లోకమునాని పట్టికొని సంతోషించెడివారిసంగతి ఇంకనేమి చెప్పవలయును? అందఱును లోకమున కుపకారము చేయవలయు ననెడివారే. 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అన్నారు. ఎవ్వఁడును తాను తరించెడివాఁడు లేఁడు. ఇతరులను తరింపఁజేయవలయు ననెడి వాఁడే. పెద్దలు లోక మజ్ఞానదూషిత మని చెప్పుదురు. ఆ యజ్ఞానము వేయివిధములుగా నుండవచ్చును. సర్వవిధములైన యజ్ఞానములలో మహాటోపమానమైన యజ్ఞానము పరులను తరింపఁజేయవలయునన్నది. అది నిజముగా లోకోపకారబుద్ధి కాదు. స్వోపకారబుద్ధి. నా కాశ్చర్యము వేయును. నా మంత్రి యున్నాఁడు, సిముఖశాతకర్ణి. అతనికి చెప్పరానంత దురాశ. ఈ రాజ్యమంతయు తానే చేయవలయు నని, మా ముత్తాత వాసుదేవుఁడు శుంగవంశ రాజులనుండి యీ రాజ్యమును గ్రహించెను. శుంగవంశ మూలపురుషుఁడు మహానుభావుఁడైన పుష్యమిత్రుఁడు. ఆయనగాని, ఆయన కుమారుఁడైన యగ్నిమిత్రుఁడుగాని వైదికధర్మావలంబమునకు పెట్టిన మణిదీపములు. ఆ మహానుభావులరాజ్యమును మా ముత్తాతయైన వాసుదేవుఁడు తీసికొనక తప్పినది కాదు. అందుచేత వారి రాజ్యమునంతయు నాయన గ్రహించలేదు. దశార్ణములు, సుమ్న దేశమును వారికి వదలిపెట్టెను.

నా మంత్రియు సేనాపతియు నైన శ్రీముఖుఁడు దశార్ణములు కూడ మగధములోనివే మనక్రిందనే, యుండవలయును. మహా రాజా! నీ వాజ్ఞయిమ్ము, నేను వాని నాక్రమింతుననును. మేము బ్రాహ్మణులము. పుష్యమిత్రాదులైన శుంగవంశీయులును, వాసుదేవాదులైన కాణ్వులము. మేమును బ్రాహ్మలము. మా కీ రాజ్యమెందులకు? వైదికధర్మము చెడిపోవుచున్నదని లోకము బౌద్ధమతముచేత దూషితమై పోవుచున్నదని వర్ణద్వేషములచేత కలుషితమై పోవుచున్నదని మా బ్రాహ్మణు లీరాజ్యమును స్వీకరించిరి. ఇది యనంత యుగచరిత్రము. ఎప్పు డెప్పుడు క్షత్రియులు దుర్జనులై, క్రూరులై, పరాభూతచిత్తులై, ముషితేంద్రియులై, లోకమునకు విరోధముగాఁ బ్రవర్తించిరో, ప్రజాసుఖమును మన్నించక స్వాధికారమును తమవాంఛలను సమధికముగాఁ జేసి ప్రవర్తించి లోకకంటకు లైనారో, అప్పు డప్పుడు మహావీరులైన బ్రాహ్మణులు వారిని తొలఁగించి రాజ్యమును వారు తీసికొని మంచినడక నడిపించి మజల వారికిచ్చుచు వచ్చినారు. పుష్యమిత్రుఁడు తత్పూర్వమునందలి మౌర్యవంశము నుండి రాజ్యము నట్లుగ్రహించినాఁడు. తత్పూర్వము క్షత్రియులు దుర్జనులై దురహంకారులై, దుర్నీతిపరులై, భోగపరాయణులై క్షత్రియేతరమైన వర్ణములను నిందించుచు తిరస్కరించుచు నవమానించుచుఁ బ్రవర్తించుటచేత నందుఁడు వారిని సంహరించి తాను రాజ్యమును స్వీకరించెను. ఆ నందులు దుర్జనులైరి. చాణక్యుఁడు వారిని సంహరించెను ఇది యొక విచిత్రమైన జీవపరంపర. ధర్మస్రోతసి. నిజముగా

రాజ్యము క్షత్రియులది. వారందఱు బౌద్ధులైపోయిరి. ఇది వేదభూమి. ఇది కర్మభూమి. ఈ క్లిష్టసమస్యలోపడి భారత దేశము కలిలో పండ్రెండువందల యేండ్లు గడచినప్పటి నుండియు సతమతమగుచున్నది. నాకిదియేమియు పట్టదు. నిజముగాఁ బట్టదు. ఈ శ్రీముఖశాతకర్ణి యాంధ్రుఁడు. ఇతఁడు తనచుట్టాలతోఁ గలఁతపెట్టికొని సామాన్యసైనికుఁడుగా నిచ్చటికి వచ్చినాఁడు. రాజనీతివేత్త. పరాక్రమవంతుఁడు. ఆశాపరుఁడు. పైకి వచ్చినాఁడు. నేను రానిచ్చినాను. మాతండ్రి రానిచ్చినాఁడు. కానిమ్ము, ఎవఁడో యొకఁడు మహామంత్రి కావలయును. వాఁడు సమర్థుఁడు కావలయును. ఇతఁడు సమర్థుఁడు. ఇందులో దోషమేమియు లేదు. దోష మెచ్చటనున్నది? సామర్థ్యము కలిగియుండుటలో దోషములేదు. ఆ సామర్థ్యముతో కలిసి దురాశయు, దుర్నీతియు, దుశ్శీలమును నున్నచో నప్పుడు దోషము పుట్టును. ఇంతకు నేను చెప్పునదేమనఁగా నీయనంతకాలములో వంద వందయేండ్లొక్కొక్కతరముగాఁ దీసికొందము అట్టి వందయేండ్లు జరిగిన విన్నియని యెవఁడైన చెప్పఁగలఁడా? చెప్పఁగలనన్న వివేకి యున్నచో యుండనిమ్ము. అట్టివానిని విశ్వసించెడి యధికవివేకులున్నను నుండనిమ్ము. ప్రశ్న యది కాదు. ఈసృష్టియేమి? ఇట్లే జరుగుటయేమి? దీనికి మొదలును తుదయును లేకపోవుటయేమి? జరిగినదే జరుగుటయేమి? అనంతమైన యీ మర్త్యలోకమున కొన్నికోట్లజీవులు బ్రతుకుచుండఁగా ప్రతిజీవియు సర్వజగత్తును తనచుట్టే తిరుగుచున్నదని యనుకొనుటయేమి? గ్రహముల సంచారమువలన మాన

వుని జీవితము నిర్ణయింపఁబడునని వేదాంగమైన జ్యోతిషము చెప్పుచున్నది. అట్లెందుకు జరుగవలయును? అట్లుకానిచో మఱి యెట్లు జరుగుచున్నది? నాకేమియు తోచదు. ఆలోచించిన కొలఁది నంతయు నా కగమ్యగోచరముగా నుండును. ఈ కాలమేమి? ఈ దేశమేమి? ఈయనంతాకారమున యీ భూగోళమున్నది. నక్షత్రములన్నియు వేఱుగోళములు. అవి యొక్కొక్కఁ డెంతదూరాన నున్నవో తెలియదు. ఇంతదూర మాకాశమేనా? అన్నిటికంటె దూరాననున్న యొక నక్షత్రముయొద్దకు మన మేఁగినచో అచ్చటినుండి, అంత దూరాననుండి మఱియొక నక్షత్రము కనిపించునా? ఈ యాకాశమున కవధి యున్నదా? ఈ యాకాశ మిట్టిదని తెలియుటకు వీలున్నదా? తలఁచినచో గుండె బేజారగుచున్నది. ఈ యాకాశమునకును దిశలకును భేదమేమియు లేదే? మనము మనమున్నచోట నిలుచుండి చుట్టును గిరిగీసికొన్నటుల ప్రాక్పశ్చిమాది నిర్ణయము చేసికొన్నాము. అంతకంటె నింకేమియు లేదు. ఇది దిశాకాలముల వ్యవహారము. రెండవది కాలము. దానిని గుఱించి యెట్లు చెప్పవలయును? ఈ యాకాశ మెంత నిరవధికమో! ఆ కాలము నంత నిరవధికముగా నున్నది. అయ్యయ్యో! నన్నేమి చెప్పుమందువు. నన్నేమి చేయుమందువు. నాకేమియును తోచుటలేదు. ఇన్ని మహావిషయముల నొక చోటికిఁ జేర్చి యొక ముడివేయవలయునన్నచో సాధ్యమగు నట్లు లేదు. ఊహించఁగా నూహించఁగా నా ముడి నేనే; అనఁగా నెవనికి వాఁడే ఎప్పటి కప్పుడే ఎచ్చటి కచ్చటే.

ఇది యీ ముడియొక్క స్వరూపము. ఇన్ని ముడులు ముడులా? వీనిని ముడులనవచ్చునా? నాకింత తెలియును. నేనింత యూహ చేయుదును. ఈ జన్మవైయర్థ్యము నాకు తెలిసినంత మఱియొకరికి తెలియదు. అనఁగా బాగుగా తెలిసినవారిలో నేనొకఁడనని యర్థము. కాని నా మనస్సు ద్విధాభూతమై వెలుఁగు చీఁకటులయందు చెఱిసగముగాఁ బ్రయాణము చేయుచున్నది. నా జన్మలోని దోషమంతయు నిదే. ఇవతల నా కెంత జ్ఞానమున్నదో నవతల నంత యజ్ఞానమున్నది. నా కాశయున్నది. ఆశ లేదు. కోరిక యున్నది. దానిని సాధించవలయునన్న పెనగులాట లేదు. లేదనఁగా సంపూర్ణముగా లేదనుటకు వీలులేదు. యత్కించి త్ప్రయత్న మున్నది. ఆ ప్రయత్నముకూడ నిజముగాఁ బ్రయత్నమని చెప్పుటకు వీలులేనంత సూక్ష్మదశలోనున్నది. ప్రయత్నముమాత్ర మస్తి నాస్తి విచికిత్సా హేతువుగా నుండును గాని తద్గతమైన యభిలాషమాత్రము మహో ప్రయత్నము చేసెడివారి యభిలాషకు వందరెట్లెక్కువగా నున్నట్లుండును. ఆ కోర్కెయంతయు దేనినిగుఱించి? చెప్పుటకు సిగ్గుపడవలయును. నా యాత్మపరిణతికి నా జ్ఞానము యొక్క స్వరూపమునకు నా యీ కోర్కె లక్షణమునకు సంబంధ మేమియును లేదు. ఈ రాజ్యము నేఁడు నన్ను పరిత్యజించిపోవును. నాకేమియు లెక్కలేదు. పోయినచో పోనిమ్ము. ఇదివఱ కెంతమంది రాజులు రాజ్యము చేయ లేదు. ఈ రాజ్య మెంతటిది? ఇంతటి భూమండలమున భారతదేశ మొక ఖండము. అందులో మగధము లొక

యణువు. అడ్డముగాఁ జూచినచో నిది నిలువుగాఁ జూచినచో నీ యనంతకాలములో నీ కాలము చిన్నది. అడ్డమునకు నిలువునకుఁగూడ సరిపోని నా యీ రాజ్యకాలము నాకు నివ్వెఱఁ గొలుపదు. నాకు లెక్కలేదు. ధనము పోనిమ్ము. భోగములు పోనిమ్ము. అన్నియునుఁ బోనిమ్ము. నా కేమి యునుఁ బట్టదు. పలుమంది సౌందర్యవతు లున్నారు. వారి తోడి భోగము చాల శుష్కమైనదని వ్యర్థమైనదని క్షణిక మైనదని నాకుఁ దెలిసినంత యొందఱికో తెలియదు. మఱల నట్లే యనుచున్నాను. అనఁగా యోగులకుఁ దెలిసినంత నాకునుఁ దెలియునని యర్థము. అన్నిఁటినుండి నామనసును మఱలించుకొన్నాను. వానియందు నా మనస్సు ప్రవర్తించదు. ప్రవర్తింపఁ బోయినను సులభముగా మఱలించుకొనుచున్నాను. ఈ స్త్రీ విషయకమైన వాంఛ యొక్కఁడు నన్నుఁ బట్టికొని పాలార్చుచున్నది. అంతకంటె వ్యర్థమైనది లేదని నాకు తెలిసి దానియందు నేను రమించుచున్నాను. దానినుండి నా మనస్సును మఱలింతును. మఱలించుట యెంతసేపు? మఱల దానియందది ప్రవర్తించుట కెంత కాలము పట్టును? అరరే ఇది యెన్ని పూర్వజన్మల దుష్టచిత్త సంస్కారమో తెలియదు. సృష్ట్యాదియందు ప్రజాపతియొక్క మనస్సులో స్త్రీవాంఛ యుదయించునది. నేను నా యుదయ కాలమునందు దానితోఁగూడి జన్మించితి నాయన్నట్లున్నది. ప్రజాపతియొక్క అప్పటి చిత్తవృత్తియే నా కాశ్చర్య మని పించును. అతఁడు ప్రజాపతి సర్వజ్ఞుఁడు. సర్వాధికారి. సర్వజ్ఞానముయొక్క మూలస్థానము. ఆయన మనస్సులో స్త్రీ

భావము కలిగినది. స్త్రీభావమనఁగా సర్వసృష్టియుననియర్థము. నాకు దీనినిఁగూర్చి యాలోచించినకొలఁది నామనస్సు విభ్రాంతముగా నుండును. స్త్రీయనఁగానేమి? సృష్టిలోని యాశ్చర్యములలో నన్నింటికంటె యాశ్చర్యకరమైనది స్త్రీయొక్క గర్భకోశము. దానిని ప్రజాపతిభావించినాఁడు. ఆగర్భకోశమునందు పిండమేర్పడి, అది వృద్ధిపొంది, అందులో జీవుఁడు ప్రవేశించి పండి జన్మించి లోకమును నడపుచున్నాఁడు. అచట పిండమేర్పడుట యెందులకు? ఎందుకో చెప్పవచ్చునుగాని ఎట్లో చెప్పలేము? ఆ పిండము పెరుగుటయేమి? పరిణతమగుటయేమి? ఆలోపల నేమిజరుగుచున్నది? ఎట్లు జరుగుచున్నది? ఈ మహారహస్యమునకు సమాధానములేదు. అది యంతే. దాని నెవ్వఁడు నేమియు చేయలేఁడు. అది యీ సృష్టియొక్క పరమరహస్యము. అది ప్రజాపతియొక్క సంకల్పబీజము. దానినిఁబట్టి ఎన్నిచమత్కారములు వెలసినవి. ఎన్ని యూహలు? ఎంతభావన? ముచ్చెవాఁడు మట్టిని తీసికొని దానికి ముక్కులు, చెవులు, కాళ్ళు దిద్దుచున్నాఁడు. అప్పటికి నది వట్టి దిసబొమ్మ. అదియు నీకు నాహ్లాదము కలిగించదు. దానికి రంగులు వేయనారంభించినాఁడు. అదివఱకు ముక్కులు కాళ్ళు చెవులున్నను బొమ్మ బొమ్మ యనిపించలేదు. రంగులు వేసినంతనే బొమ్మ యనిపించుచున్నది. అది బొమ్మ యన్న లక్షణము ఆకృతియైన మట్టిలోనున్నదా? రంగులోనున్నదా? ఆకృతిలోనున్నది. కాని యది బొమ్మయనిపించుటకు రంగు ప్రధాన మనిపించుచున్నది. స్త్రీగతమైన మోహముయొక్క స్వరూపమిది. గర్భస్థమైన పిండము

తదభివృద్ధి దానియందు జీవుని ప్రవేశము, తజ్జన్మము మొదలైనవి ప్రధానమగుచుండఁగా తదాదియైన స్త్రీపురుష సంయోగము లోకమునందుఁ బరమమోహస్థానముగానుండుచున్నది. ఆమోహము నన్ను పట్టి బాధించుచున్నది. నేను ధరాపాలకుఁడను. పేరునకు రాజను. రాజు శ్రీముఖుఁడే. అతఁడు నన్ను నేఁడు నీవు రాజవు కావన్నచో నేను కాను. నీవు తొలఁగిపొమ్మన్నచో నేను పోదును. ఆసంగతి యతనికిఁ దెలియును. అతఁడు నన్ను పొమ్మనఁడు. నన్ను తేలికగా వధింపవచ్చును. వధించఁడు. ఎందుకు వధించఁడు? ప్రజలతని కెదురుతిరుగుదురని భయమా? ఆభయ మక్కఱలేదు. రాజ్యపాలనా సూత్రములన్నియు వానిచేతులలోనే యున్నవి. దారములతో మూతి బిగించుసంచివలె రాజ్యము వాని చేతిలో నున్నది. అతఁడు నన్ను వధించఁడు. రాజ్యము నపహరించఁడు. కాని నేను మరణించవలయును. రాజ్యము తనకు రావలయును. సామాన్య సంసారులలో వృద్ధులై వ్యాధిగ్రస్తులైన తలిదండ్రులో మేనత్తలో యెవరోయుందురు. వారికి పరిచర్య చేయలేక వయస్సులోనున్న వారిప్రాణములు విసివిపోవుచుండును. వారిని చంపరు. వారియంతటవారు చావవలయును. వారు చచ్చినచో వీరు సంతోషింతురు. సంతోషింతురా? చెప్పలేము. పైకి దుఃఖింతురు. తమబాధ వదలిపోయినదన్న భావము తప్పకుండ నుండును. ఈమనస్సు యొక్క సంఘటి విచిత్రమైనది. అదియొక్క వన్నెలమెకము. పెద్దపులియొక్క మేనియొక్క వన్నె యెఱుపా? నలుపా? ఆకు పచ్చనా? పసిమియా? బూదివన్నెయయా? ఏమియు చెప్ప

లేము. ఒక రత్నకంబళ మున్నది. దానిని దారములతో నేయుదురు. పైన నున్ని యదికింతురు. దూరమునుండి చూచినచో నొక లతయో యొక పుష్పమో దానియందు భాసించును. అచ్చటనున్న యురభ్రలోహములను పరిశీలించి యీలతయొక్క యాద్యంతము లివియని చెప్పలేము. ఈ పుష్పముయొక్క యెల్లలివియని నిరూపించలేము. ఆ నేసినవాఁ డెట్లునేసెనో తెలియదు. ఒకదానినుండి యొకటి విడదీయలేము. మనస్సటువంటిది. ఇదియొక రత్నకంబళము. ఇదియొక పెద్దపులిమేని చారలవంటివి. నన్నుచంపి శ్రీముఖుఁడు నారాజ్యము నపహరింపవచ్చును. ప్రజలెదురు తిరుగరు. తిరిగిన నది కొనగోటిమీఁదిపని. అతఁడట్లు చేయఁడు. ఎందుకు చేయఁడు? మలమూత్ర విసర్జన మంచములో చేయుచు పరిచర్యచేయుటకు మహాబాధ పడుచున్న కొడుకులు కూతుండ్రు తల్లితండ్రుల నెందుకుచంపరో అందుకు చేయఁడు. వారు బ్రతుకవలయునని వారియాశ. వారి వార్ధక్యము వారిని మరణాభిముఖులనుగాఁ జేసినది. వారు బ్రతికి బట్టకట్టునది లేదు. కాని బ్రతికినన్నాళ్ళు వ్యాధులు లేకుండ బ్రదికి సుఖముగానుండి వారూరకే మాటాడుచుఁ చనిపోయినచో వారు సంతోషింతురు. వారికిఁ గావలసినది తమ పరిచర్యాక్లేశము లేకపోవుటమాత్రమే. ఆవృద్ధులు మాత్రము నిస్సందేహముగాఁ జనిపోవలయును. వ్యాధిగ్రస్తులగుటచేత నధిక పరిచర్య చేయవలసి వచ్చినదిగాని యింటిలో నూరకకూర్చుండి వారు తినుటయు వారికిఁ బెట్టుటయు నదియు నొకబాధయే. అయినను బాధపడుదురు

గాని వారు శీఘ్రముగా మరణించినచో బాధ వదలిపోవు నని యెంతురుగాని వారిని చంపరు. నన్నుఁగురించిన శ్రీముఖ శాతకర్ణియొక్క యూహ యిట్టిది. ఇంక నేను. నా కిది యంతయుఁ దెలియునుగదా? ఆ శ్రీముఖునకు నే నడ్డముగా నెందుకు నిలుచుండవలయును? రాజ్యము చేయ వలయునన్న కోరిక నాకు లేదుకదా? నేను వృద్ధుఁడనుకాను. నేను వయసులో నున్నాను. నా తండ్రి వయసులో చని పోయినాఁడు. శ్రీముఖుఁడే నన్ను రాజును చేసినాఁడు. అప్పుడే కాదన్నచో నింతమారము రాదు. నే నాత్మహత్య చేసికొనవలయును. అది చేయుటకు ప్రాణమొప్పదే. నాదాక నెందులకు? మహావ్యాధిలోఁబడి బ్రతికియున్న ప్రతి నిమే షము ఘోర నరకముగా మనుచున్న జీవులు 'దాని దుంప తెగ, ఆ చావైనను రాదు' అందురే కాని తాము చావరే. ఆ చావు దానియంతట నది రావలయునట. ఇది యీ సృష్టి లోని యొక చమత్కారము. ఆ చావు వచ్చుటకుఁ బ్రయ త్నము కూడఁ జేయరు. ఒకవేళఁ బ్రయత్నము చేసినను ఆ ప్రయత్నము ఫలించకుండ నుండుటకు కొన్ని మెడము లట్టి పెట్టుకొని చేయుదురు. ఆ చావు దానియంతట నది వచ్చుట లోని రహస్యమేమి? దానియంతట నది వచ్చుటయేమి? ఎందుకు వచ్చును? ఎట్లు వచ్చును? ఒకనికి చావు వచ్చి నది. అందుకు వచ్చినది. అట్లు వచ్చినదని మనకుఁ దెలి యును. కాని అదిరాకముందు నది అందుకు వచ్చును. అట్లు వచ్చునని తెలియదు. ఇది మానవునియొక్క యజ్ఞాన మను డబ్బునంచికి మూతి కట్టివేసిన ముద్ర. ఆ ముద్ర తెలువఁ

బడమ. నేను వైరాగ్య వంతుఁడను. జ్ఞానిని. లోకముయొక్క వైయర్థ్యము తెలిసినవాఁడను. మరణము నర్థించెడివాఁడను. కాని యా మరణమును నేను పిలువను. దాని యంతట నది సిద్ధించినచో నా కభ్యంతరము లేదు. ఉన్నదో లేదో నాకు తెలియదు. నా యూహమాత్ర మిట్లుండును. నా కింకొక యాశ యున్నది. ఆ మరణము వచ్చువఱకు నాకు భోగము లక్కఱలేదు. రాజ్య మక్కఱలేదు. ఏమియు నక్కఱలేదు. స్త్రీసంయోగము కావలయును. ఇది యేమి యజ్ఞానము? నే నొక్కఁడను సంచముమీఁదఁ బండుకొందును. నేను రాజను. నాకు పలుమంది భార్యలు కలరు. అందకత్తెలైన పరిచారికలు కలరు. అశేషధన మున్నది. నేను పలుమంది స్త్రీలను వాంఛించి రప్పించినచో రప్పింపఁగలను. వారితో రమించఁగలను. నేను వారిని కోరుటయేకాని వారు నన్ను కోరుటలేదే. నన్ను కోరెడిస్త్రీ కావలయును. నన్ను కోరెడి స్త్రీలే నా భార్యలందఱు ననిపించుచున్నది. వారు నన్ను కోరుచున్నారా? నిజముగాఁ గోరుచున్నారా? నేను రాజునని యౌవనవంతుఁడనని ధనమిత్తునని నావలన భోగములు సిద్ధించునని వారు కోరుచున్నారు. మఱి యెట్లు కోరవలయును? లోకమునం దేస్త్రీ యైననుఁ బురుషునిఁ గోరినచో నిర్హేతుకదా కోరును. కామవాంఛ యున్నది. దాని యంతట నది ప్రవర్తించునా? యౌవనముతోఁ గూడి ప్రవర్తించును. వాంఛ దానియంతట నది ప్రవర్తించుటకు యౌవన మక్కఱలేదు. యౌవనము లేనిచో నా వాంఛకు సాఫల్యములేదు. కనుక నీ వాంఛ యౌవనముతోడిది. కాని

యౌవనము లేకుండ ప్రవర్తించును. అట్లే యౌవనముతోఁ బాటు కొన్ని భోగములు పురుషునియొక్క సౌందర్యము వాని ధనము, వాని కొన్ని పురుషలక్షణములు మొదలైనవి కూడ సాహాయ్యకములై యుండవలయును. ఇవియన్నియుఁ గలిసియున్నపుడు వాంఛకు సాఫల్యము కనుక నచ్ఛమైన వాంఛ యన్నది విచిత్రమైన వస్తువు. దాని యునికి దానికే తెలియదు. ఈ వాంఛ యెన్ని విధములుగాఁ బరిణమించునో తెలియదు. స్త్రీయందు నీకు వాంఛ ఁయున్నది. అది నిన్ను వాంఛకొఱకు వాంఛించుట లేదు. ఇతరముల నాశ్రయించి వాంఛను సఫలపఱచుకొను చున్నది. అయ్యో! పాపము. ఆ వాంఛను చూచినచో నాకు జాలియగుచున్నది. అచ్ఛమైన వాంఛాపూర్తి యెచ్చట నున్నది? మానవులయం దుండదు. పశువులయం దుండును. ఉండుననవచ్చును. రెండు లేళ్ళు, రెండు వానరములు, రెండు గజములు. రెండు పులులు సంయోగము చేసినచో వాని యందలి వాంఛ యచ్ఛమైన వాంఛ యగునేమో! అచటమాత్రము పర విషయములయొక్క సంపర్క ముండదాయని ప్రశ్న. రెండు మగ యేన్గులు ఒక యాడయేన్గు వెంటఁ బడినచో నాయాడ యేనుఁగు వానిలో నొకదానియం దధికమైన పక్షపాతము నెఱపుట దృశ్యమాన మగుచున్నది. అచటఁగూడ వాంఛ వాంఛగాఁ బ్రవర్తించునట్లు కనిపించదు. అయినను ఈ మానవ సంయోగముకంటె పశుసంయోగమే వాంఛ యొక్క స్వచ్ఛత్వమునకు దగ్గఱగా నున్నట్లున్నది. ఏమైనను నాకును నా ముక్తికిని నా యీ స్త్రీవాంఛ యడ్డముగా

నున్నది. ఇది యేదో దుష్టసంస్కారము నా మోక్షమార్గమున కడ్డుతగులుచున్నది. ఈ యడ్డంకి తీరుట యున్నదా?"

నేను నిన్నంతసేపు మాటాడితిని. నీవు బదులుమాట పలుకలేదు. నీవు పండితుఁడవని, సిద్ధుఁడవని యోగివని మా పద్మరాణి చెప్పినది. పద్మరాణిని నీ వెఱుఁగుదువట కదా! ఆమె క్షత్రియస్త్రీ. ఆంధ్రరాజవంశపు పడుచు. నీకు నామెకు నేమైన బంధుత్వమున్నదా? నీవును క్షత్రియుఁడవే నట. మీఁది పాంచాల దేశమా? కాదు కాదు. సింధుదేశమని యామె చెప్పినది. నీవు సిద్ధుఁడవటకదా? మంత్రసిద్ధులు మీకడఁ జాల యున్నవట. నాకు సిద్ధులతో నేమియు పనిలేదు. నేను మోక్షార్థిని. నేను శ్రీకృష్ణదేవుని భగవద్గీతలో నెట్లు చెప్పఁబడినదో అట్లాచరించువాఁడను. భగవద్గీతకు పలుమంది దుర్వ్యాఖ్యానములు చేయుచున్నారు. భారతములో శ్రీకృష్ణుఁడు భగవద్గీత నుపదేశించెను. గీతార్థమును పలువురు పలు విధముల దుర్వ్యాఖ్యానము చేయుదురనియే భగవంతుఁడైన వ్యాసుఁడు బ్రహ్మసూత్రములను వ్రాసెను. బ్రహ్మసూత్ర తాత్పర్యమే గీతా తాత్పర్యమని యర్థము. ఉపనిషత్తులయం దేది చెప్పఁబడెనో బ్రహ్మసూత్రములయం దదియే చెప్పఁబడెను. అదియే గీతల

యందును చెప్పఁబడెను. అవునులే. గీతలకు దుర్వ్యాఖ్యాన ములు చేసినవారు బ్రహ్మసూత్రములకుమాత్ర మేలచేయరు? మాది యుపనిషన్మతము. ఉపనిషత్తులలో నేది చెప్పఁబడెనో అది మాకు మంతవ్యము; శ్రోతవ్యము; నిదిధ్యాసితవ్యము; నీవు క్షత్రియుఁడవు; నీవును మావలెనే బ్రహ్మసూత్ర రహస్యభావన చేసెడివాఁడవు. ఇంకొక్కటి చూచితివా? మీ క్షత్రియులలో మహానుభావులు కలరయ్యా; ఛాందోగ్య ములో పంచాగ్ని విద్యయని యొకఁడున్నది. అది క్షత్రియ విద్య; తరువాత బ్రాహ్మణుల కుపదేశింపఁబడినది; నీవును గొప్పవాఁడవే యైయుందువు; ఇంత మానవ్రతావలంబివి నీవు సిద్ధుఁడ వగుదువు; నాతో నీకేమి పనియున్నది! నన్ను దర్శించుట కేల వచ్చితివి? నాకేదైన బోధ సేయవలయునని వచ్చితివా? నాకేమియు నుపదేశము లక్కఱలేదు; బోధ లక్కఱలేదు; నాకుఁ గావలసినది సద్యోమరణము; దాని యంతట నది సులభముగా, శీఘ్రముగా, శాంతముగా చావు రావలయును. చావనఁగా నేమి? అది యెట్లు వచ్చును? దాని రహస్యమేమి? నచికేతుఁడు యమునివద్దకుఁ బోయెను; యముఁడు నాచికేతము వాని కుపదేశించెను; నాచికేతాగ్ని మృత్యు తరణోపాయమని చెప్పెను; అది యుపాసకుల మార్గము; నే నుపాసకుఁడనుకాను; ప్రణవమునుకూడ నే నుపాసించను; ప్రపంచకమంతయు మిథ్య దీని స్వరూపము నిన్న చెప్పితినిగదా? ఇందులో నేమున్నది? ఏమియును లేదు; మృత్యువుయొక్క రహస్యము తెలిసినచో నీ ప్రపంచమును గెలిచినట్లే. మృత్యువనఁగా నేమియని? మృత్యువే ప్రజా

పతి; మృత్యువే హిరణ్యగర్భుఁడు; అజ్ఞానులు మృత్యువునకు దూరముగాఁ బోదురు. పోవుచున్నా మనుకొందురు. ఆ మృత్యువు నీడవంటిది. దానికి దూరముగాఁ బోవుటలేదు. నీడయైనను వెలుఁగుయొక్క సన్నిధానమునందు కలదు. వెలుఁగు లేనప్పుడు నీడలేదనిపించును. అంతరమైన వెలుఁగు నిత్యముగానున్నది. దానినీడయే మృత్యువు. సూర్యుఁడు నడిమింటనున్నపుడు నీ నీడ నీలోఁ గలిసియుండును. అదియే జీవితము. అదియే మృత్యువు. ఆమృత్యువు నీకు నెప్పుడు భాసించును? ఉదయకాలము మొదలు మధ్యాహ్నము వఱకు, మధ్యాహ్నము మొదలు సాయంకాలమువఱకు నానీడ నీకుఁ గనిపించును. మధ్యాహ్నమునందుఁ గనిపించదు. సూర్యదేవుఁడు ధగధగాయమానముగా నడిమింట తన వేయి కిరణములనుకూడఁ బట్టుకొని యగ్నిగోళమువలె నున్నప్పు డానీడ నీకుఁ గనిపించదు. అట్లే మృత్యువు నీలోనుండి లేనట్లు కనిపించును. నీయౌవనవేళ, నీ వారోగ్యముగా నున్నసమయమున నీవు లౌకికములైన యల్పసుఖములయందు నిమగ్నుఁడవై తద్భావనచేయనివేళ మృత్యువు నీలోనుండి పరమసన్నిహితమైన స్థితిలోనుండి మృత్యువు లేదనిపించును. ఇది యెంతచిత్రమో చూచితివా? మృత్యువు నీయందంత లీనమైయున్న వస్తు వెట్లు కనిపించును? అది కనిపించుటలేదు కనుక నదిలేదనిపించుట యెంతబౌద్ధమతము. చార్వాక మతము. ఇది శూన్యవాదమువలె నున్నది. బౌద్ధులకుఁ దమయందు సన్నిహితమైయున్న మృత్యువు భాసించుటలేదు. మహామంత్రి శ్రీముఖుఁడు బౌద్ధుఁడు. ఆంధ్రులందఱు

బౌద్ధులాయేమి? మాపద్మరాణి తొట్టతొలుత బౌద్ధురాలే. క్రమక్రమముగా నా సంపర్కముచేత మాఱిపోయినది. ఎంత మాఱిన నామెయందు బౌద్ధమత వాసనపోలేదు. నీవు బౌద్ధుఁడవుకాదుకదా? కావచ్చును. నీవెవ్వరవైననా కేమి? మాపద్మరాణికి నీయందభిమానము. ఆమె నీకు దర్శన మిమ్మన్నది. ఇచ్చితిని. నీవు మంత్రసిద్ధుఁడవు కావచ్చును. ఈ జడలు ఈ మీసములు ఈ గడ్డములు, ఈ శుష్కించిన శరీరము నీవొక యోగివలె నున్నావు. నీపేరేమంటివి? నీపే రేమి? అన్నట్లుగా నీవేమియు ననలేదుగదా? అనవుగదా? నీపేరు పద్మరాణి చెప్పినది. ఏమని చెప్పినది? జయద్రథుఁ డని చెప్పినది. నీకన్నులు చూచినచో భయంకరముగా నుండును. ఎఱ్ఱగా నిప్పులుగ్రక్కుచుండును. ఎందుచేత? కొందఱు రెప్పపాటు వేయకుండ నిశ్చలముగా చూచుచు తపస్సుచేయుదురు. వారినేత్రము లిట్లుండవచ్చును. హఠా త్తుగా నిన్ను చూచినచో భయము కలుగవచ్చును. పసి పిల్లలు భయపడవచ్చును. నాకేమిభయము? నాకేమియు భయములేదు. మఱియొకసంగతి చెప్పాదునా? అర్ధరాత్ర మున చీఁకటిలో నిన్నుచూతురనుకొనుము. మొగమంతయు కనిపించదు. కన్నులుమాత్రము కనిపించును. అప్పుడు నీకన్ను లెట్లుండునో తెలియునా? పెద్దపులి కన్నులవలె నుండును. నీవు పెద్దపులి వైనచో నెంత బాగుగా నుండును. నీవు కాదయ్యా మా పద్మరాణి ఆడుపులి కావలయును. ఆమెయం దప్పుడు నేను రమించవలయును. అప్పుడు నాకున్న యీ స్త్రీమోహ మంతయు పెడఁబాయు ననుకొందును. అచ్చుపైన

స్త్రీకామయొక్క చారితార్థ్య మప్పుడు కలుగు ననుకొందును. నీవు మంత్రసిద్ధుఁడ వైనచో మా పద్మరాణి కావిద్య నేర్పి పొమ్ము. నీ మొగమున సన్నఁగా నేదో వెక్కిరింపు రేఖగాఁ గనిపించుచున్నది. ఆమె యాడుపులి యైనంత మాత్రమున నేమి లాభము? నీవు మగపులివి కావద్దాయని నీ వనుకొనుచుంటివా? కాదు కాదు. ఒక యాడుపులియు నొక మగపులియు సంగమించినచోఁ గామ తృప్తి యేమి కలదు? అది సహజమైపోవును. జంతులక్షణ మైపోవును. జంతులక్షణమునందు సహజత్వము తృప్తిని సంఘటించదు. అసహజమైన దానియందు తృప్తి యధికముగా భాసించవచ్చును. తృప్తికంటె వైరాగ్యము భాసించవచ్చును. దానియందు నొక వైపరీత్య ముండునుకదా? ఆ వైపరీత్యము జుగుప్సను కలిగించును. ఆ జుగుప్స వైరాగ్యము నుదయింపఁజేయును. అందుచేత నేను నేనుగనే యుండవలయును. పద్మరాణిమాత్రము పులి కావలయును. ఇందులో నింకొక్క యాపద కలదు. ఆమె పులియగును. నన్ను చూచినంతనే మీఁదఁబడి కఱచును; వధించును; కామతృప్తి యెట్లు జరుగును? అందుచేత నీవేమిచేయవలయుననఁగా నామె పులియైనను నాయందు భర్తృభావ ముండునట్లు చేయవలయును. అపుడు నీవు నా కుపకారము చేసినవాఁడ వగుదువు. తరువాత నన్నామె పులియై చంపి తినుననుకొందము. ఈ చావులో నొక చమత్కారమున్నది. మనకు తెలియకుండ చచ్చిపోవుదు మనుకొమ్ము. మన కేమియు నూహరాదు. పట్టి భయమే ప్రధానముగా నుండును. ఆ చావును మనము

కోరి తెచ్చుకొన్నాము. చావఁబోవుచున్నామని మనకు తెలియును. ఆ చావును మనము వాంఛించుచున్నాము. లోకమునందలి కష్టముల ననుభవించలేక వ్యాధిబాధ పడలేక కోరిన చావు కాదది. చావనఁగా నెట్లుండునో తెలిసికొందమని తెచ్చికొన్న మృత్యువు. అప్పుడు మృత్యువుయొక్క యాగమనమునుఁగూర్చి విస్పష్టముగా వివిచ్యమానముగాఁ బరిశీలించవచ్చును. చావనఁగా నెట్టిది? పద్మరాణి నా ప్రియురాలు; నా భార్య; నేను బ్రాహ్మణుఁడను; ఆమె క్షత్రియస్త్రీ; ఆమెయందు నేను రమించుచున్నాను. ఆమె నాయందు రమించుచున్నది. మా యిద్దఱి మరణము కొంత విలక్షణమైనది. నాకు బ్రాహ్మణస్త్రీలు భార్య లున్నారు. ఈమె క్షత్రియస్త్రీ. ఈమె క్షత్రియురాలగుటచేత నాకామెయం దొక విలక్షణమైన యనురాగము కలదు. నా వర్ణముకాని వర్ణముగల స్త్రీతోడి సంబంధము సవర్ణురాలితోడి సంబంధము కంటె నధికసుఖదాయియన్న యూహకలదు. ఆమెకును నాయందట్టి యూహయేకలదు. నిన్నఁజెప్పితినికదా? వాంఛయొక్క స్వరూపము. ఆ వాంఛ చుట్టు నెన్నిపొరలుండునో. ఒక్కొక్కపొర యొక్కొక్క విచిత్రమైన మోహభావమును కలిగించును. వాంఛయన నొకయుల్లిపాయవంటిది. అన్నియుఁ బొరలే. లోన సన్నఁగా నొక పాయయుండిన నుండవచ్చును. ఆపాయయు విడఁదీయని పొరలకూడికయే. తాత్పర్య మేమనఁగా వాంఛయను వస్తువులేదు. కొన్ని వాంఛ లుల్లి పొరలవలె కూడుకొని కూడుకొని యది కామమువలె భాసించును. యథార్థమునకు కామమునకు రూపములేదు. స్థితి

లేదు. అది ద్రవ్యముకాదు. గుణమునుకాదు. అది యల్లాంత నిమ్న. పద్మరాణియందు నాకు నామెకు నాయందు నట్టి యనురాగముకలదు. ఆమె పులియై నన్ను వధించునను కొందము. ఆమె నన్ను వధించుటకే నేనామెను పులిగాఁ జేసిపెట్టుమని నిన్నడుగుచున్నాను. ఆమె నన్ను వధించును. వధించువేళ భర్తను వధించుచున్నానని యామెకుఁ దెలియును. ప్రేమతోడనే వధించుచున్నానని యామెకుఁ దెలియును. ఆమెకు నన్ను వధించవలయుననిలేదు. అప్పుడామె పులియైయుండును. ఆమె నన్నుచంపి తినుట యామెకు సహజలక్షణముగానుండును. తల్లికి పిల్లయందు కోపము వచ్చును. కోపముతోఁగొట్టును. కొట్టెడు సమయమునందు కూడ కొట్టుచున్నానని తెలియును. కొట్టుట కిష్టములేదు. కొట్టును. కోపము కొట్టించుచున్నది. అట్టిస్థితిలో నామె నన్ను వధించును. నేను జాగ్రత్తగా నప్పుడు మృత్యువును పరిశీలింతును. అది యెట్లువచ్చును? నాకది కావలయును. స్థూలదృష్టితోఁజూచినచో మృత్యువనఁగాఁ బ్రాణము లీశరీరమునుండి లేచిపోవుట. ఎందుకువచ్చినవి? ఎందుకు లేచిపోవుచున్నవి? ప్రాణములు పంచవిధములై నఖశిఖాపర్యంతము వ్యాపించియున్నవి. మెడనఱికినచో తద్గతప్రాణములు పోవలయును. శరీరమునం దభివ్యాపించియున్న సర్వవాయువు నొక్కటియేనా? అయినచోఁ జేతులు నరకినపుడు కాళ్లునరకినపుడు ప్రాణములేలపోవు? కంఠము నఱికినపుడు, గుండెలో పొడిచినప్పుడు మాత్రమే ప్రాణములకు సద్యోనిష్క్రమణ మెందులకు? ఒకబంతినిండ గాలిపోసెదము. దానికొక బెజ్జము

పోదుతుము. ఆగాలి నెమ్మది నెమ్మదిగా సన్నని సవ్వడి చేయుచు వెలికివచ్చును. దానికిఁగాలము పట్టును. శరీరములోనున్న ప్రాణములయొక్క లక్షణమట్టిదైనచో మృత్యువు క్రమక్రమముగా రావలయును. అట్లు వచ్చుటలేదే? ఒక్కసారిగాఁ బ్రాణములు నిష్క్రమించుచున్నవి. ఈగాలి శరీరమునందు వ్యాపించియున్న లక్షణము లోకమునందు సాదృశ్యములేనిది. దీనివలె దేహమునందుఁ బ్రాణములున్నవియని నిరూపించుట కేమియు వీలులేదు. ఇది సాదృశ్య ప్రమాణమున కతీతమైన విషయము. ప్రాణములెట్లు పోవును? ఎచ్చటికి పోవును? ఎచ్చటికి పోవునన్న ప్రశ్నకు సమాధానమే లేదు. ఎచ్చటికిపోవునో తెలియదు. ఎట్లుపోవునో తెలియదు. మనుజుని మట్టిలో పూడ్చిపెట్టుదుము. వానిప్రాణములు పోవుచున్నవి. ఎక్కడికి పోవుచున్నవి. శరీరమును వదలి పెట్టి పోవుటకు వీలులేదు. వాని శరీరముచుట్టును మట్టిని దట్టించిపెట్టితిమి. ప్రాణములెట్లు పోవును? ఎక్కడికిపోవును? కనుక మృత్యువనఁగా ప్రాణములు పోవుటకాదు. ప్రాణమాడకుండుట. ఆశరీరములో ప్రాణమాడుటకు వీలులేక పోయెను అందము. అదికూడ యనుటకు వీలులేనట్లున్నది. శరీరమున్నది. దానిలో నాడవచ్చును. అదికాదు రహస్యము. ఆ రహస్యమిది. శరీరములో గాలియున్నది. బయట గాలియున్నది. ఈ రెండుగాలులకు సంబంధమున్నంత వఱకుఁ బ్రాణమాడును. సంబంధము లేనిచో నాడదు. దానిపేరు మృత్యువు. దీనిని నీ నొప్పుకొందువా? ఖడ్గముతో కంఠమును నఱకినపుడు మనసూత్రము పట్టదే. శరీరము

నందలి వాయువునకు బహిర్వాయువునకు సంబంధము చెడ లేదే. పూడ్చిపెట్టినప్పుడు చెడినది. ఇప్పుడు చెడలేదుగదా? కనుక మృత్యువునకు మఱియొక లక్షణము చెప్పవలయును. ఆవాయువు కంఠస్థమై హృదయస్థమై యుండును. ఆవాయువు చెడినప్పుడే మానవుఁడు చనిపోవును. అనఁగా హృదయగత కంఠగత ప్రాణమునకు నేవిధమైన భంగముకలిగినను మృత్యువు వచ్చునని యర్థము. అవి రెండును ప్రాణపుగూళ్ళు. హృదయమును కంఠమును ప్రాణస్థానములు. ఇట్లనుకొను చున్నాను. ఇదియే నాకు నిజమనిపించుచున్నది. అది యెందుకు వచ్చుచున్నది? ఎట్లువచ్చుచున్నది? నే నిన్నాళ్ళ నుండి మరణమును వాంఛించుచుండఁగా నదియెందుకురాదు? ఇన్నాళ్ళనుండి వాంఛించుచుండఁగా ననఁగాఁ గొంతకాలము గడచినదని యర్థము. కనుక మృత్యువు కాలమును ప్రతీ క్షించును. మృత్యు వుచితకాలమునందుండును. తత్పూర్వ మందురాదు. ఎందుకు వచ్చుననఁగా నది వచ్చినకాలము నందు దానిరాకకుఁ గారణములనుఁ బరిశీలించవలయునని యర్థము. నేనిదియంతయు వేదాంతము మాటాడు చుంటి ననుకొనుచుంటివి కాబోలు. నీవెందు కనుకొం దువు? నీవు యోగివి. ఎవఁడో అబుద్ధిమంతుఁడు తన నీడ తాను చూచికొనలేనివాఁడు తన భాగధేయమన్న మార్తాండుఁడు నడిమింట వెలుఁగు చుండినవాఁడు, తన మృత్యువునుఁగూర్చి తా నూహించఁడు గాని తక్కినవా రూహింతురు. అవివేక లక్షణమునకు మూలస్థానమైన యీ ప్రపంచములో వారి సంఖ్యయే యెక్కువ. వారినిఁ

గూర్చియే మృత్యువునకు దూర దూర ముగాఁ బోవుదు రని చెప్పితిని. మృత్యువునకు దూరముగాఁ బోవుట యనఁగా దానినిఁ గుఱించి భావించకుండుట. ఇందాకఁ జెప్పితినిగదా. ఆ మృత్యువు వచ్చుటకు నొకవేళ యున్నదని. ఆవేళ దానికే తెలియును. ఆవేళ రానంతసేపు మూర్ఖుఁడు దాని నెంతైన నిందించును. దానినిఁ గుఱించి యూహించెడి వారి నెంతైన నీసడించును. నేను చెప్పెడి మాటలు నీకు విసుగు కలిపించుచున్నవా? అయినచో వెడలిపొమ్ము. నీ బదులు పద్మరాణిని పంపించుము. నీ వున్నంతసేపు నే నిట్టి మాటలే మాటాడుదును. పద్మరాణి వచ్చినచో మా ప్రసంగము వేఱుగా నుండును. అది శృంగారరసము; ఇది శాంత రసము; ఈ రెంటికిని సంబంధములేదు. నాయం దీవిపరీత లక్షణములుగల రెండు రసములు విచిత్రముగా సంయోగము పొందినవి. ఇంకొక్కటి చూచితివా? నా యాత్మయందు శాంతరసమున్నది; నా మనస్సునందు శృంగారమున్నది; నా వాంఛయందు బీభత్సరస మున్నది; పద్మరాణియందు శృంగారరసమున్నది; నాయందు శాంతరసమున్నది; నీ యందు భీభత్సమున్నది; నీ కన్నులే దానికి నిదర్శనము. ఓయి జయద్రథుఁడా! నేనును మా పద్మరాణియు, నీవును ముగ్గురముఁ గలిసి యీ మూఁడురసములను ముప్పేట పేనుదము. ఇదియొక విచిత్రమైన రజ్జువుగా నుండును. నీకు మాటలు వచ్చునా? మౌనవ్రతమా? నీకుఁ గల మంత్ర సిద్ధులను నేను చెప్పిన సిద్ధి నీకుఁ గలదా? ఆమెను పెద్దపులిని చేయఁగలవా? నీ వనేక మృగములుగాఁ గాగలవని నాకామె

చెప్పినది. అందుకనియే నీకు నేను దర్శన మిచ్చితిని. నిన్ను దీని నభ్యర్థింప నెంచితిని. నీవు నిరంతరము మృగములుగా నగుటచేత నీకు వాక్ఛక్తి పోయినదాయేమి? పోదు. ఎట్లు పోవును? వాక్ఛక్తి యనఁగా నాభినుండి వచ్చుచుండుఁ గాలి గుండెనుండి కంఠమునుండి తాల్వాది స్థానములనుండి వెలువడుటయేకదా? జంతువులయొక్క తాల్వాది ప్రదేశ ములు మానవు లుపయోగించు శబ్దములను వెలివఱచుటకు యోగ్యములైనవి కావు. ఇప్పుడు నీది మానవాకృతియే. నీవు తకారాదుల నుచ్చరించఁగల వనుకొందును. నీవు నా దర్శనమును వాంఛించితివని పద్మరాణి చెప్పెను. ఎందుకు వాంఛించితివి? నా కెట్టయెదురుగా బెల్లముకొట్టినతాతివలె కూర్చుండుటకు వాంఛించితివా? నాచేత మాటాడించి విన నెంచితివా? నేను మాటాడఁగా మాటాడఁగా నాస్వరూ పము నీ కవగతమగును. తదవగతి నాధారముచేసికొని యేదైన రాజ్యకార్యము నిర్వహింప నెంచుచుంటివా? ఎవఁ డైన పరరాజు నిన్ను గూఢచారిగాఁ బంపించెనా? నామీఁద నీ కేమైన పగయున్నదా? నేను నా రహస్యములన్నియు నీకుఁ జెప్పివేయుచుంటిని. నాయందు దాపఱికమేమియును లేదు. నేనెట్లు పుట్టితినో అట్లున్నాను. నీవునన్నుఁ జంపవలయునని వచ్చినచోఁ జంపుము. చెప్పిచంపుము. నేను మృత్యువును పరీక్షచేయుదును. ఈ ప్రాణములయొక్క స్వరూపము నేను గుర్తుపట్టవలయును. ఈ దేహమునందుఁ బ్రాణములు ప్రవేశించి యాడుచుండుటచేతకదా ఈ జీవుఁడిందులోఁ బ్రవే శించినాఁడు. వానియాటలు వాఁడాడుచున్నాఁడు. ఈ

దేహమువదలినచో మఱియొక దేహములోనైన వాఁడీ[ప్రాణముల నాధారముచేసికొనియే నాట్యముచేయును. ఆడును. గంతులువేయును. కేకిసలుకొట్టును. తందనాలు [త్రొక్కును. వాని యీ యాటను [ప్రాణములనుఁబరిశీలించి నేను కట్టింతును. [ప్రాణములను నియమించుటచేత, [ప్రాణముల నరికట్టుటచేత [ప్రాణములయొక్క స్వరూపము తెలిసికొనుటచేత జన్మరాహిత్యము సాధింతును. ఇదియొక మార్గము. ఇది పూర్వమెవ్వరు నుపదేశించలేదు. నేను లోకములకుఁ జెప్పుచున్నాను. పలుమంది మహర్షులు పలువిధములుగా మోక్షమార్గ ముపదేశించిరి. వ్యాసుఁడు [బహ్మసూ[త్రములయందొకరీతిగాఁ జెప్పెను. జైమిని మఱియొకవిధముగాఁ జెప్పెను. కపిలుఁడు తన సాంఖ్యసిద్ధాంతమును వేఱుగాఁ జెప్పెను. పతంజలి [ప్రాణములమీఁదఁ గొంత [ప్రాధాన్యమునుంచెను. కాని అతనిమార్గము [ప్రాణముల నియమించుటమీఁద నాధారపడియున్నది. [ప్రాణస్వరూపపరిజ్ఞానముమీఁదలేదు ఈదేహమునందుఁ [బాణములెట్లు [ప్రవేశించుచున్నవి? ఎట్లు వదలిపోవుచున్నవి? ఎట్లు [ప్రవేశించుచున్నవో చెప్పుట సాధ్యముకాదు. శిశువు మాతృగర్భస్థమై యున్నప్పుడు [ప్రవేశించుచున్నవి. వాఁడుశిశువు—జ్ఞానరహితుఁడు. ఆలోచనాహీనుఁడు. ఏవిధమైన యిక్కట్టు లేకుండ విచారణకు తావులేకుండ మొక్కనీళ్లుపీల్చుకొన్నట్లు చెట్ల యాకులలో గాలి[ప్రవేశించినట్లు పూలరేకులలోనికి రంగు వచ్చినట్లు [ప్రాణము లాగర్భస్థశిసువునందు [ప్రవేశించు

చున్నవి. అచట దీనినిఁగూర్చి విచారణచేయుటకు వీలు లేదు. పురుషుఁడు పెద్దవాఁడైన తరువాత, జ్ఞానవంతుఁడైన తరువాత మరణించుచున్నాఁడు. వాఁడు దీనిని గుర్తుపట్ట వచ్చును. గుర్తుపట్టుటకు వీలున్నది. ఖడ్గముతో కంఠ ముత్తరింపఁ బడినపుడు గుర్తుపట్టలేము. కత్తితో గుండెలో పొడిచినచో ప్రాణములు పోయినచో నపుడు గుర్తుపట్టలేము. వ్యాధిగ్రస్తుఁడై తెలిసియుండి యొకని ప్రాణములు పోవువేళ వాఁడు వివేకి యైనచో వానిని గుర్తుపట్టవచ్చును. అయ్యో చనిపోవుచున్నానని వాఁడు దుఃఖపడుచు ప్రాణములను గుర్తు పట్టఁడు. అది వానికి పునర్జన్మ హేతు వగుచున్నది. ఇవిగో ఈ ప్రాణము లిట్లు పోవుచున్నవని తెలిసికొని గుర్తుపట్టితివేని మృత్యువువలని భయము నశించుచున్నది. దాని భయము నశించినదనఁగా మోహము పోయినదన్నమాటే. నీకు మఱల జన్మలేదు. జన్మ వచ్చి యేమి ప్రయోజనము? పాటలీపుత్ర నగరముయొక్క వీథులన్నియు నీకు సుపరిచితములు. ఈ మహానగరమున నీవు తప్పిపోవు. ఇచ్చట నిన్నెచ్చటఁ బార వేసినను నీకు భయములేదు. ప్రాణములయొక్క రాకపోకల తెరువు తెలిసికొన్నప్పుడుకూడ నట్లే యుండును. అవి వచ్చును; పోవును. నీకు లెక్కలేదు, ఇది మోక్షమునకొక మార్గము. ఎందుకయ్యా! పూర్వర్షులు చెప్పిన సర్వ మార్గ ములను వదలి నీ వీ క్రొత్తమార్గమును పట్టుకుంటివని నన్న డుగ వచ్చును. ఈ లోకమంతయు వ్యర్థమైనదని కర్మాను గుణమైనదని జీవుఁడు నిత్యముక్తుఁడని మాయాపిహితుఁడని

కామాదులయందు రమించుచున్నాఁడని ఆ రమణమే బంధ హేతువని యుపనిషత్తులు చెప్పును. వైయాసికి బోధించును. ఆ మార్గమున మోక్షమునుఁ బొందవచ్చును. నా మనస్సు కామమునందు పాతుకొని యున్నది. నాకు వేద వేదాంగ ములలోని రహస్యములు తెలియును. పురాణేతిహాసములలోని మర్మములు తెలియును. ఉపనిషదర్థములు నాకుఁ గరతలా మలకములు. కామమునందు రూఢమైయున్న నాకామార్గ మాచరణీయము గాలేదు. అందుచేత నే నింకొక మార్గమును చూచికొనవలయును. జైమినీయమైన మార్గము కలదు. యజ్ఞ యాగాది క్రతువులు చేయవలయును. ఆచారమును పాటించవలయును. నిష్ఠగా నుండవలయును. దీక్షావలంబనము చేయవలయును. బ్రాహ్మణులకు భూరిదక్షిణ లీయవలయును. దీక్షావేళయందు స్త్రీకామమును వరించరాదు. నా కది సాధ్యముకాదు. అందుచేత జైమినీయమార్గము కూడ నాకు పరిహరణీయ మైనది. ఎవరో మహానుభావులు పుష్యమిత్రాగ్నిమిత్రులవంటివారు మహా యజనశీలురు తన్మార్గ మవలంబింతురు. అది యందఱకు సాధ్యమైన విషయముకాదు. నాకదియుఁ గిట్టదు. కపిలుని త్రోవ యున్నది. ప్రకృతి పురుషులయొక్క వివేకముమీఁద నది యాధారపడియున్నది. ప్రకృతినుండి పురుషుని విడదీయ వలయును. మూలప్రకృతి మహత్తు తజ్జనితాహంకారాదుత్పన్న త్రైగుణ్యము, వాని కలయికచేత నీసృష్టియొక్క సమావిర్భా వము, పురుషునియొక్క వీనితోడి యంటు సొంటులేనితనము

మొదలైన పరిజ్ఞానమువలన మోక్షమును సాధించవలయునని కపిలాసురి పంచశిఖాదుల వాదము. అదియు నాకునచ్చదు. నచ్చదనఁగా నాకు సాధ్యముకాదు. నాకెట్లు సాధ్యమగును? నేనింతఁ దెలిసినవాఁడను. పద్మరాణి నామనస్సులోఁ బీట వెట్టికొని కూర్చున్నది. ఆమె యచటినుండి తొలఁగిపోదు. అచట నెట్లు కూర్చున్నది? గంగానది ప్రవహించుచున్నది. అందులోనుండి యొకకాలువ వెడగా తొలఁగి గుమ్మమైన జీడిమామిడితోఁటలో నిసుకతిన్నెలనడుమగాఁ బ్రవహించుచున్నది. తజ్జలముచేత చెమ్మగిలిన యొక యిసుకదిబ్బమీఁద నొక జీడిమామిడిచెట్టు వ్రాలి కమ్ముకొని పొదరిల్లువలె నేర్పడినది. ఆమె యచట సన్నని వలిపంపుచీర కట్టుకొని కూర్చున్నది. ఆచీర యంచ తెక్కలవలె నున్నది. ఆచీరకు పొడుగున బెత్తెడు వెడల్పున బంగరుటంచుకలదు. ఆచీర పైఁటచెంగు జేనెడు వెడల్పున సన్నని యెఱ్ఱపూవులు కుట్టిన జరీయంచుకలదు. ఆమె లోనధరించిన గాగరావలన నాచీర తెల్లగానున్నదికాని లేనిచో నామెయొడలి బంగరుపసిమి చేతఁ జీరయంతయు బంగారమే యగునట్లుండెడిది. ఆమె యొకరైక ధరించినది. ఆరైక గోధుమవన్నెకల చిక్కని. పట్టుతో నేయఁబడినగుడ్డ. ఇంతటి రమణీయమైన చేలము నామె శరీరసౌందర్యమునకు లొంగిపోవుచున్నది. ఆమె యచటఁ గూర్చుండి వీణవాయించుచున్నది. చెవుల వద్దనున్న నెడమచేతి వ్రేళ్ళకుఁగాని మీటుచున్న కుడిచేతి వ్రేళ్ళకుఁగాని యుండిన యుంగరములు వానిలోఁ బొదుగఁ

బడిన మరకతములు మాణిక్యములు కలవగుటచేత నంగుళీ యక భావముకలుగుచున్నది. కాని వాని కనకమయత్వము వృథాయగుచున్నది. ఆవీణలో నేనున్నాను. ఆతంత్రుల సవ్వడిలో నా ప్రేమయున్నది. ఆ పద్మరాణిని నే నారాధించుచున్నాను. ఓయీ జయద్రథుఁడా! నా కింకఁ గపిలుని సాంఖ్యమేమి యెక్కను? ప్రకృతినుండి పురుషుని నే నెట్లు విడఁబఱచఁగలను. నాకదియు సాధ్యమైనపనికాదు. ఇంకఁ బాతంజలమున్నది. ప్రాణములను నియమించుట. ఇందాక చెప్పితినికదా! ప్రాణము లాడకుండుట మృత్యువని. పతంజలి యిచ్చట నేమి రమణీయమైన మనోహరమైన యాశ్చర్యకరమైన ప్రయోగము చేసినాఁడు. ప్రాణము లాడనిచో మృత్యువున కొకవేళయున్నదని చెప్పితినికదా! ఆవేళ రాలేదు. ఈలోపుగా నీవు ప్రాణముల నాడనీయవు. కనుక నేమగుచున్నది? ప్రాణములుపోవు. నీవు వాని నాడనీయవు. ఈరీతిగా పతంజలి మృత్యువును సాధించెను. ప్రాణముల నచట బిగఁబట్టియుంచెను. అవి యేమిచేయును? గిలగిల కొట్టుకొనును. కొట్టుకొని కొట్టికొని యాగిపోవును. అప్పుడు వానిస్థితినిఁ బరిశీలించవచ్చును. కాని నా కాస్థితి తెలియదు. నామార్గమదికాదు. దానికోసము ప్రయత్నము చేయవలయును. అభ్యాసము చేయవలయును. ఇంకొక్కసంగతి చూచితివా? ఇన్నిమార్గములును మార్గములేకాని యన్నియు సూక్ష్మముగా విచారించినచో నొక రహస్యముమీఁద నాధారపడియున్నవి. ఆరహస్యమేమనఁగా మనోనిగ్రహము. అది

భావనామూలము నాకు చేతకానిదది. కనుక నా కా యే మార్గమును సాధ్యముకాదు. అందుచేత నే నీ నూతనమైన మార్గమును విచారించితిని. అన్నిచదువులు చదివితిని. నా మనసుమాత్రము స్త్రీనుండి దూరముగాఁ బోవుటలేదు. అట్టి వానికి ముక్తియెక్కడ? స్త్రీమూర్తిని పరమేశ్వరీరూపమున భావించి ధ్యానించి యుపాసించికొందఱు ముక్తులగుదురు. కొంత సూక్ష్మముగాఁ జూచినచో నది సాంఖ్యమువంటిదే. ప్రకృతి నుపాసించుట స్త్రీయందు రమణబుద్ధిమాని దేవతా బుద్ధి పెట్టుకొనవలయును. అనఁగా మనోనియమము; అది చేతనైనచో నింతదూర మెందులకు? నాకు నాకే యాశ్చర్యముగా నుండును; నాయంతటి పండితుఁడు నాయంతటి స్త్రీ బుద్ధియగుటయేమి? వెన్నెలలో నంధకారము వ్యాపించి యుండును; నీకు తెలియునా? అంధకారము వ్యాపించి యున్న వెలుఁగే కొంత చల్లదనముతోకూడి వెన్నెల యని పించుకొనును; అంధకారస్పర్శలేని వెలుఁగు సూర్యుని వెలుఁగు; ఆ సూర్యునివెలుఁగు తనలోని యంధకారమును నీడగా వెలికిఁద్రోసినది; నా జీవితము వెన్నెలవంటిది, వెలుఁగున్నది; అంధకారము దాని ప్రత్యణువునందు సూక్ష్మముగా వ్యాపించియున్నది; నీవు నా స్వరూపమునుఁ దెలిసికొనుటకు వచ్చితివేని చెప్పితినిగదా! సంతోషించుము;"

## ౪

ఒకరాజున కిద్దఱు కొడుకులుందురు; ముప్పురుందురు; నలుపురుందురు. ఎందఱున్నను పెద్దవాఁడు రాజు. తక్కిన వారు రాజపుత్రులు; రాజసహోదరులు. తరువాతి తరములో తాతాసహోదరులు; తరువాతి తరములో జ్ఞాతులు, మఱియు నొక తరము గడచినచో వారెవరో వీరెవరో. కాని యేక వంశీయులు. ఇట్టివారు ప్రతి రాజకుటుంబములోన నుందురు. వారిలోఁ గొన్ని కుటుంబములు రాజధానిని వదలిపెట్టి వెడలి పోవుదు. ఎచ్చటనో యుద్యోగములు సంపాదించుకొందురు. ఇట్టివారు ధాన్యకటకమునందునుఁ గలరు. ధాన్యకటక మాంధ్రరాజ్యమునకు రాజధాని. పోయినవారు పోఁగా ధాన్యకటకమున నిట్టి కుటుంబములు వందకు తక్కువ లేవు. వారందఱు రాజవంశీయుల క్రిందనే లెక్కయైనను తరములు రెండుమూఁడు గడచినవారు మాత్రమే రాజబంధువులుగా మన్నింపఁబడుదురు. కాని యొక్కటే కుదురగుటచేత మర్యాదలో నందఱు సమానులే. చుట్టరికము దూరమైనను వరుసలు వావులతో వారు వారు సాగుచుందురు. ఇందులో బంధుత్వము దూరమైనను కొందఱి కొందఱి నడుమ స్నేహము దట్టముగానుండి బంధుత్వము దగ్గఱదే యన్నట్లు నటింతురు. ఈ ధాన్యకటకమున నిప్పటికి నలుఁబది యేండ్ల క్రింద నొక పరదేశ రాజవంశీయుఁడు వచ్చెను. ఆ మహా నగరమునందే చాలదినములుండెను. అతఁడును క్షత్రియుఁడే

కావున వారతనిని గౌరవించుచుండిరి. వట్టి క్షత్రియుఁడేకాక యతఁడు వచ్చిన కొన్నాళ్ళకుఁ దాను ఖడ్గవిద్యా నిపుణుఁడుగాఁ దెలిసికొనఁబడి రాజకుమారులకుఁ దద్విద్యయందు నధ్యాపకుఁడుగా నియమింపఁబడెను; రాజతనికిఁ గొంత వేతన మిచ్చుచుండును; అతఁ డేకాకిగానే వచ్చెను; ఏకాకిగానే యుండుచుండెను; కాని రాజపుత్రులకు గురువుగా నియమింపఁబడిన తరువాత వానికొక ప్రత్యేక నివాసగృహ మీయఁబడెను; ఊరిలో నతఁడు బంధువు కాకపోయినను వానికి బంధు మర్యాద లన్నియు జరుగుచుండెను; అతఁ డచ్చట నించుమించుగాఁ బదియేండ్లు నివసించెను; తొలుత నతఁ డచ్చటికి వచ్చినపుడు వానికి ముప్పదియేం డ్లుండ వచ్చును;ఉదయములయందు రాజపుత్రులకు ఖడ్గవిద్యనేర్పుట తప్ప వాని కింకొక పనిలేదు; ధాన్యకటక రాజవంశములో భిన్న వయస్కులైన పలుమందికి వానితో భిన్నములైన సంబంధములు కలవు. కొందరు వృద్ధులైన రాజవంశీయులు వానిని గౌరవించరు; అతఁ డనినచో నెడమొగము పెడ మొగముగా నుందురు; వారు ఖడ్గవిద్యా నిపుణులు; వారిని వదలి రాజు వీనిని విద్యా గురువుగా నేర్పాటు చేయుట వారి కనభిమతమైన విషయము; వారు వానితోఁ గత్తియుద్ధము చేయుట వారి మర్యాకుఁ దగినపని కాదు; ఇతఁ డనఁడుగాని ఈతని శిష్యులందురు; ఏమనఁగా మా గురువు సామాన్యుఁడు కాఁడు; వారు వృద్ధులైనను మహాయుద్ధములయం దాటితేటినవారైనను మా గురువుయొక్క ఖడ్గవిద్యముందు వారి ఖడ్గవిద్య నిలువదు; ఖడ్గవిద్యయం

డెన్నో సంప్రదాయములు కలవు; ఆవృద్ధుల కాంధ్రక్షత్రియ సంప్రదాయమే తెలియునుగాని యితర దేశములయందలి యితర రాజవంశముయందలి ఖడ్గవిద్యా సంప్రదాయములు తెలియవు. మా గురువున కన్నియుఁ దెలియును.” ఈ మాటలు వారనఁగా నావృద్ధులు విని చప్పరింతురు. పిల్ల కాకి కేమి తెలియునురా యుండేలుదెబ్బ యందురు. ఒక్కొ-కపుడు ఖడ్గవిద్యా ప్రదర్శనములు జరుగును. వానిలో నా క్షత్రియుఁడు పాల్గొనఁడు. అతఁడు దూరముగా నిలుచుండును. అతని శిష్యులే పాల్గొందురు. ఆవృద్ధులైన వారందఱు వత్తురు. ఆ శిష్యుల చాకచక్యమునకు మనస్సులో నివ్వెఱపోదురు. పైకి మాటాడకుండ నూరకుందురు. ఈ నూతన గురువు విచిత్రమైన మనుష్యుఁడు. అతని పేరేమియోం యెవ్వరికినిఁ దెలియదు. గురువుగారనియే వయసులోనున్న క్షత్రియులందఱు నందురు. గురువుగారన్న యా మాట పెద్దలకుఁ గంటగింపుగానుండును. అతనికి గురువుగారని పిలుచుకొనఁదగినంత వయస్సే లేదు. కాని రాజతనిని విద్యాగురువుగా నియమించెను. కాదనుటకు వారికేమియధికారమున్నది? ఇంతకును రా జతనిని విద్యాగురువుగా నెందుకు నియమించెను? అన్న ప్రశ్నకు సమాధాన మెవ్వరు నెఱుఁగరు. అదియొక రహస్యము. ఈరహస్యము తెలిసినవారు కొలఁదిమందియే కలరు. ఒకప్పుడు రాజు వేటకువెళ్లెను. ఇచ్చట నొక విచిత్రమైన సంవిధానము జరిగెనట. ఆవేటకు వెళ్ళకముందటిరాత్రి రాజున కొక స్వప్నమువచ్చెను. నీవు రేపు వేటకు వెళ్ళెదువు. నిన్నుఁ జంపుటకొక యోధుఁడు

వచ్చును వానిని నీవు గెలువలేవు. నీవు వానిని రక్షించు మని బతిమాలుము. అప్పుడు బ్రతుకుదువు. అని కలలో నెవఁడో చెప్పెను. ఆరాజునకు జ్ఞాతులు కలరు. మాత్సర్యముకల జ్ఞాతులుకలరు. ఈ మాత్సర్యము రాజ్యాధికారము తమ కుదురునం దుండవలయునా వేఱొక కుదురునం దుండవలయునా యన్న విషయము — ఈ మాత్సర్యము మూఁడు తరాలుగా నల్లేవచ్చుచున్నది. మూఁడు తరాలక్రిందటి యాంధ్రరాజునకు సంతానములేదు. అతఁ డొకనిని పెంచుకొనెను జ్ఞాతులయందే పెంచుకొనెను. ఆ పెంచుకొనఁబడినవాఁడు దూరపుజ్ఞాతి. అంతకంటె దగ్గఱివారు కలరు. వారిలో నొకఁడు మిక్కిలి దగ్గఱిజ్ఞాతి. అతనినిఁ బెంచుకొనవలయునని రాజవంశములోనిమాట. రాజు దూరపుజ్ఞాతి యొక్క యొక చిన్నకుమారునియందు మమకారముగలిగి వానినిఁ బెంచుకొనెను. పెంచుకొనుటలో నియమ మేమున్నది? మూఁడు తరా లైనతరువాత రాజ్యమునకు నధికారియగు ధర్మసూత్రము వంశ మర్యాదనుఁబట్టి ప్రవర్తించదు. రెండు కుదుళ్ళును మూఁడు తరాలు దాటిపోయినవే. అందులో దూరపుతనము దగ్గఱితన మేమున్నది? అప్పటి నుంచి ఈ మూఁడు తరాలుగా నీ వైమనస్యము రాజవంశమునందు వరుసగా సాగుచున్నది. ప్రస్తుతమున్న రాజుపేరు చంద్రశేఖరశాతకర్ణి; రాజ్యము మాకు రావలయునన్న వంశమువారిలో నిప్పటి ప్రధాన పురుషుఁడు గోముఖశాతకర్ణి; గోముఖశాతకర్ణికి కుమారుఁడు కలఁడు. అతని పేరు శ్రీముఖుఁడు; ఈ శ్రీముఖుఁడు చక్రవర్తి యగునని సర్వ

భారతదేశమును జయించునని జ్యోతిష్కులు చెప్పుచువచ్చిరి. అప్పటికి శ్రీముఖుఁడు పదియేండ్లవాఁడు.. ఆతనిని గోముఖుఁడు విద్యాగురువైన యీతనివద్ద నభ్యసింపఁ జేయుచుండెను. ఇది తరువాతిమాట; రాజునకుఁ గల వచ్చిన నాఁటికి శ్రీముఖుఁడు పదియేండ్ల పిల్లవాఁడు. గోముఖుఁడే యీ రాచవానిని దూరదేశమునుండి పిలిపించెనని చంద్రశేఖరుని వానిచేత వధింపించవలయునని పన్నాగము పన్నెనని కొందఱందురు. కాని గోముఖుఁడు భూతవైద్యుఁడు కాఁడు; మంత్రవేత్త కాఁడు; అతఁడు రాజున కిట్టి స్వప్నము నెట్లు తేఁగలఁడు? ఆ స్వప్నము వచ్చినదికదా! రాజు వేటకుఁ బోవుట మానివేయవచ్చును; కాని వేటయనఁగా నేమి? రాజు వేటకుక్కలతో, బోయవాండ్రతో, వలలతో, సిబ్బందితో, నాయుధములతో వేటకు బయలుదేఱి పోవును. అడవిలో నొకచోట గుడారములు వేయును. అచ్చటనే వారము పదిదినము లుండును. అచ్చట నున్నప్పుడు రెండు మూన్నాళ్లు వేట జరిగిన తరువాత మఱి నాలుగైదు దినములు వేట జరుగునని మున్నె నిర్ణయింపఁబడిన తరువాత నడుమ నొకనాఁడు స్వప్న మిట్టిది వచ్చినచో రాజుపసంహరించును. నిర్ణయింపఁబడిన మఱి నాల్గు దినముల వేట యాపుటకు హేతువేమి చెప్పవలయును? ఈ స్వప్నమును చెప్పినచో నలువురును బరిహాసింతురు. రాజు పిఱికివాఁడందురు. ధైర్యహీనుఁ డందురు. రాజుగా నుండుటకు తగనివాఁ డందురు. అంతకంటెఁ జంద్రశేఖరుఁడే యీ స్వప్నమును లెక్కసేయలేదు. ఎవఁడో తన్నెదిరించుటకు వచ్చుటయేమి?

వానికిఁ దానులొంగిపోవుటయేమి? ఇది యెట్లు సంభవము? తనచుట్టు సామంతు లున్నారు. సేనాపతులున్నారు. ఒంటరిగాఁ డెవ్వఁడువచ్చి తన్నెదిరించుటకు సాహసించును? వంద పిచ్చి కలలు వచ్చుచుండును. అందులో నిది యొకటి మఱునాఁడు రాజు వేటకు వెళ్లెను వేట యనేక విధములుగా నుండును. సామాన్యముగా మృగములనుఁ బఱవఁదోలించి వలలోఁ చిక్కుకొనియున్న వానిని వధించుట యొకవిధమైన వేట. మఱి యొకవిధమైన వేట పులియో సింహమో తత్ప్రదేశమునందు సంచరించుచున్నదని తెలిసికొని యది నీరుత్రావుటకు వచ్చు చోట మాటువెట్టి కూర్చుండి దానిని సంహరించుట. మఱి యొక విధమైనవేట, యొకలేఁడినో పులినో వెంటఁబడి తరుముచుపోయి దానిని వధించుట. ఈ మూఁడవ విధమైన వేటయందు నా నాఁడు రాజు తనకుఁ దెలియకుండఁ నిమగ్నుఁడయ్యెను. దూరముగా నొకమృగము గనిపించెను. అది లేడిఁయో పులియో తెలియలేదు. దూరముగానున్న పొదలలోఁ గనిపించెను. రాజు దానివెంట పడెను. ఇతరులందఱు దానిని లేఁడియే యనుకొనిరి. రాజున కది పులిగాఁ గనిపించెను. లేఁడిని వెన్నాడెడు రాజును మృగయు లనుసరించలేదు. రాజు దానివెంటఁబడి యెంతోదవ్వుపోయెను. ఇతఁడు గుఱ్ఱముమీఁదఁ బోవుచుండెను. పోను పో నది పులియే యనిపించెను. పోఁగా పోఁగా నొకపర్వతము, పర్వతము రెండుగా చీలియుండుట, ఆమృగ మా రెండుపర్వతముల నడిమి లోయలోనికిఁబోఁగా రాజు స్వప్నమును మఱచి పోయి గుఱ్ఱము వెళ్లుటకు వీలులేని త్రోవయగుటచేతఁ దాను

గుఱ్ఱము దిగి యామృగము ననుసరించెను. కొండలెక్కెను. పెద్దపెద్ద ఱాళ్ళమీఁద దూకవలసివచ్చెను. రాజా మృగమును పగలు జాముప్రొద్దెక్కె యనుసరించెను. అప్పటికి జాముప్రొద్దుమిగిలినది. అట్టిస్థితిలో రాజున కచట నొక గుహ కనిపించెను. ఆ గుహలోనుండి యొక పురుషుఁడు వచ్చెను. అతఁడు దృఢకాయుఁడు. నిత్య వ్యాయామమును చేత కఠినీకృతమైన దేహయష్టికలవాఁడు. మొగమున క్షత్రియలక్షణము లున్నవి. అతనినిచూచి రాజు "నీ వెవ్వరవు? ఇట్లొక మృగమువచ్చినది. అదియొకపులి. నీ కది కనిపించినదా" యనెను. ఆ పురుషుఁడు రాజుతో ధూర్తముగా మాటాడెను. నీ వెవఁడవు? అమర్యాదగా మాటాడెదవేమి? నన్ను నీ వనెదవేమి? అనఁగా రాజు తా నాంధ్రక్షమామండల భర్త నని చెప్పెను. ఆ పురుషుఁడు వికావిక నవ్వి యిట్లనెను. ఓయీ! ఆంధ్రక్షమామండలమైనను సర్వభారతమైనను ముల్లోకముల కాధిపత్యమైన యింద్రత్వమైనను రాజధానిలో నున్నప్పుడురాజు. తన పరివారము చేత సేవింపఁబడుచున్నప్పుడు రాజు. నట్టడవిలో మహా పర్వతమధ్యమున నేకాకిగా నున్నపుడు రాజు కాఁడు. వాఁడు వట్టి మనుష్యుఁడు. వాని యొడలిలో నెంతశక్తి యున్నదో అంతమాత్రమే కలిగిన యొకవ్యక్తి. తక్కిన వారి వంటివాఁడే. ఈ యడవిలో వాఁడు రాజని పంచభక్ష్య పరమాన్నములు తినలేఁడు కదా? ఇచట దొరకెడి కందమూలములే తిననలయును. కనుక నీవు ధాన్యకటకమునకుఁ దిరిగిపోయినపుడు రాజ వగుదువు.

ఇచ్చట సామాన్యుఁడవే. నే నెటువంటివాఁడనో నీవు నటువంటివాఁడవే. కనుక వ్యర్థముగా రాచఠీవిని ప్రదర్శించ కుము. అనఁగా రాజునకుఁ గోపము వచ్చి వానిని వధించ వలయునని కత్తి దూసెను. వాఁడు నవ్వుచు నిట్లనెను. ఓయి రాజా! నేను నిరాయుధుఁడను. నీవు సాయుధుఁడవు. ఇది రాజలక్షణముకాదే. దీనినిఁబట్టికూడ నీవు రాజవు కాదని తెలియుచున్నది. నీయందు నిజముగా రాజలక్షణము లేదు. రాజైనవాఁడు తనకంటెఁ దక్కువవానితో యుద్ధము చేయఁడు. అనఁగా రాజిట్లనెను. "రాజు ధూర్తులను శిక్షించును." పురుషుఁడు:- తన చేతితో శిక్షించఁడు. రాజు:— ఇప్పుడు విపరీత పరిస్థితులు వచ్చినవి కనుక నీవు మర్యాదాతి క్రమణము చేయుచున్నావు కనుక నిన్ను నేను సంహరింతును. పురు:- రాజా! నాచేతి కొక ఖడ్గమిమ్ము. అప్పుడు తులా యుద్ధము చేయుదము. లేదా ఈ గుహాలో నా ఖడ్గమున్నది. నేనా ఖడ్గమును తెచ్చికొందును. నీవంతవఱకు కాగుము — అనఁగా రాజు నీవు గుహాలోనికిఁబోయి ఏమార్గమునుండియో పలాయనసూత్రము పఠింతువేమో! పురు:- అట్లే కానిమ్ము. నీకు వచ్చిన నష్టమేమి? నేను నిన్నుమర్యాద చేసితిని. పాఱి పోయితిని. నీ యాధిక్యమునకు భంగము లేదుకదా? నీచేత నవమానింపఁబడి పాఱిపోయినచో నేను నీచుఁడను. నీవు కావు.—అనఁగా రాజు వానినిఁ బోయి ఖడ్గమును తెచ్చికొ మ్మనెను. వాఁ డాగుహాలోనికిఁబోయి ఖడ్గముతోఁ దిరిగి వచ్చెను. రాజుతో నిట్లనెను. చూచితివా? నేను నీచుఁడను కాను. నీవన్నచో నాకు భయములేదు. ఇప్పుడు నన్ను

శిక్షింపుము—అనఁగా రాజు కొంచెము తటపటాయించెను. ఈ సన్నివేశము చిత్రముగా వచ్చినది. స్వప్నములో జరిగినట్లే వచ్చినది. వీఁడు తన్ను వధించునా? ఊరుపేరు లేనివాఁడు మహారణ్య నివాసి యెవఁడో తనతోఁ గత్తియుద్ధము చేసి తన్ను వధించునా? తా నిచటఁ జనిపోయినచో తన రాజ్య మేమి కావలయును? తనకుఁ బురుష సంతానము లేదు. గోముఖుఁడు రాజగును. వాఁడు వేదమతమునకు దూరగుఁడు. వారి వంశములో బౌద్ధమతాభిమానము మొదటినుండియుఁ దీవ్రముగా నున్నది. అందుకనియే మూఁడు తరాలక్రిందటి రాజు తన వంశములోని పిల్లవానినే పెంచుకొనెను. ఈ మూఁడు తరాలనుండి తండ్రినుంచి కొడుకు కొడుకునుండి మనుమఁడుగా వేదమతము పరిత్యజించరాదన్న వాగ్దానముల మీఁద రాజులగుచున్నారు. ఈ గోముఖుఁడు సర్వాంధ్రము బౌద్ధమునందుదింపును.బౌద్ధమతమునకు వచ్చిన సేఁగియేమియు లేదు. మేమువారినివిహారములనునిర్మించుకొననిచ్చుచుంటిమి. వారి విద్యాశాలలు వారికి సాగుచున్నవి. బౌద్ధభిక్షువులను మేము హింసించుటలేదు. బౌద్ధులే రాజులైనచో మావలెఁ జేయరు. మేము రాజులమగుట యెందుల కనఁగా బౌద్ధు లీదేశమునందు వేదమతమును సర్వనాశనము చేయకుండ చూచుటకుమాత్రమే; ఇట్టిస్థితిలో నేను వీనిచేత సంహరింపఁ బడినచో వచ్చెడునష్టము నాకుకాదు; వేదమతమునకు వచ్చును; ఇది గోముఖుని పన్నాగ మనవలయునా? ఆ గోము ఖుఁడు నాకిట్టి స్వప్నము నెట్లు తెప్పింపఁగలఁడు? ఇదియేదో దైవికమైయుండవలయును. లేదా యీపురుషుఁడు పర్వత

గుహాయందు నివసించుచున్నాఁడు. వీఁడు మాయలమారి కావచ్చును. వీఁడే యీస్వప్నమునకు హేతువుకావచ్చును; వీనికి నామీఁద విరోధమెందులకు? వీఁడు వైదికమతమునకు విరోధియా? వీఁడెవఁడు?"—అని రాజు వానితో నీ వెవఁడవు? నేను నిన్ను గౌరవముగా మాటాడలేదనిమాత్రమే నీకు నామీఁదఁ గార్పణ్యమా? మఱి యింకేమైన హేతువున్నదా? అనఁగా నాపురుషుఁ డిట్లనెను; "చూచితివా? నీవు మొదట పెద్ద రాజువలె మాటాడితివి; ఇప్పుడు నీకు చచ్చిపోవుదు నేమోయన్న భయము పుట్టినది; నే నెవ్వఁడ నైన నీకేమి? రాజు:-నీవు గోముఖు నెఱుఁగుదువా? పురు:-నేను సింహముఖుఁడను; గోముఖులతో నాకుఁ బనిలేదు; రాజు:-నీవేమైన యోగివా? పురు:-నేను వట్టి జోగిని; రాజు:-నాకు రాత్రి యొక కలవచ్చినది; పురు:-పలుమందికి పలువిధములైన స్వప్నములు వచ్చును; కొన్ని జరుగును; కొన్ని జరుగవు; రాజు:-రాత్రి నాకువచ్చిన స్వప్నము జరుగునన్నట్లున్నది; పురు:-ఆ స్వప్నమేమో నాకు చెప్పుము; రాజు:-ఓయీ! నీవు ధూర్తుఁడవు; నీతో నింతసేపు మాటాడుటయేతప్పు; రమ్ము నిన్ను సంహరింతును; పురు:-ఓయి రాజా! సంహరింతుననఁగా నర్థమేమి? నన్ను చంపవలయునని నీకున్నదని యర్థము; నీవు నన్ను చంపలేక పోవచ్చును; నేనే నిన్ను చంపవచ్చును; కాని నిన్ను చంపుట నాకిష్టములేదు;—అనఁగా రాజునకుఁ గోపమువచ్చెను; ఓరి మాటవిరుఁడా! ఓరి కిరాతుఁడా! ఓరి చెడిపోయిన క్షత్రియుఁడా! ఓరి యడవిలో పర్వతగుహాలో నివసించు క్రూర

మృగవృత్తీ! నిన్ను సంహరించుటకూడ నొక పెద్దపనియా! అని రాజు వానిమీఁదికి దూకెను. వాఁడు సులభముగా వెనుకకు లంఘించి యిట్లనెను. "రాజా! తొందరపడకుము. నీచేతనైనచో నన్ను సంహరింపుము. అది నీ చేతకాదు. నీ చేతనే కాకపోవుట యనిలేదు. భారత యుద్ధమునాఁడు పాండవులలోని నకులుఁడు మహాఖడ్గవిద్యావేత్తయని ప్రతీతి. అతఁడువచ్చి నాయెదుట నిలచినను నన్నేమియుఁ జేయలేఁడు. ఇంతకు నా పాండవు లదృష్టవంతులు కనుక నేనా నాఁడువారిని తలఁబడలేను. అప్పటికి నాకింత ఖడ్గవిద్యయురాదు. అది యట్లుండుము. నేను నిన్ను వధించను. రమ్మనెను—ఇద్దఱును కత్తియుద్ధమాడిరి. చంద్రశేఖరుఁ డెంతసేపటికి వానిని వధించవలయునని తీవ్రముగాఁ బోరుచుండెను. అతఁడు నవ్వుచు రాజుయొక్క ఖడ్గాఘాతముల నన్నింటికి నొడ్డు కొనుచు వానినిఁ దొలఁగఁద్రోయుచు నపగత శ్రముఁడై యుద్ధమాడుచుండెను. చాలసేపటికి రా జలసిపోయెను. ఈ దెబ్బతో నీపని పూర్తియని రాజు వానిపైకి లంఘించెను. అది యాంధ్రరాజవంశమునందలి యొక రహస్యమైన మహా ప్రయోగముతోఁగూడిన లంఘనచాతుర్య సహితమైన యొక ఖడ్గాఘాతము. దానిముందు శత్రువులు నిలువనేలేరు అట్టి ఖడ్గాఘాతమును పురుషుఁడు బెట్టిదముగానైన నేమి, తొలఁ గించుకొనెను. అట్లు తొలఁగించుకొనుటలో నాతఁ డింకొక ప్రయోగము చేసి రాజుచేతిలోని ఖడ్గమును దూరముగా విసరి వేయుటయు, రాజు నేలఁబడిపోవుటయు, నతనిఱొమ్ముమీఁద నీ పురుషుఁడు నిలఁబడుటయు, నతనిచేతిలోని ఖడ్గము రాజు

కు స్తకమీఁద నొక్కఁబడియుండుటయు జరిగెను. రాజేమి చేయును? ఆ పురుషుఁ డిట్లనెను. ఓయి, రాజా! నిన్ను నేను వధించను. నేను చెప్పినమాటకు నీ వంగీకరించినచో నేను నిన్ను వధించను. లేనిచో నిస్సంశయముగా వధింతును. నేను పరదేశపు రాజకుమారుఁడను. నన్ను నా తలితండ్రులు వెడలఁగొట్టిరి. నేను దుశ్శీలుఁడను. ఏదో యొక రాజవంశమున నేను నాకత్తితో బతుకనెంచితిని. చాల రాజవంశములనుఁ బరీక్షించితిని. కాని యవి నా పరీక్షకు నిలువలేదు. నీ యాంధ్రరాజ్యముమీఁద నాచూపు పడినది నా ఖడ్గవిద్యానైపుణ్యమును చూచితివికదా! నాయంతటి ఖడ్గవిద్యావేత్త సృష్టిలో నుండఁడు. నే నీవిద్యయంతయు నీ యాంధ్రరాజ్యమునందు వినియోగపఱచఁ దలఁచితిని. మీ దేశములో నీవిద్య నందఱకు నేర్పుదును. మీ రాజకుమారులందఱు నాయంత ఖడ్గవిద్యావేత్తలు కావలయును. నాకొక యూహయున్నది. భారతయుద్ధమునాఁడు హస్తినాపుర సామ్రాజ్యముకలదు. మకుటాధిపతులు కౌరవులు భారతయుద్ధము జరిగినతరువాతఁ గొన్నాళ్ళ కీసామ్రాజ్యాధిపత్యము మాగధులకుఁ జేరినది. ఆ మాగధులలోఁగూడ సమర్థుఁడైనవాఁడు వచ్చినపుడు సామ్రాజ్యాధిపత్యము వహించుటయుఁ దక్కినపుడు చిన్న చిన్న రాజులు స్వాతంత్ర్యమవలంబించుటయుగా నున్నది. ఎట్లైనను మగధరాజ్యము యొక్క యాధిక్యము గడచిన రెండువేల మూఁడువందల యేండ్లుగా మాసిపోలేదు. చినుగుపట్టలేదు. ఎల్లపుడు నౌత్తరాహులే భారతదేశ చక్రవర్తులగుచుండిరి. దాక్షిణా

త్యులకు నట్టి యోగ్యత పూర్వ మెప్పుడును పట్టలేదు. నే నాలోచించఁగా నాలోచించఁగా మీ యాంధ్రజాతి లక్షణములును స్వభావమునుఁ బరిశీలింపఁగా మీరు సర్వ భారత దేశ చక్రవర్తిత్వము పొందుటకు యోగ్యమైనవారని నాకుఁ దోఁచినది. ఈ భారత సామ్రాజ్యము మీ యాంధ్రు లేల వలయును. ఏలుటకు మీరు ధనుర్విద్యా నిపుణులు కావల యును. ఖడ్గవిద్యానిపుణులు కావలయును. మీ యాంధ్రుల యొక్క ధనుర్విద్యా పాండిత్యము జగద్విదితమైన దేకదా. తుములయుద్ధము వచ్చినపుడు మీరు వెనుకఁబడిపోవుచుండిరి. అందుచేత మీ జాతిని నేను ఖడ్గవిద్యా నిపుణమునుఁ జేయుదును. మీరు చక్రవర్తు లగుదురు. నేను నిన్నిప్పుడు వదలిపెట్టెదను. నీవు పోయి నీ సైన్యముతోఁ గలిసికొనుము. నేను కొన్నాళ్లకు ధాన్యకటకమునకు వత్తును. నీవు నన్ను నీ రాజ్యములో ఖడ్గవిద్యా గురువుగాఁ జేయువలయును. ఆ వాగ్దానము చేసినచో నిన్ను వదలిపెట్టెదను" అనఁగా రాజు నేల మీఁద నట్టి దుస్స్థితిలో నుండియుఁ నిట్లాలోచించెను. వీనికి మా యాంధ్రులమీఁద నింతయభిమాన మెందుకు? అనుకొని యిట్లనెను. "సరే, నామీఁదినుండి నీవు లెమ్ము. నాచేతిలోఁ గత్తిలేదుకదా. నీవు చంపవాయెను. నీ విద్యా నైపుణ్యా మునకు నన్ను చంపుట మిక్కిలి సులభమైన పనికదా. నీకు వాగ్దానము చేయకముందు నీతో నేను సావకాశముగా మాటాడవలయునుగదా!"—అనఁగా పురుషుఁడు రాజును వదలి దూరముగాఁ బోయెను. ఇద్దఱును సన్నిహితములైన రెండు శిలలమీఁదఁ గూర్చుండిరి. ఆ పురుషుని చేతిలో

ఖడ్గ మట్లే యున్నది. రాజుయొక్క ఖడ్గము నతఁడు దూర ముగా నున్నదానినిఁ దెచ్చి రాజుచేతి కిచ్చెను. ఇట్లనెను "నేను నిన్ను వదలిపెట్టితిని. మన మాటలయొక్క ఫలిత ముగా నిన్ను నేను వధింపవలసి వచ్చినచో నిరాయుధుని నిన్ను నేను వధించను. కనుక మాటాడుము. ఏమి మాటాడఁ దలఁచితివో మాటాడుము." రాజు:- ఓయీ! నా సైనికులు నన్ను వెదకుచు వత్తురు. అప్పుడు నీవు నన్నేమి చేయఁ గలుగుదువు? పురు:-వారికీ స్థలము తెలియదు. ఇచ్చటికి నీవు వచ్చితివని యనుకొనుటకే వీలులేదు. ఇదియట్టి గహ్వరమైన ప్రదేశము. రాజు:- నా గుఱ్ఱమును కొంతదూరాన వదలిపెట్టి వచ్చితిని. నా సైనికులకది కనిపించినచో వారు రావచ్చును. పురు:-అట్లేకానిమ్ము. నీ వనుకొన్నట్లు వారు వచ్చినచో నీవు నన్ను బంధించుము. శిక్షించుము. నీవు మాటాడుట పూర్తియైన తరువాత మనము యుద్ధమాడవలసివచ్చి వారు రాక ముందే నీవు నాకు వాగ్దానము చేయుటయో నేను నిన్ను వధించుటయో జరిగినచో వారువచ్చి చేయునదేమియు లేదు. నిన్ను చంపి నాదారిని నేను పోయెదను. కనుక నంతయు కాలముమీఁద నాధారపడియున్నది. ఆకాలము నీ కను కూలమో నా ననుకూలమో తెలియదు. నా కనుకూలమని నే ననుకొనుచుంటిని. నే ననుకొనుటకు వంద హేతువులున్నవి. నీ వనుకొనుటకు హేతువులులేవు. నీది వట్టి యాశ, నాది తర్క్యమై తర్కితమై సిద్ధాంతింపఁబడిన విషయము. మీ యాంధ్రులు భారతదేశ చక్రవర్తులగుట సిద్ధమైన విషయము. అది జరుగక తప్పదు. నాకుఁ దెలియును. అందుచేత నేను

తదభిముఖముగాఁ బ్రవర్తించుచున్నాను. రాజు:- ఓయీ! మా యాంధ్రజాతిమీఁద నీ కెందు కింత యభిమానము? మా యాంధ్రులయందున్న సుగుణములు నిన్నాకర్షించినవేవి? అది తెలిసికొనవలయునని యున్నది. పురు:- అవి సుగుణము లని నేను చెప్పను. భారతదేశమున నితర జాతులలో లేని యొక లక్షణము మీయం దున్నది. మీజాతి వివక్షలేనిజాతి. దేనివెంటఁబడిన దానివెంట పోయెడు జాతి. సృష్టిలో సర్వ మైన వివేకము మీ జాతియందున్నది. సర్వమైన యవివేక మును మీ జాతియందే యున్నది. మఱియొకజాతి యైనచో వివేకమైనది. లేనిచో నవివేకమైనది. అదియో యిదియో యేజాతిలోనైన నెక్కువపాళ్లుగా నుండును. మీ జాతిలో రెండును సరిసమానముగా నుండును. మీ జాతిలో నింకొక లక్షణమున్నది. ఇంతటి వివేకము కలిగి మీ యవివేకము మీ వివేకమును భాసించనీయదు. ఇది మీలోనున్న విశిష్టత. అందుచేత మీ జాతియందు నా కభిమానము. రాజు:- దీని వలన నీ కేమి ప్రయోజనము? పురు:- నేనొక కాలాకృతిని. అవివేకమును భాసింపఁజేయుటయే నాకు పరమమైన ఇష్టము. మీ జాతిద్వారా దానిని భారతదేశమునం దంతటను వ్యాపింపఁజేయవలయునని నా యుద్దేశ్యము. రాజు:-ఓయీ! వివేకము వేదమతము నాశ్రయించియుండును. అవివేకము తదితరమతముల నాశ్రయించియుండును. పురు:- ఇతర మత ములలో వివేకమే లేదందువా? రాజు:- ఓయీ! వివేకము రెండువిధములు. ఒకటి జాతిసంబంధమైనది; ధర్మసంబంధ మైనది. రెండవది వ్యక్తిసంబంధమైనది. అధర్మ సంబంధ

మైనది. తెలివితేట లున్నవనుకొమ్ము; ఆలోచన యున్నదనుకొమ్ము; ఆలోచన సద్విషయము నందునుఁ జేయవచ్చును. అసద్విషయమునందునుఁ జేయవచ్చును. రెండు నాలోచనలే; రెంటియందును తీవ్రత యుండును. సూక్ష్మత యుండును. కాని సద్విషయమునందు జరిగెడి తీవ్రాలోచన లోకమునకు క్షేమంకరముగా నుండును. అసద్విషయమునందు చేయఁబడెడు నాలోచనలుకూడ కొన్ని లోకక్షేమమునకు హేతువులుగాఁ గనిపించవచ్చును. కాని కావు. ఇది యొక యగాధమైన విషయము. పురు:- నీవి ట్లనుకొందువు. మే మింకొక విధముగా ననుకొందుము. రాజు:-అందుకనియే భగవంతుఁ డున్నాఁడందుము. వాని కెప్పుడేది యిష్టమో, అట్లు జరుగును. పురు:- మీ భగవంతుఁడు అధర్మమునుఁ గూడ సాగనిచ్చునా? రాజు:- మీ భగవంతుఁ డనుచున్నావు. నీవు నాస్తికుఁడవా? పురు:- నా ప్రశ్నకు సమాధానము చెప్పుము. రాజు:- అధర్మమును సాగనిచ్చును. కాని కూర్తిగ సాగనీయఁడు. సంపూర్ణముగా ధర్మము నశించిపోయిన దనునంతవఱకు సాగనిచ్చును. అప్పుడు కాని దానిని నాశనము చేయఁడు. పురు:- కానిమ్ము. నాకు వాగ్దాన మిచ్చెదవా? రాజు:- ఇత్తును కాని నేను రాజును గదా! నీ యాటలేమి సాగును? పురు:- ఆసంగతి నీకెందుకు? అది యెట్లుసాగునో ఎప్పుడు సాగునో నాకుఁ దెలియును. రాజు:- నీవు ధాన్యకటకమున కెప్పుడువత్తువు? పురు:— కొన్నాళ్ళు పోయిన తరువాత వత్తును. రాజు:- నా వాగ్దానమును నేను పాలించకపోయినచో నేమి చేయుదువు? పురు:-

ఓయి రాజా! నీవు పాలింతువు, నాకుఁ దెలియును. నీవు నైదికుఁడవు. అందుచేత పాలింతువు.—రాజు - నవ్వి సరే! నీ యిష్టమువచ్చినపుడు రమ్ము. ఆ భవిష్యత్తు నాకుఁ దెలియదు. నీవు నాకంటెఁ దెలిసినవాఁడవు. నీవు నాకంటె వయస్సుకలవాఁడవు. అయినను నీకింత కాలజ్ఞాన మెట్లు కుదిరెనో నాకుఁ దెలియుటలేదు. నేను చనిపోవుటకు నేను భయపడలేదు. కావలసినచో మఱల యుద్ధమాడుదము, రమ్ము. నీవో నేనో. నిన్ను చంపగలుగుదునన్న ధైర్యము నాకులేదు. జయము దైవాధీనము. ఆదైవము నీయందే యున్నట్లున్నది. ఎందుకనఁగా నింత ప్రొద్దు క్రుంకికూడ నా సైన్యములు నన్ను వెదకికొనుచు రాలేదు. నీవే గెలిచితివి. పురు:— రాజా! ఇంకొక వాగ్దానమిమ్ము. నేను మీ రాజ్యములోఁ గొంత యథేచ్ఛముగఁ బ్రవర్తింతును. నన్ను శిక్షించుటకు మీ రాజపురుషులు నిన్ను ప్రోత్సహింతురు. నీవు నన్ను శిక్షించరాదు. నేను నీకు ప్రాణదాతనుకదా! మీధర్మములోఁ బ్రాణదాత యెట్టి విపరీతములు చేసినను వానిని మన్నింతురు. రాజు:- ఓయీ! కాని నీ వదేపనిగా దుర్వృత్తి నవలంబించినచో రాజైనవాఁడు శిక్షించకుండుట యెట్లు? పురు:— అంతగా వాఁడు మితిమీఱినచో వానిని దేశమునుండి బహిష్కరించవచ్చును. ప్రాణదాతను చంపరు. మఱియు నా దుర్వృత్తి మితిమీఱిపోదు. ఏదైన నొకానొక విషయమున నాచేసిన పని కొందఱకు రుచింపకపోవచ్చును. అప్పుడు మీ బంధువులు నిన్ను బలవంతము చేయుదురు. అందుకని చెప్పుచున్నాను. రాజు:-

అన్లే. అంత మితిమీఱినచో నిన్ను దేశమునుండి బహిష్క రింతును. నిన్ను వధించను. పురు;- మహారాజా! మీ రింక వెళ్ళవచ్చును. మీ కీదారి తెలియదు. ప్రాగ్దుర్గమంకి నది. ఇది వెన్నెలరాత్రి యగుట మీకుఁ గొంతలాభము. మనము వచ్చినత్రోవ మిక్కిలిగడ్డైనది. నా పశ్చాద్భాగము నుండి పర్వతావరోహణము సులభము. కొండ దిగినంతనే మీ గుఱ్ఱము కనిపించును. ఈకొండ కప్రదక్షిణముగాఁ బోయినచో పెద్దవాగు తగులును. అచ్చట నొక మహావట వృక్షమున్నది. ఆ వటవృక్షము ప్రక్కగా నొక కాలిబాట కనిపించును. అది నీ సైన్యముయొక్క స్థావరమువద్దకుఁ బోవును. — అని యాపురుషుఁడు తాను తనగుహలోనికిఁ బ్రవేశించెను. రాజున కంతయు నాశ్చర్యముగా నుండెను.

ఏది యెట్లైననేమి ? ఆ పురుషుఁడు ధాన్యకటకములోఁ బ్రవేశించుటయు, అచటఁ బదేండ్లుండుటయు రాజకుమారు లందఱకు ఖడ్గవిద్యా గురువగుటయు నతనినిఁగూర్చి వృద్ధ రాజ వంశీయులు జుగుప్సవహించుటయు జరుగుచుండఁగా గోముఖశాతకర్ణి యా పురుషుని మిక్కిలి దగ్గఱకు తీసెను. గోముఖశాతకర్ణికిని చంద్రశేఖరునకును మనసులోసౌహార్దము లేదు. రాజన్నచో గోముఖునకు మాత్సర్యము కలదు. కల దని రాజునకుఁ దెలియును. అంతమాత్రాన నతనిని రా జేమియుఁ జేయలేను. ఈ వచ్చిన నూత్నపురుషుఁడు గోముఖ శాతకర్ణియింటిలోననే యుండును. రాజతనికిఁ బ్రత్యేక ముగా నేర్పాటుచేసిన గృహములో నుండుట తక్కువ.

గోముఖుని యింటిలోనుండుట యెక్కువ. ఈ పురుషుఁడా గోముఖుని యింటిలో బాగుగాఁ బరిచయము సంపాదించు వేళకు గోముఖుని కుమారుఁడైన శ్రీముఖునకుఁ బండ్రెండు పదుమూఁడేండ్లు. నాఁటినుండి శ్రీముఖుఁడు వాని యదుపులో వాని దక్షతతోఁ బెరుగుచుండెను. గోముఖుఁడు బౌద్ధమతాభిమానియైనను వేదమతమునకు వ్యతిరేకి కాఁడు; రాజ్యములోఁ బ్రధానముగా వేదమతము గౌరవింపఁబడుట చేత గోముఖుఁడే యెండ కాగొడుగు పట్టుచున్నాఁడని యనెడివారు కలరు; కాని యీ పురుషుని శిక్షణలో శ్రీముఖుఁడుమాత్రము సంపూర్ణముగా వేదదూషకుఁడయ్యెను; బహిరంగముగా బౌద్ధమతమునుఁగూర్చి ప్రశంసించును; శ్రీముఖునకు పదునెనిమిదేండ్లు వచ్చినవి; అతనియంతటి ఖడ్గవిద్యానిపుఁడా రాజ్యములోలేఁడు; ఆ రాజ్యములో నతనిని గురువును మించినవాఁడని చెప్పుదురు. ఇంకను తద్గురువుయొక్క విద్య యెట్టిదో యెవ్వరికినిఁ దెలియదు. వాని విద్యారహస్య మెఱిఁగినవా రా రాజ్యములో నిద్దఱే చంద్రశేఖరశాతకర్ణియు, శ్రీముఖశాతకర్ణియును. శ్రీముఖుఁడు వాని ఖడ్గవిద్యనుఁ బ్రశంసింపఁగాఁ బలుబంది లోలోన నవ్వుకొందురు. పైకి నవ్వుటకు వీలులేదు. ఎందుకనఁగా ప్రత్యక్షముగాఁ జేతిలోఁ గత్తి యున్నదిగదా! శ్రీముఖుఁడున్నాఁడు. అందుచేత మానవజాతి విచిత్రమైనది. మంచిని, చెడ్డను రెంటిని నిందించును. ప్రత్యక్షమైనదానినిఁ గూడ నిరాకరించును. ఆనిరాకరణము చమత్కారముగా నుండును. ఒప్పికొందురు. ఒప్పికొనరు. ఒప్పికోనితనము లోలోపల.

ఒప్పికొనెడితనము బయట. ఇది ప్రత్యక్ష విషయముల యందలి సంగతి. అప్రత్యక్ష విషయములలో నొప్పికొననే యొప్పికొనను. వాఁడు లక్షాధికారి. ఏడ్చినాఁడులే యందురు. కాని లక్ష రూపాయలు కనిపించుచున్నవిగదా? అచట నా యాటలు సాగవు. అప్రత్యక్షవిషయమున సంపూర్ణముగా సాగును. ఈ ప్రత్యక్షములమధ్య నింకొక విషయమున్నది. ప్రత్యక్షము ధనమును లోకమును. అప్రత్యక్షమును భగవంతుఁడును పరలోకములును. ఈ రెంటినడుమ సుకుమార విద్యలు కలవు. సంగీతము, సాహిత్యము, శిల్పము, నాట్యము మొదలైనవి. మానవునియొక్క పారిహాస్యము భవంచన వానియందు ఫలించినట్లు ప్రత్యక్షా ప్రత్యక్షములయందు ఫలించవు. ఈ లోకము దాని యిష్టము వచ్చినట్లు వాని యందు ప్రవర్తించును. ఆనాఁటికొక మహారాజుండి తద్విద్యా పారంగతునియందు నభిమానమును ప్రకటించినచో నావిద్యలు భాసించవలయునేకాని లేనిచో లోకము భాసించ నీయదు. ప్రతిమానవునియందు వాఁడెంత యాస్తికుఁడైననుఁ గొంత నాస్తికత యుండనే యుండును. ఆ నాస్తికత యీ విద్యా విషయమునందుఁ బ్రవర్తించును. ఇంక నీ గురువు కంటె నఖండ ఖడ్గవిద్యావేత్త లేఁడనెడు రెండవవాఁడు చంద్రశేఖర శాతకర్ణి. ఆయనకూడ నితనినిఁగూర్చి గొప్పగాఁ జెప్పను. మీ కెట్లు తెలియునని యడిగెడువాఁడు రాజు విషయములో నుండఁడుగదా! అంత చనవుకలవాఁ డెవ్వఁడైన నడిగినచో నాయన ఇట్లు సమాధానము చెప్పును. "అతనిచేత శిక్షింపఁబడెడు వారిని చూచుచున్నాముకదా. వారి విద్య

చాల గొప్పది. అందుచేత వారి గురువుకూడ నఖండుఁడు కావలయును.” అప్పుడు కొందఱు వానివిద్య తరువాతఁగదా తెలిసినది. తొలుత మీరతనిని విద్యాగురువుగా నియమించు నపుడు తమకీసంగతి యెట్లు తెలియును? అనఁగా రాజిట్లనెను. “ఏదో వచ్చినాఁడు, ఉద్యోగము నడిగినాఁడు. చిన్న పిల్లల కైననుఁ జెప్పఁగలఁడుకదా యని యుద్యోగ మిచ్చితిమి. తరువాత నతఁ డింతవాఁడని తెలిసినది” అనును. ఇట్లుండఁగా శ్రీముఖుఁడు తన ఖడ్గవిద్యా నైపుణ్యముచేత రాజ్యములోని సర్వ శూరులను గెలుచుటయు రాజునందు నిరాదరణము వహించుటయు పరోక్షముగాఁ దిరస్కరించుచున్నాఁడని నిందించుచున్నాఁడని వినఁబడుటయు జరుగుచుండెను. ఎన్నోసార్లు రాజున కతనిమీఁద నిందారోపణలు చేయఁ బడెను. రాజతనిని శిక్షించలేదు. శిక్షించినచో గోముఖుని మీఁదఁ గోపము కలదు. అతని కుమారుని శిక్షించెనని యందురని యొక భయము. మఱియు రాజవంశములో నొక ప్రసిద్ధుఁ డైనవాని కుటుంబమునందు రాజునకుఁ గోప మున్నను దానికిఁ బ్రాకట్యము నెఱపినచో రాజవంశమునం దొక యలజడి పుట్టునని యాయన భావించెను. ఇట్లుండఁగా నీనూత్నపురుషుఁడువచ్చి ఎనిమిదేండ్లకుఁ బైననైనది. రాజున కిప్పటికిని సంతానములేదు. అతనితోఁ బర్వతాగ్రమున యుద్ధము చేయునాఁటికే రాజు నలువదియువ పడిలోనుండెను. ఇప్పు డేఁబదియవపడి సాగుచున్నది. అతనికి సంతానము లేదు. తన ముత్తాతను పెంచికొన్న యాంధ్ర రాజువలెఁ దానుకూడ నెవనినైన దత్తత తెచ్చికొనవలయునా యన్న

సందేహము రాజునకుఁ గలదు. దత్తత యనినవెంటనే తొలుతటి యిబ్బంది యిప్పుడును కలుగును. తన కుటుంబములోని యొక పిల్లవానిని తాను తెచ్చి పెంపకము చేసికొన్నచో మరల నా గోముఖుని వ్యవహార మట్లే యుండును. వాని కొడుకు మహాశూరుఁడు. తీవ్రప్రకృతి కలవాఁడు. దేశము లోని, రాజ్యములోని, రాజధానిలోని పలుమంది ఖడ్గవిద్యా నిపుణులైనవారికి శ్రీముఖుఁడన్నచో గౌరవము, మమ కారము. పరిస్థితులన్నియు శ్రీముఖుని రాజును చేయవలయు నన్నట్లున్నవి. కాని రాజు పక్షమునందు నొక్క విషయమే బలవత్తరముగా నున్నది. గోముఖునకు శ్రీముఖుఁ డొక్కఁడే కుమారుఁడు. అతనిని గోముఖుఁడు దత్తత యీయఁడు. పదునెనిమిదేండ్ల పిల్లవానిని దత్తత తెచ్చి కొనుట కూడ లోకమునందు లేదు. ఇది యొక్కటియే రాజున కనుకూలముగా నున్నది. ఆ శ్రీముఖుఁడు రాజున కెదురు తిరుగవచ్చును. రాజధానిలో నంతర్యుద్ధము జరుగ వచ్చును. ఆ విషయములో రాజునకు భయమేలేదు. ఆంధ్ర సేనలోనున్న ధానుష్కులు చండప్రచండులు. ఒకవేళ నట్టి యెత్తుగడ గోముఖ శ్రీముఖులు చేసినను ఫలించుటకు వీలు లేదు. ఆంధ్రరాజ దుర్గములోనున్న సర్వ సైన్యము రాజు నకు వశంవదమై యున్నది. రాజవంశీయులు పలుమంది దుర్గ బహిర్నగరమునందే యున్నారు. అట్టి విప్లవము జరిగినచో కోటను ముట్టడి వేయవలయును. కోట గోడల మీఁదినుండి ధానుష్కులీ ఖడ్గవిద్యావేత్తలను చించి చెండా

డుదురు. ఎదురుబడి యుద్ధముచేయుటవఱకు రానేరాదు. అప్పుడుగదా శ్రీముఖుఁడు తన స్నేహితులతో తన సామర్థ్యము నెఱపుటకు వీలు. ఈ రహస్య ముభయపక్షము లకును దెలియును. అందుచేతఁ దాత్కాలికమైన యొత్తిడి రాజ్యమునందు లేదు. శ్రీముఖుఁడు మఱియుఁ దెగించి మాటాడినచో మర్యాద నుల్లంఘించి ప్రవర్తించినచో రాజ వానిని వాని తండ్రిని దేశమునుండి వెడల నడవవచ్చును.

ఇట్లుండఁగా ధాన్యకటకమున నొకరాజవంశముకలదు. అనఁగా వారు రాజవంశీయులు. ఏతరములోవారు రాజు సోదరులో తెలియదు. అతనిపేరు నీలాంబరశాతకర్ణి. అతని కొక్క కూతురు కలదు. ఆమెపేరు జయద్రథి. ఆమెకు నాఁటికి పదునెనిమిదేండ్లు. శ్రీముఖుఁడు నామెయు నొక్క దినమునందే జనన మందిరి. ఆమెను ప్రసవించి యామె తల్లి మరణించెను. నీలాంబరుఁడు మఱల వివాహమాడలేదు. ఆడుట కెవ్వరును పిల్ల నీయలేదు. అతఁడును వాని కూతు రును పరంపరగా వచ్చుచున్న యొక యింటిలో నివసింతురు. ఆమె పెద్ద యందకత్తె కాదు. ఆమెకు వివాహము చేయు టకు నీలాంబరుఁ డెంత ప్రయత్నించినను సాధ్యము కాలేదు. నీలాంబరునకు నీ నూత్నపురుషుఁ డన్నచో నెంతయో గౌరవము. అతని ఖడ్గవిద్యయం దెంతో యభిమానము. అతఁ డితనిని కడచిన మూఁడేండ్లుగాఁ దన యింటికిఁ దీసికొని పోవుటయు, నతనికి జయద్రథికి మిక్కిలి పరిచయ మేర్పడు

టయు నామె క్షత్రియ స్త్రీ కనుక ఖడ్గవిద్యయందుఁ దా నభిమానము చూపుటయు, ఆమె కితఁడు గొంత ఖడ్గవిద్య నేర్పుటయు, ఆ నేర్పుటలో నతనియం దామెకుఁ గొంత ప్రేమ కలుగుటయు, ఆ ప్రేమ కొంతదవ్వు సాగుటయు, మర్యాద గల కుటుంబములోని తండ్రిమేర మీఱిపోవుచున్నదని యాపవలసిన పరిస్థితి వారి నడుమఁ బరిహరించవలసిన యవసరము కలిగినప్పుడుకూడ నీలాంబరుఁ డూరకుండుటయు, వారి చెలిమి ముదిరి కొంత విపరీతమార్గమునుఁ బట్టెను. వారిద్దఱి నడుమ ప్రేమ యేర్పడెను. ఆమె వానినిఁ దన్ను పెండ్లాడుమనెను. అతఁడు నిరాకరించెను. అప్పుడామె గర్భవతి. ఆమె స్థితి యేమికావలయునో తెలియలేదు. ఆమె మగసంతానమును కనెను. ధాన్యకటకమంతయుఁ బ్రాకిపోయినది. వారిని వెలివేసిరి. ఆమె కేమిచేయవలయునో తెలియలేదు. ఇద్దఱును భార్యాభర్తలవలెనే యుండుచుండిరి. ఆతనియందామెకు మహానురాగము కలిగించిన కొన్ని విషయములలో నొకటి యేమనఁగా నతఁడామెతోఁ దనపేరు జయద్రథుఁడని చెప్పెను. ఆ ధాన్యకటకమున వాని పేరు జయద్రథుఁడని తెలిసినవారిద్దఱే. అతని భార్యయైన యీ నీలాంబరుని కుమార్తెయు, శ్రీముఖశాతకర్ణియును. తనపేరిదియని వారిద్దఱు నెవ్వరితోఁ జెప్పరాదు. వారిచేతఁ బరమములైన ప్రమాణములు చేయించుకొనెను. అతఁడు తనపేరెందుకని దాచుకొనుచుండెనో యెవ్వరికినిఁ దెలియదు నీలాంబరుఁడు తన కూఁతునుఁ బెండ్లాడుమని వాని నెంతయో బతిమాలెను.

రాజుతో చెప్పి శిక్షింప చేయుదు ననెను. అతఁ డంగీకరించ లేదు. చివరకు రాజవంశమున కీ వ్యవహారము బరువై పోయెను. రాజునకు దినదినము వానిని శిక్షించక తప్పనంత యొత్తిడి కలుగుచుండెను. రాజప్పుడు వానికి వార్త నంపి నిన్ను బహిష్కరించుచున్నానను. నీవు దేశమునుండి వెడలి పొమ్మనెను. అతఁడు భార్యను పుత్రునికూడ వదలి వెడలి పోయెను. తన గురువును వెడల నడిచెనని శ్రీముఖుఁడు రాజధానిలో నొక విప్లవమును లేవఁదీసెను. రాజా విప్లవము నణఁచి శ్రీముఖునిఁగూడ దేశమునుండి బహిష్కరించెను.

జయద్రథుని కొడుకున కిప్పు డిరువదియేండ్లు. అతఁడు తండ్రిని వెదకుచు దేశ దేశములు తిరిగెను. చివరకు మగధ రాజ్యపు టడవులలో నున్నాఁడని తెలిసి మగధదేశమునకుఁ బోయెను. అచ్చట వానికిఁ దోహారుతోఁ బరిచయ మయ్యెను. ఇద్దఱును బలిమరముచుట్టుఁ దిరుగుచుండిరి. ఆ చెఱువు వద్దకుఁ బోవుచుండిరి. అంతకు మించి వారి కేమియుఁ దెలియదు. వాఁడును తన పేరు జయద్రథుఁడనియేఁ చెప్పెను.

౫

మానవ లోకమునకు నాత్మానుసంధాన మెంత తక్కువో బహిరనుసంధాన మంత యెక్కువ. అంతర్వివేక మెంత తక్కువో బహిర్వివేక మంత యెక్కువ. ఆత్మ విషయ పరిశీలన మెంత తక్కువో పరవిషయ పరిశీలన మంతయెక్కువ. లోకమనఁగా వీఁడని చెప్పలేము. ఆ తెలివి యెచ్చటపుట్టునో యెందుకు పుట్టునో తెలియదు. ఆ వార్త లోకమునందు వ్యాపించిపోవును. ఎంత పరమ రహస్యమైన విషయమైన నిసుమంతలో వీధి కెక్కును. అది యెట్లు పుట్టునో, యెట్లు వ్యాపించునో తెలియదు. శ్రీముఖశాతకర్ణియొక్క జాతకము చక్రవర్తి జాతకమని, అతఁడు మగధరాజ్య సింహాసనాసీనుఁ డగునని, వచ్చినయీ నూత్నపురుషుఁడు తత్ప్రయత్నముమీఁద వచ్చినాఁడని, చంద్రశేఖరుఁడును జయద్రథుఁడును పర్వతము మీఁద యుద్ధము చేసిరని మొదలైన సర్వ విషయములు జయద్రథుఁడు వెళ్ళిన కొలఁది దినములలో ధాన్యకటకమున వార్తలుగా వ్యాపించెను. రూఢములయ్యెను. ఇది జరిగి యిరువదియేండ్లు గడచినవి. మఱికొంత తక్కువ గడచినవి. శ్రీముఖశాతకర్ణి మగధసేనలో చేరుటయు క్రమక్రమముగా వృద్ధిబొందుటయు నేఁడతఁడే ప్రధానమంత్రియు మహాసేనాధిపతియు నగుటయు నానాఁడు పుట్టిన వార్తలకు క్రమక్రమముగా ప్రోద్బలకములై ధాన్యకటకమునందలి రాజవంశీయుల దృష్టి మగధముల వైపునకు మఱలినది. ఆంధ్రులు

మగధముల నాక్రమింతురని శ్రీముఖుఁడు చక్రవర్తి యగునని ఆంధ్రుల యదృష్టము పండెనని యందఱును పెందలకడ మేల్కొనవలయునని సర్వజనులయం దొక జాగ్రత్త లేకె త్తెను. వేలకొలఁది యాంధ్రులు మగధదేశమునకుఁ బోయి మగధ సైన్యములయందు చేరిరి. ఆనాఁడు మగధ సైన్యములో సగానికి సగమాంధ్రసైన్యము. రాజవంశీయులు సామాన్య పౌరులు గూటికి లేనివారు మహా పదవులను వాంఛించినవారు నైన సహస్రములుగా నాంధ్రులు మగధ రాజ్య సేనలయందు భటులుగా ప్రవేశించిరి. ఇది యొక చమత్కారము. 'ఏకా క్రియా ద్వ్యర్థకరీబభూవ' అన్నట్లుగా శ్రీముఖుఁడు వారి నందఱను సైన్యములోఁ జేర్చికొనెను. వారివలన శ్రీముఖునకు బలము సంప్రాప్తించెను. అవసరము వచ్చినచో నీ యాంధ్ర సైన్యముతో శ్రీముఖుఁడు మగధ ముల నాక్రమించఁగలఁడు. కాని, యంత యవసరమే లేదు. రాజు గంగిగోవు. వాని నేమియుఁ జేయనక్కఱలేదు. ఒక వేళ రాజుయొక్క యనంతరమున మాగధు లెవరైన శ్రీముఖుఁడు రాజ్యము నాక్రమించుట కభ్యంతర పెట్టినచో నతఁడు తన యాంధ్ర సైనికులతో సులభముగా రాజ్యము నాక్రమించఁగలఁడు. ఇది సామాన్య జనుల పరిస్థితి. ఆంధ్ర ముల నుండియు మగధములవఱకు నాంధ్రులు ప్రవాహముగా నటునిటు తిరుగుచుండిరి. ఈ తిరుగుటలో నడుమనున్న రాజ్యములు ఆంధ్రులకు నసివారుగా నేగునట్టి బయలైనవి. ఈ ఆంధ్రుల పరాక్రమముగుండు నడిమిరాజ్యము లుండియు లేనట్లే యైపోయినవి. ఒకటి లౌకికమైన మానవ సహజమైన

యాశ. రెండవది శ్రీముఖుఁడు చక్రవర్తి యగునన్న యొక దైవజ్ఞ విషయమైన నిబ్బరము. దీనితో నాంధ్రులు గిరివ్రజము వఱకుఁ బోవుచుండఁగా నడుమనున్న పుండ్రములు, కళింగములు, ఓఢ్రములు, నుత్తరకోసలములు త్రిపురవంగములు యాతాయాతులైన యాంధ్రసైనికుల నడ్డుపెట్ట లేకుండిరి. అడ్డుపెట్టలేకపోవుటతోనే ధాన్యకటకము మొదలు గిరివ్రజపురము వఱకుఁగల దేశములు ననాక్రాంతములయ్యును సమాక్రాంతములవలె భాసించుచుండెను. పోను పోను నడుమనున్న దేశముల రాజులకును, జంద్రశేఖరునకును నొక సందేహము ప్రబలముగా నుండెను. శ్రీముఖుఁడు రాజగుటయే యాలస్యము. ధాన్యకటకాంతము సర్వదేశము శ్రీముఖుని యొక్క యధికారముక్రింద నుండిపోయెడిదే. ఆ చంద్రశేఖరున కింతవఱకు సంతానము లేదు. శ్రీముఖుఁడు మగధరాజ్యముల నింతవఱకు నాక్రమించలేదన్న మాటయేగాని వాని యధికారమే మగధములయందు నిండియున్నది. అతఁడు మగధముల నాక్రమించిన వెంటనే యాంధ్రముల నాక్రమించుట నిస్సంశయమైన విషయము ఆంధ్ర సైన్యములోనున్న మేలైన దుముదారులు చమూపతులు పూర్వమే మగధసేనలో పోయి చేరిరి. ఆంధ్రసైన్య మిప్పుడు బలహీనముగా నున్నదని చెప్పవచ్చును. శ్రీముఖుఁడు దండెత్తి రానక్కఱలేదు. దండెత్తి రాకుండఁగనే సర్వాంధ్రము వానికి వశమైనట్లుండెను. ఇది బాహిరమైన పరిస్థితి. ధాన్యకటకమునందలి రాజవంశీయములైన కుటుంబములలో నాంతరమైన పరిస్థితి మఱియొకఁ డున్నది. కడచిన పదియేండ్లుగా నాంధ్ర

రాజవంశీయులలో నుండి యెంతమందియో మగధములనుఁ జేరిరి. సైనికులుగాఁ జేరలేను. ఉద్యోగులుగాఁ జేరిరి. రాజ కులమునందుఁ బలుకుబడి సంపాదించుటకు వేయిమంది వేయి ప్రయత్నములు చేయుచుండిరి. అందఱును శ్రీముఖునకు ననుయాయులు కారు. కొందఱు స్వతంత్రముగా భరత రాజ్యాంగమునందు మహోన్నత పదవులను సంపాదించుటకు ప్రయత్నము చేయుచుండిరి. అట్టి ప్రయత్నములలో నొక విలక్షణమైన ప్రయత్నము పద్మరాణి సుశర్మయొక్క భార్య యగుట. ధాన్యకటకమునందున్న నుత్తమ రాజకుటుంబము లలో గంగాధర శాతకర్ణి కుటుంబముఁకూడ నొకటి. గోముఖ శాతకర్ణి కుటుంబమునకు గంగాధర శాతకర్ణి కుటుంబమునకు నంత శ్రైత్యము లెన్నియో కలవు. పరస్పరము వారి కుటుం బములకు పడదు. ఆ పడకపోవుట విలక్షణముగా నుండును. ఒక గాయకుఁడో ఒక పండితుఁడో యాచ్ఞార్థము వచ్చును. తొలుత గోముఖ శాతకర్ణి నద్దకుఁ బోదురు. ఆయన నాల్గు దీనారము లిచ్చును. తరువాత గంగాధర శాతకర్ణి వద్దకుఁ బోదురు. అతఁడు గోముఖునికంటె నధికుఁడ ననిపించుకొన వలయునని తా నాఱు దీనారము లిచ్చును. మొదట నిచటికి వచ్చి పిదప నచటికి వెళ్ళినను జరిగెడి దింతియే. ఆ రెండు కుటుంబముల నడుమనున్న మాత్సర్య మిట్టిది. గోముఖుఁడు బౌద్ధమతమునం దభిమానము కలవాఁడు. అందుచేత గంగా ధరుఁడు వేదమతమునం దభిమానము కలవాఁడు. ఒకవేళ గంగాధరునకు వేదమతమునందుఁగల యభిమానము సహజ సిద్ధమైనను గోముఖ కుటుంబమునందలి మాత్సర్యముచేత

వా యభిమానభావము సహజత్వముఁ గోల్పోయి కృత్రిమత్వమునే సంపాదించుకొనును. ఇప్పుడు శ్రీముఖుఁడు మగధ రాజ్యమున తారామండలమునం దున్నాఁడు. అతఁడు త్వరలోనే చక్రవర్తి యగునని వదంతి కలదు. అతఁడు చక్రవర్తి యైనచో గంగాధరుని కుటుంబము తన తలను తీసి నేలవేసి కొట్టుకొనవలసినదే. శ్రీముఖుఁడు మగధరాజ్యములకు చక్రవర్తి కారాదు. గిరివ్రజమునం దతనికి ప్రతిస్పర్ధిగాఁ దమ కుటుంబమునుండి వాఁడొకఁ డుండవలయును. గంగాధరునకు మగసంతానము లేదు. ఆయన కొక్కరుకయే కుమార్తె. ఆమెయే పద్మరాణి. ఆపద్మరాణిని శ్రీముఖునకు ప్రతిస్పర్ధిగా నిలువఁబెట్టవలయును. ఎట్లు? ఆమెను సుశర్మకు భార్యను చేసినచో నామె శ్రీముఖునకు సర్వథా మార్గము నడ్డగించునదై వాని కోర్కులు ఫలించుటకు వీలులేకుండ సమర్థముగా నభ్యంతరపెట్టఁగలదు. పద్మరాణి బాల్యము నుండియు మిక్కిలి తెలివితేటలు కలది. మమకారముతో నామెతండ్రి యామెకు విద్యాబుద్ధులు చెప్పించెను. ఆమె విద్యావిషయమున మంచినీటికిఁ జేపవలె నెక్కెను. రాజనీతి యుద్ధనీతి సాహిత్యము శాస్త్రములయందలి పాండిత్యము నామె యపారముగా సంపాదించెను. ఆమె శ్రీముఖునికంటె చాలచిన్నది. గంగాధరునకు వయస్సు మళ్ళినతరువాత నామె జనన మందెను. అతని భార్య గర్భవతి యైనపుడు పుత్రుఁడు కలుగవలయునని గంగాధరుఁ డెంతో యాశించెను. పుత్రుఁడే కలిగినచో శ్రీముఖుని కెదురుగా నిలువఁబెట్టెడివాఁడే. శ్రీముఖుఁ డెంత వీరుఁడో వానికంటె నెక్కువ వీరునిగాఁ దన

కోడుకును చేసెడివాఁడు. చేయుటకు గంగాధరునకు సామర్థ్యము కలదు. గంగాధరుఁడు మహాధానుష్కుఁడు. ధాన్యకటక రాజ్యములోనున్న ధానుష్కులైన సేనకు నతఁడధికారి. అతఁడగ్గునునంత విలుకాఁడని ధాన్యకటకమునఁ జెప్పుకొనుట కలదు. అతని ధనుర్విద్యావేత్తృత్వాతిశయముముందు వాని ఖడ్గవిద్యా నైపుణ్యము పనికిరాలేదు. అనఁగా లోకము వాని ఖడ్గవిద్యకుఁ బ్రాధాన్యమిచ్చి మాటాడదు. అతఁడు ధనుర్విద్యలో నెంతవాఁడో ఖడ్గవిద్యలో నంతవాఁడు. జయద్రథుఁడు ధాన్యకటకమునం దున్నప్పుడు రాజకుమారుల ఖడ్గవిద్యా ప్రదర్శనములు జరుగుచున్నప్పుడు తద్విద్యాప్రదర్శనము వేళల శ్రీముఖాదులు ప్రకటించు విద్యా నైపుణ్యమునకు సర్వజనులు నివ్వెఱపోవుచుండఁగా నీతఁడొక్కఁడు నివ్వెఱపోలేదు. తనకుఁ దెలియని యొండురెండు మెలపులు వారి విద్యలో భాసించినను వారికిఁ దెలియని మెలపులు తనవద్ద పది పంద్రెం డున్నవని వానికిఁ దెలియును. ఇదియొక చమత్కారము; భీముఁడు గదాయుద్ధమునం దెంత నిపుణుఁడో ధనుర్విద్యయం దంత నిపుణుఁడు కావచ్చును. కాని యతని యభిమానము గదాయుద్ధమునందు. అతఁడు సులభముగా గద కొరుగును గాని వింటి కొరుగఁడు. అందుచేత నతని ధనుర్విద్యను లోకము పాటించదు. సరిగా గంగాధరుని ఖడ్గవిద్యా పాండిత్య మట్టిది. ఆయనకుఁ బుత్రోదయము కాలేదు. కూతురు పుట్టినది. అతఁడేమి చేయును? ఆనాఁ డతడు దుఃఖించిన దుఃఖమునకు నాంధ్రరాజ్యరమయు నుస్సురన్నదని చెప్పవచ్చును. కడుపు తీపిగదా! పద్మరాణి

పెలుగఁ జొచ్చినది. ఆమె మహా పండితురాలైనది. తండ్రి కెంత ఖడ్గవిద్యవచ్చునో యామెకంత ఖడ్గవిద్య వచ్చును. జయద్రథుఁడునుఁ బద్మరాణియు నెదురుపడి కత్తి యుద్ధము చేయవలయునుగాని కొన్ని వేలయేండ్ల సంస్కారముతోఁ గూడిన తన ఖడ్గవిద్యా నైశిత్యము బేలువోవుచున్నదని జయద్రథుఁ డనుకొనక తప్పదు. మఱియు నామె విల్లు చేఁబూనినచో నామె లక్ష్యశుద్ధి యింతయని చెప్పుటకు వీలులేదు. ఇట్టి పద్మరాణి నేమిచేయవలయును? మగధ రాజ్యాధిపతియైన సుశర్మకు నీమెను భార్యగాఁ జేసినచో శ్రీముఖుని యాటలు కట్టును. సుశర్మ బ్రాహ్మణుఁడు. తాము క్షత్రియులు. అతఁడు పద్మరాణి నంగీకరించునో యంగీకరించఁడో తెలియదు. శ్రీముఖుఁడు కుత్సితుఁడు. దురాలోచనాపరుఁడు. వాఁడు మంత్రికాఁడు. సేనాపతియు కాఁడు. పొంచి రాజ్యమును గ్రహించుటకు సిద్ధముగానున్న పులివంటివాఁడు మొదలైన బోధ రాజునకుఁ జేసి రాజుయొక్క భోగపరాయణత్వమువిరిచి శ్రీముఖునకుఁ దీక్షైనప్రతిస్పర్ధినిగాఁ గూతును సమాయత్తపఱచవలయుననియు, నట్లుఁ జేసినచో రెండులాభములు సిద్ధించుననియు, మొదటిది గోముఖ కుటుంబము నందలి తమ విరోధమును సాధించుటయు, రెండవది శ్రీముఖునివలన ధాన్యకటక రాజ్యమునకు రాఁబోవు నాపద వారింపఁబడుననియు గంగాధరుని యుద్దేశ్యము. శ్రీముఖుఁడే చక్రవర్తియైనచోఁ దన కుటుంబముమీఁద వాఁ డెల్లును పగతీర్చుకొనును. పరమేశ్వరుఁడు తద్విరోధ నిర్యాతనమునందు తన కింతమాత్రమే సాయపడుచున్నాఁడు.

తనకూతును రాజునకు భార్యగాఁజేయుటతప్పమఱియొకతెన్ను లేదు. ఈ గంగాధరుఁడు పలుమంది బ్రాహ్మణులచేత తన కూతుయొక్క సౌందర్యాదులు పాండిత్యాదులు సుశర్మతోఁ జెప్పించెను. సుశర్మ పద్మరాణియందు మక్కువకలవాఁడయ్యెను. సుశర్మ కామెయొక్క పాండిత్యాదులు రాజనీతియు నక్కఅలేదు. అతని యభిలాషయంతయు నామెయొక్క సౌందర్యముమీఁదఁ గేంద్రీకృత మయ్యెను. ఆ పద్మరాణియొక్క సౌందర్యమింతయని చెప్పుటకు వీలులేదు. సంధ్యాకాలమున శరదృతు ప్రారంభమున వచ్చిన నల్లమబ్బులైనవేళ తెల్లని మబ్బులు ప్రతీచీదిశా లలనా సితప్రావారాంచల రమణీయములై తిరుగాడుచున్నపుడు, మందమారుతములు సన్నని యీలలు వేసికొనుచు వెదుళ్లపొదలలో బృందావన విహారియైన శ్రీకృష్ణునియొక్క లీలాభినయము జేయుచున్నపుడు, తెల్లనిమబ్బులు నదులలోఁ బ్రతిఫలించుచున్నపుడు నువ్వుచేను పూసినట్లున్న ప్రతీచీదిశాంగనావదాత మధురాపాంగములు ప్రసరించినచో నామె కాలపురుషుని తా నభిసరింపఁ బోవుచున్నదా యన్నట్టి వేళయందలి యొకానొక కట్టమితము పద్మరాణిగా నవతరించినదని చెప్పవచ్చును. ఆమె నిలుచున్నచోట నచ్చరలు నిలుచుండుటకు వీలులేదు. ఆమె నవ్వినచోటఁ దామరలు వికసించుటకు వీలులేదు. ఆమె పయ్యెద యాడినచోట నేన్నుతొండముచేత కదలించఁబడిన వెన్నెలతీవ చివళ్ళుకదలుటకు వీలులేదు. అంచఱెక్కలు పొడిచేసి చెట్లలోఁబోసి చెరిగినచో దూగరపోఁగా మిగిలిన మెత్తని తద్గుణత్వాత్ర చిక్కణపదార్థ

ములోని సౌకుమార్య మామె శరీర కాంతులను గుప్తగొన్నది. ఆమెయందు రెండు లక్షణములు సమానముగాఁ దులదూగు చున్నవి. ఒకటి యామె శరీరసౌందర్యము. రెండవది యామె పాండిత్యము. పరమేశ్వరుఁ డామె నంతపండితు రాలినిచేసి యామెకు సౌందర్యము కొంత తక్కువ యిచ్చి నచో నెంతయో బాగుగా నుండెడిది. లోకమునకు సౌంద ర్యము కావలయునా? పాండిత్యము కావలయునా? సౌంద ర్యమే కావలయును. పాండిత్య మాంతరమై యుండనక్కఱ లేదు. బాహిరమై యుండవలయును. అప్పు డప్పుడు వినోదమున కయ్యెడిది పాండిత్యము. అనుభూతి కయ్యెడిది సౌందర్యము. లోకముమాట యట్లుంచి నైయక్తికముగాఁ బురుషుఁడుగాని స్త్రీగాని తమ సౌందర్యమును మన్నించు కొన్నట్లు పాండిత్యమును మన్నించుకొనరు. ఇది జీవుని యొక్క లక్షణము. ఒక పురుషుఁడు మహాపండితుఁడు. వానిని లోకము బ్రహ్మరథము పట్టుచుండును. ఒకఁడు మహాధికారి. వాని వెంట పగఁటిదివ్విటీలు నడచును. ఇంకొ కఁడు రాజు. వాఁడు సకల ధరాతలపతి మౌళిరత్నరంజిత చరణుఁడు. ఇంతయయ్యు వారికి శరీరసౌందర్యములేదు. వారినిఁజూచి వలచెడి స్త్రీలేదు. ఏ స్త్రీవంక వారు సాభి లాషములైన దృక్కులు ప్రసరింతురో ఆ స్త్రీయొక్క కను రెప్పలు లాలసలేని నైరాశ్య సూచకములైన, అపేత వాంఛ ములైన కదలికతో వ్రాలిపోయినచో వానిగుండె చివుక్కు మనును. తన యింతటి పాండిత్యము, తన యింతటి యధి కారము, తన యింతటి రాజ్యము వృథాయనిపించును.

పురుషులుగాని స్త్రీలుగాని తమ దేహములయందు సౌంద ర్యమును కోరుదురు. ఒక నిమేషములోని తత్సుఖమునకు వారు జీవితాంతము పొందిన గౌరవమును పణముగా నొడ్డు దురు. సౌందర్య మనఁగా నటువంటిది. అంత సౌంద ర్యముకల పురుషుఁడుకాని స్త్రీకాని తమ సౌందర్యమునకు చారితార్థ్యము గడించుకొనుటకుఁ బ్రయత్నింతురు కాని పాండిత్యమునకు చారితార్థ్యము గడించుకొనుటకు నంతగాఁ గోరరు. కాని లోకములో నదియున్నచోట నిదియుండదు. ఇదియున్నచోట నదియుండదు. రెండునుఁ గలసియుండెడి చోట్లు చాల తక్కువ. పురుషులలో నొక నలమహారాజు మాత్రమే రెండును సమానముగాఁ గలవాఁడు. ఆయన పడిన కష్టములు సర్వజనులకు విదితమైనవే. రెండు మహా గుణములు సమానమైన కోటి నధిరోహించినచో నచట సుఖ మునకంటె దుఃఖమే యెక్కువయుండును. గంగాధరునకుఁ దనకుమార్తె మగధరాజు భార్యయై శ్రీముఖుని ప్రతిస్పర్ధినియై మగధరాజ్యమును శ్రీముఖునినుండి రక్షించి కులక్రమాగత మైన జ్ఞాతివైరమును సాధించుటకు సాధనమగునని యాశ. ఎట్లుఫలించునో తెలియదు. బ్రాహ్మణుల వార్తలవలన సుశర్మ పద్మరాణియందుఁ బ్రేమకలవాఁడయ్యెను. అంగీక రించెను. గంగాధరుఁడు తనకూతును మగధములకుఁ బంపిం చెను. సుశర్మ పద్మరాణినిఁ జూచెను. ఆచూచినవేళ యిట్టిదని యింత సుమనోహరమైనదని యింత పూర్ణిమా జ్యోత్స్నాసుషీమ తరంగాభిరామమైనదని, పికీకంఠ కుహూ కుహూ నినదాంత సూక్ష్మసుకుమార రేఖామంజులమని చెప్ప

టకు వీలులేదు. ఆవేళ యట్టిది. పద్మరాణి రాజును చూచినది. ఆమె తండ్రిచేత బోధింపఁబడి గిరివ్రజమునకుఁ బోయెను. తానొక మహారాజ కార్యముమీఁదఁ బోవుచున్నానని, కులక్రమాగతమైన యొక మాత్సర్యభావమునకు ఫలితము సంపాదించుటకుఁ బోవుచున్నానని, యామెకుఁ దెలియును. ఆమె మనస్సులోఁ దండ్రికోరిక చెల్లించవలయు నని నిశ్చయము చేసికొన్నది. తొలుత నామెకు రాజ దర్శనము కలిగినవేళ మధ్యాహ్నవేళ. గిరివ్రజపురమున పెద్ద రాచసావడిలో సుశర్మ కూర్చుండియుండెను. అతఁడు బెత్తెడు వెడల్పు జరీగలధోవతి కట్టుకొనియుండెను. అతఁడు కూర్చున్నవైఖరి యెట్టిదనఁగా నతని పాదాంచలములందు మణులుపొదిగిన నెమళ్ళయాకారముగల యా ధోవతియంచు ఎడమకాలి మడమలమీఁద గోధుమవన్నెతాఁచు పడగవిప్పి యాడుచున్నట్లుండెను. కుడిపాదముమీఁద నీయంచు మో కాటివఱకే తాండవించుచు తత్పాదమునకున్న గండపెండె రము మరకతమాణిక్య వజ్రవైడూర్యములచేత తళతళలాడు చుండెను. అతని యొడిలో నొకవిపంచి యున్నది. ఆ విపంచిమీఁద నాయన సుకుమారములైన యంగుళులతో స్వరములు పలికించుచుండెను. అతనిఱొమ్ము విశాలమై ముత్యాలహారములతో పచ్చల హారములతో లక్ష్మీనివాస స్థానముగా నుండెను. అతని శిరోజములు రెండుపాయలుగాఁ దీయఁబడి రాజత్వమును సౌందర్యాధిదేవతాత్వమును సరిగా నడిమికి విభజించి పాలించుచున్న ట్లుండెను. అతని నేత్ర ములలో శివుని కంటిమంటలోఁ దగులఁబడిపోయి మఱల

నొక మధురవేళ క్రొత్తగా నాకు వదలిన మన్మథవృక్షము భాసించుచుండెను. అతనిని చూచుటకు పద్మరాణి సిగ్గుపడెను. కాని చూచెను. సిగ్గు తెరలు తెరలుగా వచ్చుచుండెను. కాని తెరను తొలఁగఁద్రోసి యతనివంకఁజూచుటకు పద్మరాణికి లేబరమైపోయెను. ఇద్దఱునుఁ బరస్పరము తిలకించుకొనిరి. పద్మరాణి వెంట నామె బంధువులెవరో వచ్చిరి. ఆ సమాగమము చిత్రముగా నుండెను. పెండ్లి కాలేదు. ఆతతంగము జరుగలేదు. వారిద్దఱును నొకరి నొకరు చూచికొనుట కాసమాగమ మేర్పఱుపఁబడెను. చూపులైనతరువాతఁ బద్మరాణినిఁ దెచ్చినవారు మఱల విడిదికి తీసికొనిపోవలయునని వాంఛించిరి. పద్మరాణి కదల లేదు. రాజు చేయెత్తి వారించెను. ఏమిచేయవలయునో కొంతసే పెవ్వరికినిఁ దెలియలేదు. రాజు వీణమీఁద వాయించుచుండెను. ఆగానము రాచసావడిని తనలో నిముడ్చుకొనెను. గంగాధరుఁడు కూతునకు సర్వవిద్యలు నేర్పెనుగాని సంగీతము నేర్పించలేదు. కాని యామె సంగీతమునువిని యానందించఁగలదు. ఒకవిద్య నానందించుటకుఁ బ్రధానమైనది తద్విద్యా సంప్రదాయాభిజ్ఞత. అది లేకుండ యథార్థముగానే విద్యయొక్క లోతులును తెలియవు. విద్యాప్రదర్శనము, రసాస్వాదనము రెండు విషయములున్నవి. రెండును భిన్నవ్యక్తులకు సంబంధించినవనియే స్థూలముగాఁ జెప్పవచ్చును. విద్యాప్రదర్శకునకు తద్విద్యాగత సర్వ సూక్ష్మవిషయ పరిజ్ఞాన మెంతయవసరమో రసాస్వాదకునకుఁ గూడ నవి యంత యవసరము. గాయకుఁడు తీవ్రమైన

స్వరములను ప్రయోగించుచు నొక రాగము నాలపించుచు నడుమ తొలఁగి తద్రాగానుచితమైన యింకొక స్వరమును ప్రవేశపెట్టినట్లు కనిపించుచు తత్ప్రయోగ నైపుణ్యముచేత నింకొక జన్యరాగమును స్ఫురింపఁజేయుచు నట్టి మార్పు చేయుటవలన భావములో నొక విఱుపు నొక యొయ్యారము నొకసుకుమారమైన యనుభవరేఖయు భాసించునట్లు గానము చేసినచో తత్స్వరాభిజ్ఞతలేని శ్రోత గాయకుఁ డుద్దేశించిన యా భావమును పట్టుకొనలేఁడు. ఈ లోకమునందంతయు సాంఘికముగాఁగాని, మత విషయముగాఁగాని, విద్యా విషయకముగాగాని, ఆ యా జాతియందలి పూర్వర్షులు మానవుని యొక్క ప్రవర్తనలోనను జ్ఞానములోనను తీర్చిదిద్దుటకు శాస్త్రములను విలిఖించిరి; ఆ శాస్త్రములయందలి పరమ విజ్ఞానమే మానవులకు ధ్యేయము, నుపాధ్యేయమునై యున్నవి. పదివేలమంది మానవులున్నారు. వారిలోఁ గొందఱు దేనికిని పనికిరారు. కొందఱు పరమ వివేకులు. వారిని వీరినిఁ దొలఁగించినచో నడుమనున్నవారందఱి కొఱకు నీ శాస్త్రము లేర్పడినవి, చాతుర్వర్ణ్యమున్నది. సంఘమీ తీరున నడువవలయునని భగవంతుఁడు శాసించినాఁడు. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం'అని యాయనయే చెప్పినాఁడు కదా. ఈ చాతుర్వర్ణ్య మెవరికొఱకు? ఒక నీచకులుఁడు పరమభక్తుఁడై పరమేశ్వరుని దయ పొంది మోక్షమును పొందినట్లు పురాణములే చెప్పుచున్నవి. చాతుర్వర్ణ్యము వానికొఱకు కాదుకదా! వాని మోక్షమునకు వాని నీచకుల మడ్డు రాలేదు. ఎందుచేత? పూర్వజన్మ సంస్కార

వశమై వాఁడు నీచకులమునందు జన్మించినను వాని యాత్మ పరమేశ్వర భావమునందు లగ్నమై యుండెనని యర్థము. ఇట్లందఱి యాత్మలు లగ్నమై యుండవు. ఉన్నచో లోక మేమున్నది? మదమాత్సర్యము లెందుకుండును? కామాది భావల విజృంభణ మెందులకు నాగును? చాతుర్వర్ణ్య మనునది బహుసంఖ్యాకులైన సామాన్యజీవులకొఱకేర్పడినది. అందులో తరతమ భావములనుఁబట్టి వారి వారి వర్ణముల నిశ్చయము జరుగునని చెప్పవచ్చును. అట్లే యొక విద్య యున్నది. కవితావిద్య యున్నది. సూక్ష్మశబ్ద పరిజ్ఞానముకలిగి, శబ్దశక్తివేత్తయై, సర్వశాస్త్రాభిజ్ఞతకలిగి భావమునందు రమిం చెడి లక్షణము కలిగి, ధ్వన్యాది వివేకముతోఁ గవి వ్రాయ వలయును. ఆ కవిత నానందించెడివాఁడుకూడ నేతాదృశ గుణసహితుఁడైననే యానందించఁగలఁడు. ఈ యానం దించెడి వారిలో నట్టి లక్షణము పూర్వము చెప్పిన బహు సంఖ్యాకులయం దుండినకాని తదనుభూతి జరుగదు. భగవ ద్విషయమున నీచకులుఁడై సంస్కార రహితుఁడైనవాఁడు బహుజన్మ పరిపాకాత్తమైన యొక యాత్మ లక్షణముచేత తపము లేకుండ జపములేకుండ నాచారములేకుండ భగవ ద్దర్శనము చేసినట్లే యొకానొక జీవుఁడు, తన పూర్వజన్మ పరిపాక విశేషవశమున కవితాసరస్వతి ననుభవించుటకుఁ గావలసిన పూర్వోక్త గుణములు లేకుండఁగనే రసానుభూతి పొందఁగలఁడు. అట్టి జీవులసంఖ్య చాల తక్కువ. అట్టి యుత్తమ జీవులు సంఘమునందున్న దుర్వ్యవసాయములకు వారి కిదివఱకే సమృద్ధిగానున్న మాత్సర్యాది గుణములు

ప్రబలము లగుటకు హేతువు లగుచున్నారు. ఆ నీచకులుఁడు మోక్షము పొందినాఁడని తక్కిన యందఱు మోక్షార్హులు కారు. ఎవఁడో యొక యుత్తమజీవి పాండిత్యాదులు లేకుండ కవితానుభూతిని సమగ్రముగాఁ బొందినాఁడని పామరు లందఱునుఁ బొందలేరు. పామరులు తదుత్తమ జీవులను చూపించి శాస్త్రమర్యాదల నుల్లంఘించి విశృంఖలముగాఁ బ్రవర్తించుటకు భగవంతుఁ డేర్పఱచిన యొకి మోసమని చెప్పవలయును. అదియట్లుంచి పద్మరాణియొక్క జీవలక్షణము సంగీత విద్యావిషయమునఁ దాదృశమైనది. సుశర్మ వీణావాదనమునందు సిద్ధహస్తుఁడు. అతఁడు వీణ మీఁద వాయించుచుండఁగా నెమళ్ళు కూయును. మబ్బు లురు ॥ ను. కోయిల లాలపించును. క్రింద గులకరాళ్లు కలిగిన నీలమండలలోతు తెలినీటివాగు పల్లమునందు ప్రవహించు నపుడు చేసెడి సన్నని సవ్వడులు చేయును. అర్ధరాత్రము మఱలినవేళ నంతవఱకు బిగించియున్న గాలి సన్నగా సాగి నపుడు చెట్లకొమ్మ చివరి చివురుజొంపముల యందలి సన్నని యులివు సలుపును. అతని వ్రేళ్ళలో సంగీత సరస్వతి చతుర్ధా ప్రవేశించి నాట్యమాడును. అతఁడిప్పుడు తనయొడలు తనకుఁ దెలియకుండ నున్నాఁడు. తానేమి వాయించుచున్నాఁడో తనకుఁ దెలియదు. పద్మరాణియొక్క సౌందర్యమును స్వరములుగా మఱలించి వీణాతంత్రులలోని కెక్కించుచున్నాఁడా? ఆ మధురస్వరము వినిగ్గతమై తత్స్వరమునకు తనకునుఁ బద్మ రాణి యవినాభావముగా భావించుచున్నదా. వారిద్దఱు నట్టి తన్మయస్థితిలో నున్నారు. పద్మరాణి వయసు నాఁటికి పదు

నెనిమిదేండ్లు. రాజు వయస్సు నలుఁబది కావచ్చును. వారి నడుమ వారి వర్ణభేదముకాని, వయోభేదముకాని కనిపించ లేదు. అట్లు కాలము గడచిపోవుచున్నది. సంధ్యాకాలము సమీపించుచున్నది. పరిచారకులుగాని తదితర శ్రోతలుగాని పద్మరాణివెంటవచ్చినవారుగాని మాటాడుటకు వీలు కలుగలేదు. సంజ యెఱ్ఱచీకట్లు సావడిలోనికి వచ్చెను. ఇంతలో దీపములు వెలిఁగింపఁబడెను. ఆ చీకట్ల యెఱ్ఱఁదన మును దీపముల వెల్లఁదనపు పులి పంజాతో లేఁడి నెత్తురును చఱచినట్లు గొట్టెను. సహజముగాఁ జావడిలోనికిఁ బ్రవే శించిన యెఱ్ఱచీఁకటి వెలుతురులను వారిద్దఱునుఁ బరామ ర్శించలేదు. కృతకముగా వచ్చిన దీపకాంతులచేత నా యెఱ్ఱ వెలుఁగులు తాడింపఁబడినవేళ వారిద్దఱును తమ తన్మయత్వ స్థితినుండి విశ్లథభావమును భజించిరి. రాజు దీపములవంకఁ జూచి నవ్వి వీణ ప్రక్క నుంచెను. పద్మరాణివంకఁ జూచెను. ఆమెయు నతనివంకఁ జూచుచునే యుండెను. రాజు లేచి నిలుచుండెను. ఆమెయును లేచి నిలుచుండెను. రాజామె వద్దకు నెమ్మదిగా నడచి పోయెను. ఆమె కుడిచేయి తన యెడమచేతితో గ్రహించెను. ఇద్దఱు నంతిపురములోనికి నడచిపోయిరి. అందఱును నివ్వెఱపోయిరి. ఇది వారి ప్రథమ సమాగమము. తరువాతఁ గొన్ని నెలలవఱకుఁ బద్మరాణియను నొకయువతీమణి యంతిపురములో నున్నదని గాని రాజామెయందు బద్ధప్రేముఁడనిగాని యెవ్వరికినిఁ దెలి యదు. కాలము గడచిపోవుచుండెను. ఆ పద్మరాణికి తాను రాజునకుఁ బ్రియురాల నైతినని తెలియదు. తాను గంగాధర

శాతకర్ణి కుమార్తెనని తెలియదు. తానొక మహాకార్యమును భుజాస్కంధములయందు మోచికొనుచు వచ్చితినని తెలియదు. సుశర్మకు పద్మరాణి యొక యువతీమణియని తానామెను ప్రేమించితినని తా నామెతో నొక సుఖ మనుభవించు చున్నాననని మొదలైన సంగతులు తెలియవు. ఇతఁడు పద్మరాణివద్దకుఁ బోవును ఆమెకు వీణాగానవిద్య బోధించును. వారిద్దఱొకరినొకరు చూచుకొనుచుఁ గూర్చుచుందురు. ఆ పరిస్థితి యిదమిత్థమని నిర్ణయించుటకు వీలు లేకుండెను. అట్టి ప్రేమ ముసురు పట్టనే పట్టదు. లోకమునందట్టిది సంభవించదనియే చెప్పవచ్చును. ప్రేమ యనునది భావనామూలక మైనది. వారియందా భావన లేదు. పట్టి రమణ మున్నది. ఆమెనుఁగూర్చి యీయన భావించఁడు. ఈయననుఁగూర్చి యామె భావించదు. ఇద్దఱునుఁ గలసికొందురు. తత్పూర్వమందుఁ గలసి లేకున్న యూహ లేదు. ఇపుడు కలిసితిమన్న యూహ లేదు. కలియనప్పుడుకూడ వారొకరియం దొకరు నున్నట్లే యున్నది. కలిసినప్పు డెట్లుండెనో దూరగులై యున్నప్పుడు నట్లే యుండెను. అతఁడు తాను రాజు కాఁడు. ఆమె తాను పండితురాలు కాదు. వారిరువురినడుమ మన్మథుఁ డుండెనా ?. వాఁడు భావజుఁడు. మనోజుఁడు. వారిద్దఱినడుమ వాఁడనంగుఁడై యుండెను గాని మనోజుఁడుగా లేఁడు. కొన్ని నెలలు వారి సంయోగ మిట్లుండెను. అప్పటికి పద్మరాణికి తాను గంగాధరుని కుమార్తెనని తెలిసెను. దానికిఁ గారణము తండ్రివద్దనుండి యామెవద్దకుఁ గొందఱు బ్రాహ్మణులు వచ్చి యామెతోఁ

బలుమాటలు చెప్పుట. వారిట్లనిరి: "ఓయమ్మా! నీతండ్రి నీతో నిట్లనుమన్నాఁడు. మీ యిద్దఱినడుమ వివాహము జరుగలేదు. నీవు రాజున కుంపుడుకత్తెగా నైతివి. ఇది మన కుటుంబ మర్యాదకు భంగమైన విషయము. నిన్ను నే నెందుకుఁ బంపించితినో ఆ సంగతియే నీవు మఱచిపోయితివి. ఓసి తల్లీ! మాకిది విడ్డూరముగానున్నది. నీయం దిట్టిప్రకృతి యున్నదని మాకుఁ దెలియదు. నీవు పాండిత్యమును రాజనీతియుఁ బ్రధానముగా జీవితము గడపెడి యొక మహావ్యక్తి వగుదువని మే మనుకొంటిమి. నీ వీ వలపు టున్మాదపు మహావర్తమునఁ దలమున్కలుగా నైనావు. ఈ లక్షణము మాకుఁ దెలియనే తెలియదు. నీ చిన్ననాఁడు నీలో మా కా రేఖ గోచరించలేదు. పోనిమ్ము. మా కిచట నీ స్థితి తల వంపులుగానే యున్నది. నీవు రాజునుఁ బెండ్లియాడినదానవు కావైతివి. మీ వివాహమునకుఁగూడ మించిపోయిన యొక పరమ మధురమైన దశలో నీ వున్నావని కొందఱివలన మేము విన్నాము. మా కట్టి స్థితి యెట్లుండునో తెలియదు. మా కర్థముకాలేదు. నిన్ను నిందించుటకు నీ వపంకితురాలవు కావు ఈ సృష్టిలో నే విచిత్రమైన భావరేఖ యెట్లు పరిణమించునో తెలియదు. ఆ స్థితినుండి వెలికిరమ్ము. నీ భర్తయైన సుశర్మయొక్క స్థితి దీనముగా నున్నది. అతనిని శ్రీముఖుఁడు తన చేతులలోఁ బెట్టికొని కీలు బొమ్మవలె నాడించుచున్నాఁడు. మేమేదో చేయఁబోయితిమి. ఇంకేదో యైనది. నీవు రాజునకు భార్య వైనప్పటినుండి నీ భర్త తొలినాఁటి రాజ్యాంగమునందలి శ్రద్ధకూడ వదలినాఁడు. నీతోనే మనికి

గా మనుచున్నాఁడట. అతనికి వాని దుస్థితియు శ్రీసుఖుని మరూహాలును బోధించి నీవు నీ రాజనీతిజ్ఞతను వెల్లడించి బాగుచేసికొనుము. ఇది నీ విధి.” ఇట్లు రెండు మూఁడుసార్లు ధాన్యకటకీయులైన బ్రాహ్మణులచేత బోధింపఁబడి పద్మరాణి యా ముంపులోనుండి కొంత వెలికి వచ్చెను. ఎన్నినాళ్లో రాజుతో చెప్పవలయునని యనుకొనును. అతఁడు వచ్చినంత నంతేయు మఱచిపోవును. వారిద్దఱుఁ గలసియున్నప్పుడు వారి కింకొక యూహ రాదు. ఇద్దఱును కలిసి యున్నామన్న యొక విచిత్రమైన తృప్తి సర్వలిప్తలయం దభివ్యాప్తమై యుండి యొక విధముగా మెలఁగుచుందురు. అతఁడున్నప్పు డామె యేమియు నూహించలేదు. ఆమె యున్నప్పు డతఁ డేమియు నూహించలేఁడు. ఒకరి నొకరు చూచుకొం చుందురు. అటునిటు తిరుగుచుందురు. వీణ వాయించు చుందురు. ఎందుకో నవ్వుకొంచుందురు. గాటపు కౌఁగి లింత లుండవు. వేడి చుంబనము లుండవు. మృదుకరస్పర్శ లుండవు. భావనాసహితమైన హేలా మాధుర్యములుండవు. ఉన్నను వానికిఁ బ్రాధాన్యములేదు. ఇట్టి యొక విలక్షణమైన సంసారమును వారు చేయుచుండిరి. అట్టి జీవితములో రాజ్య ములు పోయిననేమి? ప్రాణములు పోయిననేమి? అట్టి జీవిత ములో సుశర్మకు తన వీణావాదన నైపుణ్యముతోడి కించి దహంకార భావసహితమైన యూహ లేదు. ఆమెకు తన పాండిత్యము తన రాజనీతిజ్ఞత మొదలైనవాని యూహలేదు. రాజు విషయములోఁ బద్మరాణితోడి యీ సంబంధముతోఁ గూడి వైరాగ్య మొకఁడు నిత్యము భాసించుచుండును.

పద్మరాణితోడి కూడుటకు యతని వైరాగ్య భావమునకు దోహదమయ్యెను. అతఁడు పద్మరాణితోఁ గలిసియున్నపుడు పద్మరాణియొక్క సౌందర్యమునుఁ గూర్చిన యభిలాషతోఁ గూడిన యొక తన్మయత్వరేఖలో మునిఁగియున్నాఁడో తాను చదివిన యుపనిషత్తులలోని మర్మమైన యొక తన్మయత్వరేఖలో మునిఁగియున్నాఁడో రెంటికి నభేద ప్రతిపత్తిగా ననుచున్నాఁడా? ఈ రెండు స్రోతస్సులు సమానలక్షణములగుటచేత నొకదానియందు మజ్జనము చేసినప్పుడు రెండవదానియందు మజ్జనము చేసిన ట్లుండుటవలన నా రెండను భూమికలయందున్న పరమసూక్ష్మమైన భేదము తెలియకుండ నున్నాఁడా? తెలిసి దేనికి దానిని విడిగా ననుభవించుచున్నాఁడా? అట్టి స్థితి యొక యేఁడాది ప్రబలినది. తరువాత నా స్థితిలోఁ గొంత మార్పు వచ్చినది. ఆ స్థితికి భంగము లేదు. కాని యితరములైన విషయములను మన్నించుటకు వారి మనస్సులలో నెడ మేర్పడినది. ఈ యెడము తత్స్థితికి భంగకారి కాదు. వారి మనసులలోని పొలములలోఁ గొంత మేరనాస్థితికి వదలిపోయి యచట నితరభావములు ప్రవేశించి నట్లు కాదు. ఆ మనస్సులలోని పొలమే మఱికొంత పెఱ పొలమును గదుముకొన్నది. ఆ గదుముకొనిన పఱంబోకల యందు వారియొక్క యితర భావములు సంచరింప నారంభించెను. వా రిరువురి సమాగమమైన తరువాత నొక యేఁడాది యేమియు లేదు. తరువాత నింకొక యేఁడాది. మఱియు నేఁడాది. మఱియు నింకొక సంవత్సరము. ఇట్లు నాలుగేండ్లు గడచినవి. ఈ నాలుగేండ్లలో వారు తమ తన్మయత్వస్థితి

దాటి పెఱవిషయములను భావించిన వేళలు కలవు. ఒకప్పుడు పద్మరాణి యిట్లన్నది. "రాజ్యమంతయు శ్రీముఖుని యధీనములో నున్నది. అతఁడే మంత్రి, అతఁడే మహాసేనాధిపతి. నీవు నేను జీవితముగా బ్రతుకుచుంటివి. అతఁడీ రాజ్యమునుఁ గైవసము చేసికొన్నచో నేమగును? సుశర్మ యిట్లనెను. "ఏమగును? మనము గిరివ్రజములో నుండము. ఈ మహా భోగము లనుభవించుచుండము. వీణ యుండదు. రత్న కంబళము లుండవు. మణిదీపము లుండవు. జిలుఁగువలువ లుండవు. నీకు నేనుందును. నాకునీ వుందువు." పద్మ:- అతఁడు మనలను సంహరించినచో నేమగును? సుశర్మ:- ఏమగును? నీవొక జీవుఁడవు, నేనొక జీవుఁడను. జీవునకు స్త్రీత్వ పురుషత్వవిభేద ముండదు. కాని జీవసంపుటిలో తజ్జీవోద్దేశ్యము ప్రకారము తద్భావముండవచ్చును. ఉండును. కనుక నపుడుకూడ నీవు నాకుందువు. నేను నీ కుందును. పద్మ:- జీవునకు లింగవివక్ష లేదుకదా? అపుడు మన మిద్దఱ మొకరి కొకర ముండుటలోని ప్రయోజనమేమి? సుశర్మ:- ఇప్పుడు నీవు స్త్రీవి. నేను పురుషుఁడను. అయిన ప్రయోజనమేమి? నీవు నాయందు లోకదృష్టియందుఁగల కామముతోఁ బ్రవర్తించుచుంటివా? నీయందు నాకాసన్న తోఁచలేదు. నేను నీయం దట్లు ప్రవర్తించుటలేదు. నిన్ను సంతోష పెట్టవలయునని నే నెన్నడును ప్రవర్తించినట్లు నాకు జ్ఞాపకములేదు. నన్ను సంతోషపెట్టవలయునని నీవును ప్రవర్తించినట్లు నా కెప్పుడు ననిపించలేదు. మన మిద్దఱము స్త్రీ పురుషులవలెఁ బ్రవర్తించుచునే యున్నాము. కాని మన

యిద్దఱి నానుగడలో దానియందు ప్రాముఖ్య మున్నట్లు నాకు భాసించుటలేదు. అందుచేత నిప్పు డెట్లో అప్పుడున ట్లే. పద్మ:- ఒకవేళ శ్రీముఖుఁడు నిన్ను సంహరించును. నన్ను సంహరించఁడు. నే నాడుదానినిగదా! అప్పుడు మనజీవుల పరస్పర సంబంధ మెట్లుండును? సుశర్మ:- అప్పుడు నిట్లే యుండును. మన మిద్దఱము కలిసియున్నపుడు కలిసియున్నా మన్న తృప్తి యంతర్నిహితమై యున్నది గాని బహిరావి ర్భూతి పొందుట లేదుకదా! ఈ యాంతరమైన స్థితి జీవ లక్షణమునందు బ్రతికియున్నను చనిపోయినను సమానము గానే యుండును. పద్మ:-నేను నిన్ను మొదటిసారి చూచితిని. మన యిద్దఱకు నొకరియం దొకరి కనురాగ ముదయించెనా? లేదా? తత్పూర్వ మా యనురాగము లేదుకదా! ఆ యను రాగోదయమునకు మనమిద్దఱ మొకరి నొకరు చూచుకొనుట హేతువుకదా! చూచుకొనుట పరస్పర సౌందర్య భావనా లక్షణము కలదిగదా! మన ప్రేమ నీ నా సౌందర్యముల పరస్పర భావనాజనితము. ఒక శరీరము లేదు. తద్భావనా హేతుకమైన శరీర సౌందర్యము పోయినది. ఉపాధిస్థమైన శరీరము లేనపుడు తదాశ్రయమైన సౌందర్య గుణమునకు స్థితి యుండదు. మూలకారణమే పోయినపుడు కార్యము నశించును. సుశర్మ:- అట్లు కాదు. అది లేదు. అది అన్న మాట యెట్లు పుట్టినది? అది యున్నదిగనుక పుట్టినది. లేక పోవుట తత్ప్రత్యేకోపాధి సంబంధ భావము. ఉండుట నిత్య భావము. అదివఱకే మన యిద్దఱకు ప్రేమ యున్నది. ఆ ఉన్నది మన మొకరి నొకరు చూచుకొన్నప్పు డున్నదియన్న

యభిజ్ఞ సంపాదించుకొన్నది. అదివఱకున్నది యని మనము తెలిసికొనలేదు. అప్పుడు తెలిసికొంటిమి. తెలిసికొనుట తనువాత లేకపోవుట యన్నది లేదు. ఇది యొకనాంటి ప్రసంగము. ఎన్నిప్రసంగములైనను పద్మరాణి శ్రీముఖునితో మొదలుపెట్టెను. అతఁడు రాజ్యము నపహరించుననన్న మాటలతో మొదలుపెట్టును. అన్నియును వేదాంతముల లోనికే దిగును. ఆమె రాజనీతి మఱచిపోవును. లోకమును మఱచిపోవును. అతఁడు లేనపుడు తీవ్రముగాఁ జింతించును. తనకున్న చాకచక్యమునకు తాను గిరివ్రజపురమునందలి యధికారమునంతయుఁ దన చేతిలోనికిఁ దీసికొనఁగలదు. వేయి మార్గముల నధికారము చేయఁగలదు. కాని తన కా యూహ పుట్టదు. సుశర్మ వచ్చును. అతనితో నీ ప్రసంగము చేయుటకే కొంత ప్రయత్నముచేసికాని సంబాళించుకొనలేకుండ నున్నది. ఈ రాజ్య మెట్లు పోయిననేమి? ఆ శ్రీముఖుఁడు వాఁడు లోకనిష్ఠుఁడు. వానినే బాఁపుకొననిమ్ము. తా నిచటికి వచ్చెను. స్త్రీ వ్యాజమున వచ్చి పురుష వృత్తిమును మఱచిపోయెను. స్త్రీవృత్తము నవలంబించుచుండెను. తన వృత్తి స్త్రీ వృత్తియుకూడ కాదు. ఇది యొక లింగాతీతమైన యొక స్థితి. ఈ రాజు తన్ను మార్చివేసినాఁడు. తాను వేదాంత మెఱుఁగదు. అతనితోడి మనుగడ నిత్య వేదాంతాభ్యాసముగా నున్నది. లోకములోఁ బురుషుఁడు స్త్రీయందు కామభావమును వృద్ధిపొందించును. ఇతఁడు వేదాంతభావమును వృద్ధి పొందించుచున్నాఁడు. ఇందులో కామభావన లేదా? ఉన్నది. తగినంత యున్నది. దాని

నతిక్రమించి యొక వైరాగ్యభావన రకున్నది ఆమె తన స్థితినిఁగూర్చి యాలోచించినది. ఆస్థితి యిట్లున్నదనుకొనెను. తనయొక్కయు, రాజుయొక్కయు వలపున్నది. దానికి కొన్ని యావరణము లున్నవి. ఆ యావరణములతోసహా నా వలపు ప్రకాశించుచున్నది, ఈ యాచరణములు తొలఁగిపోవునేమో యన్న భయములేదు. పోయినచో పోవనిమ్ము. ఇది యి ట్లున్నంతవఱకు దీనియందు రమించును. ఇది పోయినచో విచారణ లేదు. దానిని నిలఁబెట్టుటకుఁ బ్రయత్నములేదు. ఈ స్థితియందు తన పాండిత్య మంతయు తన ధనుర్విద్యా వైశారద్య మంతయు తన ఖడ్గవిద్యా నైపుణ్య మంతయు తన నీతివేత్తృత్వ మంతయు వ్యర్థమైపోవుచున్నది. అది వ్యర్థమైపోవుట యనిపించుటలేదు. కాని తన మనస్సులో నితరములైన భావములు లేవా? ఉన్నవి. వచ్చుచున్నవి. వాని దారిననవి పోవుచున్నవి. వానికి నిలుకడలేదు. వానికిఁ బట్టింపులేదు. ఇంతకును శ్రీముఖునియందు రాజ్య మపహ రించు వలయునన్న ప్రయత్నము భాసించుటయే లేదు. వానియం దట్టి దోషము భవిష్యత్తునందు సమావిర్భవించు నన్న యొక నిర్హేతుకమైన భయమును పురస్కరించుకొని వాని కపకారమును చేయుట యెందులకు? తమ రెండు కుదుళ్ళకుఁ బడనిచో తానా యీ విరోధమును కొనసాగించ వలసినది? తాను రాజునకు పరమ ప్రియురాలని శ్రీముఖు నకుఁ దెలియును. అతఁడు తన విషయములో నెన్నఁడు జోక్యము కలిగించుకొనలేదు. ఆ పురాతన జ్ఞాతివైరము తన విషయములో లీలగానైన నతనిమనస్సులోనున్న సన్నలేదు.

వానిమీఁదఁ దన కేందుకీ వైరము? సుశర్మకు సంతానము లేదు. నిరపత్యుఁడై సుశర్మపోయినచో రాజ్యము శ్రీముఖు నకు వచ్చునేమో! కాలమునం దట్లు వ్రాసియున్నచో కానిమ్ము. తానేమి చేయఁగలదు? సుశర్మ యున్నప్పుడు తనకీ యూహలు రావు. ఒకవేళ శ్రీముఖుఁడు సుశర్మ కప కారము భావించినచోఁ దాను ప్రతిక్రియ చేయలేదు. తన నీతి వేయి ముఖములుగా ప్రజ్వలింపఁ జేయగలదు. శ్రీముఖుఁ డేమి? సుశర్మ కెవ్వఁ డపకారము చేయునో వానిని తాను వేయివిధముల హింసించును. శ్రీముఖుఁడదృష్టవంతుఁ డైనచో వాఁడు నిజముగా మగధ సామ్రాజ్యమున కధిపతి గావలసి యున్నచో వాఁడు సుశర్మ తలవెంట్రుకకూడ ముట్టుకోనఁడు. ఆమెకు నిన్ని యూహలనడుమ పలుసార్లు నవ్వు వచ్చు చుండును. ఆ నవ్వునకుఁ గారణము చంద్రరేఖ. చంద్రరేఖ తనకు బంధువు. కొంత దూరపు బంధువు. ఆమె తండ్రి చంద్రరేఖను గిరివ్రజపురము బంపించెను. పద్మరాణి రాజు నకు ప్రియురాలు. ఈమె చంద్రరేఖకు మంచి సంబంధము చూచి వివాహము చేసిపెట్టుటకు సాయపడును. ఏరాజపురుషు నకో చంద్రరేఖ భార్యయైనచో తమ బాధ్యత తీరును. చంద్రరేఖయొక్క యదృష్టముకూడ మఱలునని యామె తలిదండ్రులు చంద్రరేఖను గిరివ్రజపురము పంపించిరి. చంద్ర రేఖ పద్మరాణితోడనే యుండును. చంద్రరేఖ వయసు వచ్చిన బాలిక. ఆమె వచ్చి రెండేండ్లైనది. ఆమె రాజునుఁ జూచి వలచినది. రాజునకు నిత్య పరిచర్య చేయుచుండును. రాజు తనతో నున్నప్పుడు చంద్రరేఖ తనున్న వదలిపోదు.

మహారాజున కిట్టి పరిచర్య చేయవలయును. ఇట్లు గౌరవించ వలయును మొదలైన యుపదేశములు తనకుఁ జేయును. రాజు చంద్రరేఖవంకకు జూడఁడు, ఆ చంద్రరేఖనుఁ దలఁచు కొన్నప్పుడెల్లఁ బద్మరాణికి నవ్వు వచ్చుచుండును. ఆమె పెద్ద యందకత్తె కాదు. విద్యావతి కాదు. అచ్చముగాఁ జదువనిదికాదు. ఆమె శరీరమునందు యౌవనము సమారూఢమై మన్మథుఁడు వింటి త్రాడెక్కువింటి చెవిదాక లాగి బాణము వదలుటకు ప్రతిక్షణ ప్రతీక్ష చేయుచున్నట్లుండును. అంతటి యౌవనము రాజు మనస్సాహరించలేదు. రాజునకు మనస్సులేదు. రాజున కున్నది యొక్క యంతఃకరణమే. అచ్చట తానున్నది. తనతో నొక సువర్ణజ్యోతి యున్నది.

## ౨

కలియుగము పదుమూఁడువందల యేఁబదినాల్గు సంవత్సరములు గడచిన తరువాత శిశునాగవంశములోని యెనిమిదవ రాజైన యుదయనుఁడు భాగీరథీ దక్షిణ తటమునందు కుసుమపురమను నొక పట్టణమును నిర్మించెను. అదియే క్రమక్రమముగా పాటలీపుత్రమను పేర పిలువఁబడుచువచ్చెను. శిశునాగవంశము, నందవంశము, మౌర్యవంశము, శుంగవంశము, కాణ్వాయనవంశముయొక్క రాజులందఱును గిరివ్రజపురమునకే రాజధానిగా మగధములనుఁ బాలించిరి. మగధ

రాజ్యమునకు గిరివ్రజమే రాజధాని. పాటలీపుత్రము కాదే కాదు. కాని చాలమంది రాజులు మఱియు తత్తద్వంశముల చివరి దినములలో భోగపరాయణులైన రాజులు పాటలీపుత్రమునందుఁ బోయి యుండుచు వచ్చిరి. పాటలీ పుత్రమునందు నశోకుని కాలములో ననఁగా కలి ప్రవేశించిన తరువాత పదకొండువందల యేండ్లకు బుద్ధసంఘ పరిషత్తుండెడిది. పాటలీపుత్రముయొక్క ప్రాశస్త్య మంతటివఱకే కాని మగధరాజు విలాసార్థము పోయి పాటలీపుత్రమునందు నివసించుట కలదు. ఆయా వంశముల చివరిరాజులు విలాస పురుషులై రాజ్యపాలన భారమంతయు మంత్రులమీఁద వదలిపెట్టి పాటలీపుత్రమునందు నివసించుటకలదు. శుంగ వంశపు చివరిరాజు వారవిలాసినీ ప్రియుఁడగుటచేత పాటలీ పుత్రమును వదలి విదిశానగరమునందు నివసన మేర్పఱచుకొనెను. భోగపరాయణులైన రాజులకు గిరివ్రజపురమునం దుండుట యిక్కట్టుగా నుండెను. మంత్రియో సేనాపతియో మాటిమాటికిఁ బోయి యీ వ్యవహార మేమిచేయవలయునని యడుగుచుందురు. రాజున్నాఁడు గనుక నడుగక తప్పదు. నిరంత సుఖశీలురకు మాటిమాటికి నీ దర్శనముమాత్ర మెందులకు? పోయి పాటలీపుత్రమునం దున్నచో నీ బెడద కూడ యుండదు. అట్లే యీ కాణ్వాయన వంశపు చివరి రాజైన సుశర్మకూడ పాటలీపుత్రమునందే యుండుచుండెను. కడచిన నాలైదేండ్లుగా నతఁడు గిరివ్రజపురమున లేఁడు. ఈ రాజులు తమ రాజధానియందు లేకపోవుటయు వారి

మంత్రులో సేనాపతులో రాజ్యమును సులభముగాఁ గైవసము చేసికొనుటకు వీలిచ్చుచుండెను. రాజధానిలో రాజు లేఁడు. సర్వాధికారములు నామంత్రివో సేనాధిపతివో యైయుండును. అతఁడే రాజస్థానీయుఁడు. ప్రజలకు రాజుమీఁదఁగల యభిమానము రాజు రాజధానినుండి దూరముగా నున్న కాలము గడచినకొలఁది క్రమముగాఁ దగ్గుచుండును. ఆ మంత్రియందో, ఆ సేనాపతియందో భక్తితాత్పర్యములు వృద్ధిపొందుచుండును. ఈ భావములకు మంత్రి సేనాపతు లిద్దఱు నొక్కఁడే యైనచో ముబ్బడిబలము. ఇట్లుండఁగా జయద్రథుఁడు అనఁగా పులిముగ్గు సాధించినవాఁడు, పాటలీపుత్రమునకుఁబోయి సుశర్మను గిరివ్రజపుర సమీపాటవులకుఁ దీసికొని పోవలసిన యవసరము కలిగెను. ఇది యేమి మానవ ప్రకృతియో సూటిగా, సులభముగాఁ జేసినచో గోరితో తీరిపోయెడి పనికి మొగమోటములుపోయి బెరుకుపొంది యేదో తెలియని యొక మనోవికారమునకు లోనై "అసావాదిత్యో బ్రహ్మ" యన్నట్లుగా నీ ముక్కెదిరా యనఁగా తలచుట్టు వ్రేలు త్రిప్పి చూపించినట్లు సూటిని వదలిపెట్టి యంచె లంచెలుగా వారిచేత వారిచేత నిట్లు తొలఁగి యట్లు మలఁగి గొడ్డంటితో తీర్తురు. జయద్రథుఁడు సులభముగా సుశర్మను సంహరించవచ్చును. శ్రీముఖశాతకర్ణి సంహరించవచ్చును. అట్లే మాటాడినచో నడిగెడివాఁడు లేఁడు. శ్రీముఖుఁడు తానాపని చేయఁడు. దానియంతట నది జరుగవలయును. అపుడు రాజ్యమును సుఖముగా గ్రాసించుటకు వాని కభ్యంతరము లేదు. ఈ జయద్రథుఁడు వేయి [illegible]ల్పనల

మారి. అతఁ డొకని వధించవలయునన్నచో నన్నికాలములయందు, నన్ని దేశములయందు, నన్నివిధముల సంహరింపఁగలఁడు. ఆకాశమునందు సంహరింపఁగలఁడు, భూమియందు సంహరింపఁగలఁడు, పాతాళమునందు సంహరించఁగలఁడు, భూత భవిష్యద్వర్తమానములయందుఁ జేయఁగలఁడు అతనికి సుశర్మ మరణించవలయును. రాజ్యము శ్రీముఖునకు రావలయును. ఆంధ్రులు మగధరాజ్యమునకు చక్రవర్తులు కావలయును. సర్వభారతదేశము వారు కైవసము చేసికొనవలయును. అతని పథకము ప్రకారము, అతని యిష్టము ప్రకారము, ఈ పనికి చంద్రశేఖర శాతకర్ణి పనికిరాఁడు. అతఁడు వైదికుఁడు. వేదమతాభిమాని జయద్రథునకు వేదమతము గిట్టదు. ఆంధ్రులు రావలయును, ఆ యాంధ్రులు వేదమతావలంబులు కాకూడదు. పాప మతని పని మిక్కిలి చిక్కులో పడినది. ఒకనిని సృష్టించుకొనవలసి వచ్చెను. వానిని సృష్టించుటకు సుమా రిరువదియైదేండ్లు పట్టెను. వాఁడు సృష్టింపఁబడినాఁడు. కాని వానియందొక లోపమేర్పడినది. వాఁ డారాజును వధించఁడు. ప్రతివానికి ముద్ద కలిపి నోటిలో పెట్టవలసి వచ్చెను. ఇదిగోరా పంచభక్ష్య పరమాన్నములతో విస్తరి, వడ్డింపఁబడినది. నీ ముందు పెట్టితి ననఁగా వానికి నా భోజనము చేయవలయునని యెంత యాశయున్నదో మనసులోఁ దనంతట తానది తినవచ్చునో తినరాదో యన్న పెద్ద సంశయము. ఈ విస్తరి మనదికాదు. ఇది యెవరికొఱకో వడ్డింపఁబడినది. వాఁడు రాలేదు. ఈ లోపుగా మనము తినరాదు. వాఁడు రాఁడని గట్టిగా తెలిసి

నచో నప్పుడుగాని వాఁడు విస్తరిని దాటఁడు. అట్టి స్థితిలో నున్నది. ఈ భోజనము వీనిచేతఁ దినిపింపవలయునని వంట చేసినవాని యూహ. వాఁడేమి చేయఁగలఁడు? ఎవనికో అకా విస్తరి వడ్డింపఁబడినచో వాఁడు రాకుండ చేయుటయో లేదా వీఁడే ముద్దలు కలిపి వాని నోటిలోనికిఁ ద్రోయుటయో చేయవలసిన బాధ్యత యా సూదకునకుఁ బట్టినది. అట్టి యవస్థలో జయద్రథుఁడు తగుల్కొనెను. ఆరాజును చంపుట యెట్లు? తాను శ్రీముఖునిచేత రాజ్యమును దొంగిలింపఁ జేయలేఁడు. రాజుతో నేదో యొక కృత్రిమ వ్యూహము పన్ని వానిని కత్తివిద్యతో సంహరింపవలెనన్నచో మొదటికే మోసమగును. తన యేశిష్యుఁడు తానుద్దేశించిన భారత మహాసామ్రాజ్యమునకు చక్రవర్తి కావలయునని తానాశించు చున్నాఁడో ఆ శిష్యుఁడే తనకు విరోధి యగును. తాను నేర్పిన కత్తివిద్యతో వాఁడు తన్నెదిరించును. ప్రత్యక్షముగా సుశర్మను జయద్రథుఁడు చంపరాదు. చంపినచో శ్రీముఖుని విరోధినిఁ జేసికొన్నట్లే. తాను చంపినట్లు కాదు. సుశర్మ తనయంతట తాను జచ్చినట్లు చూపింపవలయును. ఎట్లు చూపింపవలయును. ఏదో యొక పన్నాగము పన్న వలయును. పరమ కుత్సితుఁడైనవానికి వంద పన్నాగములు తెలియును. పైగా నటువంటివాఁడు తాను చేసెడి పన్నాగ మును విచిత్రముగా సంతరించును. దానినొక తెన్నువెంట మలయించును. వాఁడొక శిల్పి. భీముఁడు కీచకుని సంహ రించెను. కీచకుని ప్రాణములు పోయెను, వాఁడు శవమై యుండెను. వానిని గుండగాఁ గొట్టుట యెందులకు? ఒకఁ

డొకసిని సంహరించును. గుండెలో పొడిచిన పోటుతో వాని ప్రాణము లిదివఱకే పోయినవి. పైన మఱి వంద పోట్లెందుకు? ఇందులో రెండు కారణములున్నవి. మొదటిది కసితీఱక చేయుదురు. రెండవ కారణము మఱియొకటి. కసితీఱక చేసెడి వాఁడు వట్టి యుద్వేగి. వట్టి యుద్రేకి. రెండవవానికి యుద్రేకమును; నుద్వేగమును తక్కువ. తక్కువ యనఁగా దాని ప్రాకట్యమునందు భేదమున్నది. మొదటివానికి నుద్రేకము ప్రత్యక్షముగా వచ్చి వాని యెదుటఁ గూర్చుండును. వాని మనస్సుయొక్క యుపరిభాగము నావరించి యుండును. రెండవ వాని యుద్రేకము మనసుయొక్క లోఁబొరలలోనుండి సద్యః క్రియారూపము పొందక యాకసిని వన్నెలు వన్నెలుగా తీర్చవలయు ననిపించును. వీఁడొక శిల్పి. ఇది రెండవ మార్గము. జయద్రథు డీ విద్యలో శిల్పి. అతఁడు సుశర్మను వధింప నెంచినాఁడు. ఎట్లు వధించవలయును? రహస్యముగా వధించవలయును. రహస్యముగా వధించుటకు వేయిమార్గము లున్నవి. కాని వానికి దానియందొక వైలక్షణ్యము సంపాదించవలయును. అందుకొఱ కతఁడు పులిముగ్గును నేర్చెను. దానియందు నిష్ణాతుఁడయ్యెను. ఇది నేర్చుట కతనికి నిరువది యేండ్లు పట్టినది. ఈ విద్య యాంధ్రదేశములోనిది. అతఁడు ధాన్యకటకమునందుండఁగా తద్దేశాటవులలో సంచరించు శబరులయందు దీని ప్రసక్తి వినెను. తెలుఁగుదేశమున నన్ని యడవు లతఁడు తిరిగెను. కాని వారందఱు నట్టివిద్య సాధ్యమగునని చెప్పిరేకాని యెవ్వరును దానిని చేసి చూపించలేదు. వారు చెప్పిన మాటలు వారా విషయములో చేసిన ప్రయ

త్నములు సర్వము నతఁడు ప్రోవుచేసికొని మఱియు నితర దేశములకు పోయి బహు మహాటవులు సంచరించి యనేకు లైన యాటవికులవద్ద చిన్న చిన్న యంశములు నేర్చికొని గాలిలోనున్న యీ భావముల కన్నింటికి రూపకల్పనచేసెను. ఇంచుమించుగా నా విద్య యతనికి స్వాధీనమైనది. శ్రీముఖ శాతకర్ణి తోహారుతోఁ గలిసి యీ పులిని వెన్నాడి తన గురువును తెలిసికొనువఱకు నతనికి వెనుకాళ్ళయందు మాన వత్వము లేకుండఁ జేయుట చేతకానంతవఱకే యావిద్యయందు సిద్ధిపడెను. శ్రీముఖశాతకర్ణి తనతో మాటాడి వెడలిపోయిన తరువాత సుశర్మను వధించవలయునన్న భావము వానియందు మఱియు సముద్దీప్తమయ్యెను. వాని కోరికయందలి యీ సముద్దీప్తితో వాని బుద్ధికొక సముదీప్తి భాసించెను. మిగిలిన లోపము వానికి స్ఫురించెను. కొలఁది దినములలోననే యతఁడు సంపూర్ణముగా వ్యాఘ్ర మయ్యెను. కాని యీ వ్యాఘ్రమై పాటలీపుత్రమున కెక్కడఁబోవును? ఈ సుశర్మ పోయి పాటలీపుత్రమునందుఁ గూర్చుండెను. అతని స్వరూప మేమో అతని మనోవృత్తి యెట్టిదో, ఆతని యాశలెట్టివో వానికి తెలియదు. అందుకోసము పాటలీపుత్రమునకుఁ బోయెను. పద్మరాణికి తానెవరో తెలిపికొనెను. పద్మరాణి తండ్రికి జయద్రథునకు స్నేహములేదు. అతని భావములకు గంగాధర శాతకర్ణి భావములకు సంబంధములేదు. జయద్ర థుని పద్మరాణి సరిగా స్వీకరించలేదు. అతఁడు సత్పితుఁడని సత్పురుషుఁడు కాఁడని తన యింటిలోఁ దనకు తెలిసిన విషయము. కాని యతఁడు దుర్మార్గుఁడు. వేయి యెత్తు

లెత్తఁగలవాఁడు. అట్టివానితో ప్రత్యక్ష విరోధము పాటిం చుట కంటె తన సంగతి యేమియు వాని కందించకుండ నైతొలఁగిపోవుట మంచిది. పద్మరాణికి తన భర్త మహా పురుషుఁడని తెలియును. పరమ వైరాగ్యవంతుఁడని తెలి యును. జయద్రథుఁడు రాజును తన వలలో వేసికొనవలె నన్నచో రాజుని కొక తీవ్రమైన యాశ యున్నచోఁగదా వీని యాటలు సాగును! కనుక నామె జయద్రథుని సుశర్మ వద్దకుఁ బంపించెను సుశర్మ జయద్రథునితో నొకవిధముఁగా మాట్లాడెను. అట్టి మాటలు రాజు పద్మరాణితో నెప్పుడు మాటాడి యెఱుఁగడు. అట్టి విచిత్రమైన భావములు సుశ ర్మకుఁ గలవని పద్మరాణికి తెలియదు. జయద్రథుఁడు వచ్చి పద్మరాణితో నీ సంగతి చెప్పెను. పద్మరాణి యాశ్చర్య పోయెను. భర్తవద్దకుపోయి యాతనితో నీ సంగతి ప్రస్తావన చేసెను. ఆయనయు నవ్వుచు 'పద్మా! స్త్రీజాతిలో నీవంటి యందకత్తె మానవులలో నుండదు. ఒక లేఁడివి నీ వైనచో నా యాఁడులేఁడి ఇంత యందముగా నున్నదని చెప్పుటకు వీలుండునా? నీ వొక యాడుపులి వైనచో నిన్ను చూడ వలయునని యున్నది. కాని యగుటకు వీలేలేదు. ఇది యొక యూహ. నే నెంత విరాగినో అంత లాలసుఁడను. నాకు స్త్రీభోగమునందుకంటె స్త్రీగత సౌందర్య దిదృక్ష వేయిరె ట్లెక్కువ యని నీకుఁ దెలియునుగదా?' అనఁగా బద్మరాణి స్వామీ! ఇది యేమి కోరిక? నాకు చిత్రముఁగా నున్నది. నే నాఁడులేఁడి నైనచో మీరు మగలేఁడి కావలయును. నే నాడుపులి నైనచో మీరు మగపులి కావలయును. అనఁగా

రాజిట్లనెను. "సీసీ! నీవు లేడిగా నున్నపుడు నేను నిన్ననుభ వించవలయునని కాదు. నీ వాఁడుపులిగా నున్నప్పుడు నేను నిన్ననుభవించవలయునని కాదు. నీ సౌందర్య మెట్లుండునో చూడవలయుననిమాత్రమే. తుచ్ఛమైన సంభోగమునందేమి యున్నది? సౌందర్యమును చూచి యూహించి మననముచేసి యొక సుఖపారవశ్యము పొందుటలో నున్నంత సౌఖ్యము నాకుఁ దెలిసినంతవఱ కనుభవవేళ నుండదు" అనఁగా బద్మ రాణి యిట్లనెను. ప్రభూ? నేను నిజముగా నాఁడుపులి నైనచో నాకు మీాయం భర్తయన్న యభిజ్ఞానము లోపించు నేమో! నేను మీామీాఁదపడి మిమ్ము సంహరింతునేమో! భర్తను చంపిన పాపము నాకప్పుడు కలుగునుగదా యనెను. రాజిట్లనెను. "ఓసి పద్మా! నీవు నిజముగా పులి కాఁదగిన శక్తి కలదానవువలె మాటాడుచున్నావు. ఆ వచ్చిన సిద్ధుఁడు నీకేమైన మందుమ్రాఁకు లుపదేశించెనా?" యనఁగాఁ బద్మ రాణి యిట్లనెను. స్వామీా! అతనిని నేను విశ్వసించుటలేదు. అతనికంటె మృషావాది సృష్టిలో నుండఁడు. వాఁ డనుములు తినుచు మినుములు చేతిలో పెట్టెడివాఁడు. అంతకంటె తడి గుడ్డలతో గొంతులు కోయఁగలవాఁడని చెప్పినచో యథార్థ ముగును. వాని కావిద్య తెలియుననుచున్నాఁడు. నాకా నమ్మకములేదు. కాని వాఁడేదో యెత్తుమీాఁద వచ్చినాఁడు. వానితో మీారిట్టి ప్రసంగము చేయుదురని నే ననుకొనలేదు. అతఁడు దానిని సులభముగాఁ బట్టుకొన్నాఁడు. అతఁడు మీాకొక మైకము కలిగించినాఁడని నాయుద్దేశము." సుశర్మ:- నాకుఁ గలిగించినవాఁడు నీకుమాత్రము కలిగించలేఁడా'

పద్మ:- నాకుఁ గలిగించలేఁడు. అతనిని నే నెఱుఁగుదును. అతనిని నే నెఱుఁగుదునని యతనికి తెలియదు. అతఁడు పూర్వము ధాన్యకటకములో నుండెడివాఁడు. అప్పటికి నేను చిన్న పిల్లను. కాని రాజధానియంతయు వాని వార్తలతో నిప్పటికిని ప్రత్యగ్రముగానే యున్నది. తమరికిఁ దెలిసియుండ వచ్చును. ఆంధ్రరాజు చంద్రశేఖరశాతకర్ణి. గోముఖశాతకర్ణియని యొకాయన కలఁడు. ఆయన రాజవంశీయుఁడు. ఆయన కుమారుఁడే యీ శ్రీముఖశాతకర్ణి. వీరి కుటుంబమునకును రాజకుటుంబమునకుఁ బడదు. మా నాయన రాజభక్తుఁడు. ఆ రాజ్యము గోముఖశాతకర్ణికి రావలయునని వారి యూహ. తమ మంత్రియైన శ్రీముఖుఁడు చిన్నప్పుడు రాజద్రోహిగా నుండెను. అందుచేత మహారాజు వానిని దేశనిష్కాసితునిఁ గావించెను. సుశర్మ:- శ్రీముఖశాతకర్ణి చాల సత్పురుషుఁడు. అతనికి రాజ్యాశ లేదు. నే నన్నచో నతని కెంతయో గౌరవము. ఎంతయో భక్తి. అతఁడు మా రాజ్యము నపహరించఁడు. అతనియందున్న దోష మొక్కటియే. అతఁడు బౌద్ధుఁడు. అది దోషమైనచో నది యొక్కటియే వానియందుఁగల దోషము. పద్మ:- తమరు చెప్పిన మాటలు కాదనుటకు వీలులేదు. శ్రీముఖుఁడు చాల మాఱిపోయినాఁడు. మాకును వారికిని ధాన్యకటకమునందుఁ బడదు. కాని నే నిచ్చటికి వచ్చినతరువాత నతఁడు నాయందు చూపెడి గౌరవముగాని యింకొక భావముకాని వానియందు నేను దోషారోపణ చేయుటకు వీలుగా లేదు. కాని యీ సిద్ధుఁడు—వాని పేరు జయద్రథుఁడు—అతఁ డేమి పన్నాగము

పన్నుచుండెనో నాకు తెలియదు. అతఁడు నాతో నిట్లు చెప్పెను. ఓయమ్మ పద్మరాణీ! నాకును నీకును విరోధము లేదు. మీ నాయనగారు నన్ను నిర్హేతుకముగా శత్రుపక్షమువాఁ డనుకొనిరి. మీ రాజునకు నే నన్నచో నెంత యిష్టము. అది యందఱకుఁ దెలిసిన విషయమేకదా? నే నొక విధమైన సన్న్యాసిని. నీలాంబరశాతకర్ణి కూతునందు నేను సంతానము కనినమాట నిజమే. అదియొక దుష్టమైన కామ వేళ. ఆమెను వివాహమాడి నన్నా రాజధానిలో నుండ మన్నచో నే నుండఁగలవాఁడనా? నాకు నీ భర్తయైన సుశర్మ మహారాజుమీఁద నొక యభిమానము కలిగినది. అట్లు కలుగుటకుఁ గారణము శ్రీముఖశాతకర్ణి. అతఁడు నాకు శిష్యుఁడు. నీ భర్తయన్నచో నాతని కెంతభక్తియో చెప్పలేను. భార్యగానుండి యొక స్త్రీకి భర్తమీఁద నెంత గౌరవ ముండవలయునని యొక ప్రమాణ మున్నచో రాజు నందు నీకుఁగల భక్తి యాప్రమాణములోనున్నది. మంత్రిగా సేనాపతిగా నుండి రాజుమీఁద నొక వ్యక్తికి నే ప్రమాణములో భక్తి యుండవలయునని యుండునో ఆ ప్రమాణములో శ్రీముఖునకు సుశర్మమీఁద భక్తి యున్నది. ఆ శ్రీముఖునియందలి ప్రేమచేత నే నతనికొక వాగ్దానము చేసితిని. మీ రాజునకుఁగల యొక లోకాతీతమైన వాంఛను అట్టి వాంఛ యతని కున్నచో—నే నది తీర్చిపెట్టఁగలను. అని చెప్పితిని. అందుచేత నిచ్చటికి వచ్చితిని. ఆ కోరిక నీ భర్త వెల్లడించెను. నీ కిష్టమైనచో నీకు నాయందు నమ్మకమున్నచో నేను నిన్నొకపులిగాఁ జేయఁ గలుగుదును.

అప్పుడు నీ భర్త నిన్ననుభవించునో నిన్ను చూచి సంతో షించునో నాకుఁ దెలియదు. అనఁగా నేనిట్లంటిని. "నేను పులినైనపుడు నేను పద్మరాణినని మఱచిపోయి యాయన విస్మరించి నే నాయనకు నపకారము చేసినచో నేమగును? అనఁగా జయద్రథుఁడు "నీ కాభయమక్కఱలేదు. నీ కా జ్ఞానముపోదు. నేను పలుసార్లు వ్యాఘ్రమ నైతిని. నా కన్నులు పెద్దపులి కన్నులవలెఁ గనిపించుచున్నవి. చూచి తివా? నీవు ధాన్యకటకములో నే నున్నప్పుడు చిన్న పిల్లవు. నన్నెఱుఁగవు. ఎఱిఁగినచో నప్పటి నా కన్ను లిట్లుండెడివి కావని నీకే తెలిసియుండెడిది. పెద్దపులి యైనంతనే నన్ను నేను మఱచిపోయినచో మఱల మనుష్యుఁడ నెట్లగుదును? అందుచేత మనలను మనము మఱచిపోము. నీ భర్త వట్టి మానవుఁడుకాఁడు. ఆయన దేవతా పురుషుఁడు. ఆయన కీ కోరిక కలదు. ఆయన కోరికను తీర్చవలసిన బాధ్యత నీకుఁ గలదు. ఇది నా కెందుకనఁగా శ్రీముఖునితో నేనీ వాగ్దానము చేసితిని. అతఁ డడిగినాఁడు. నేను చేసిపెట్టుదు నంటిని. తరువాత నీ యిష్టమనెను. అంతట రాజు పద్మా! అతఁడు చెప్పిన మాటలన్నియు న్యాయముగా నున్నవి. సందేహించ తగినట్లుగా లేవు. నీవు నిజముగా నాఁడుపులి నైనచో నిన్ను నీవు మఱచిపోవు. నన్ను మఱచిపోవు. మఱచిపోవుటకు వీలులేదు. మనము చనిపోయి వేఱొక జన్మ మెత్తుదుము. అప్పుడు పూర్వజన్మ విషయములు మఱచిపోవచ్చును. ఆశలు మొదలైనవి మాత్రమే సంస్కారములుగా నుండును. ఒక జన్మకు రెండవజన్మకు నడుమ చాలకాలము గడచును.

ఆ నడిమికాలము బహు పరభావములచేత ముద్రితమై వెనుకటివానిని విస్మరింపఁ జేయవచ్చును. ఇంకొక శరీ తంత్రములు, ఇంకొక ప్రదేశము, ఇంకొక బ్రదుకు. కొన్నాళ్లు బాల్యము. బాల్యమంతయు నా రెండవజన్మకు సంబంధించిన భావములయుండే మనస్సును బుద్ధియు చర్వణము పొందుటయు మొదలైన హేతువుచేత పూర్వ జన్మముయొక్క జ్ఞానము నశించిపోవుటకు పెద్ద హేతువున్నది. అతఁడు చెప్పెడి విద్య నిజముగా నతనికిఁ దెలిసినచో నీ విప్పుడు స్త్రీవి, పది నిమేషములలో కావచ్చును, నీవు పులి వగుచున్నావు. ఈ పదినిమేషముల కాలములో నిది యంతయు మఱచిపోవుటకు వీలులేదు. ఈ జీవునకు ధారాసంస్కృతియని యొకటి కలదు. ఆ ధారాసంస్కృతిలో నెడములేదు. కనుక ధార తునిఁగిపోవుటకు వీలులేదు. పద్మ:- అయినచో నేమందురు? సుశర్మ:- అతఁడు చెప్పినట్లు చేయుము. పద్మ:- అతఁడు మన మిచటినుండి గిరివ్రజమునకు పోవలయు ననుచున్నాఁడు. గిరివ్రజమునకు కొంత దవ్వున బలిమఠమను నొక పెద్ద కొండగలదు. అవి యన్నియు నడవులు. ఆ ప్రాంతములందు మీరు వేటకు వెళ్ళవలయుననియు, నచట కొన్ని తాత్కాలిక నివాసయోగ్యములైన సౌధములు నిర్మించవలయు ననియు, అచట మనమందఱము పోయి యుండవలయు ననియు నట్టి వెసులుబాట్లు కలిగినచో నతఁడు నాకా విద్య నేర్పి నీకా తృప్తి కలిగించఁగలననియు చెప్పుచున్నాఁడు. సుశర్మ:- అట్లే నేనును వేటాడి చాల దినములైనది. శ్రీముఖునకు వ్రాయుదును. ఆ బలిమఠమును నే

నెఱుఁగుదును. ఆ యడవులలోఁ బులులుండవు. సివంగులు, చిఱుతపులులు, నల్లచిఱుతపులులు, వేఁగోలములు, భల్లూకములు, లేళ్ళు, మొదలైన జంతువులే యా మహారణ్యమున నుండును. అది చాల యందమైనయడవి. పెద్దపులు లుండవు. మన కాభయమక్కఱలేదు. ఉన్నను నేనుండఁగా నీ కేమి భయము? నేనొకసారి ఖడ్గహస్తుఁడనై వేఁట యడవిలో నొక పులి నెదురుఁబడి వధించితిని. నాకు భయములేదు. నీ కంతకంటె భయములేదు.—అనఁగాఁ బద్మరాణి వెడలి పోయెను. రాజును పద్మరాణియు మాటాడినంతసేపు చంద్రరేఖ చాటుగానుండి వినుచునేయుండెను. పద్మరాణి వెడలి పోయినతరువాత చంద్రరేఖ తానుపోయి రాజుతో మాటాడవలయునని యూహించెను. తానిదివఱ కెన్నఁడు మాటాడలేదు. తాను రాజుతో మాటాడినచోఁ బద్మరాణి యేమను కొనునో యని యామెకు భయము. నీవు రాజుతోఁ బోయి ప్రత్యక్షముగా మాటాడవద్దని పద్మరాణి యెప్పుడును చంద్రరేఖతోఁ జెప్పలేదు. కాని యామె ప్రవర్తనము తాను రాజుతో ముఖాముఖి మాటాడుట యిష్టములేని దానివలె తోచును. చంద్రరేఖకు పద్మరాణి సుశర్మల యాంతరమైన విచిత్రమైన స్త్రీపురుష సంయోగ సంబంధము వంటి సంబంధము లేని సంబంధముయొక్క రహస్యము తెలియదు. అది యెవ్వరికిని తెలియదు. రాజుతో చంద్రరేఖ యెదురుపడి మాట్లాడినచోఁ దన యౌవనమునకు సుశర్మ ముగ్ధుఁడై పోవునని యామె యుద్దేశ్యము. అది పద్మరాణికి మాత్సర్య హేతువు కావచ్చును. ఇన్నాళ్ళును చంద్రరేఖను రాజు

మీఁది వాంఛ యొక్కటియే బలముగా నుండెను. పురుషగత్ర మైన స్త్రీవాంఛ యెంత బలముకలది యైనను బలము లేనిదే. ఒక హేలచేత, ఒక యాకేకర ప్రసారముచేత, యొక కిలికించిత స్ఫూర్తిచేత, యొక విసురు నడకచేత, యొక పయ్యెదచెంగు యొక్క విదలించుటచేత, యొక నడకలోని తిర్యక్ప్రసారము చేత సూచింపఁబడవలసినదే కాని యీ వాంఛ క్రియాభి ముఖము కానేకాదు. అంతకంటె సాహసించనులేదు. ఇప్పుడు చంద్రరేఖకు రాజుయొక్క జీవితమునుఁ గూర్చి భయము కలిగెను. ఈ భయము తద్వాంఛకంటె బలము కలది. ఆమె సాహసించి రాజునెదుట రెండు మూఁడుసార్లు నటు నిటు తిరిగి చివరకు రాజుతో నిట్లనెను. “మహారాజా! నే నప్రస్తుత ప్రశంస చేయుచున్నానేమో నాకు తెలియదు. నా కంతటి యధికారము లేదని నాకు తెలియదు. ఈ సంగతి నేను పద్మరాణితో చెప్పినచో నామె నన్ను పరిహసించును. ఆమెకులేని యాదుర్దా నా కుండవలసిన యవసరములేదని తమ రందురేమో నాకు తెలియదు. కాని నా మనస్సులో నున్న యావేగము నాది. అందుచేతఁ జెప్పవచ్చితిని. సుశర్మ:- నీ మనస్సులోని యావేగమెట్టిది? చంద్ర:- నేను చెప్పఁబోయెడి విషయము ప్రభువులు చిత్తగించకుండఁగనే నన్ను విషప్రశ్న వేయుచున్నారు. సుశర్మ:- నేను వేసెడిది విషప్రశ్నయైనచో నీ యావేగములో నొక యమృత ముండ వలయును.—రాజిట్లు మాటాడువఱకు చంద్రరేఖ నిలువలేక పోయెను. ఈ రాజున కెంత వాక్చాతుర్యముకలదు? ఆ రాజును పద్మరాణి యెంత ప్రేమించుటలో దోషమేమి

యున్నది? ఆతనియందుఁ దనకుఁగల ప్రేమకూడ నయోగ్య
స్థాన ప్రవర్తితముకాదు. కాని రాజునకుఁ దానేమి సమా
ధానము చెప్పవలయును? అనుకొని యిట్లనెను. "మహారాజా!
ఈ జయద్రథుఁడన్న పురుషుఁడు విశ్వసనీయుఁడు కాఁడు.
అతఁడు తమరికేదో యాపదనెంచి యీ యెత్తు నెత్తినాఁడు.
నేను పరిచారికను కాను. కాని నా స్థానము పరిచారికా
స్థానమునకంటె మించినది కాదు. నా తండ్రి పేదవాఁడు.
పద్మరాణితో మాకు చుట్టరికము కలదు. ఆమె దయావంతు
రాలు కనుక నన్నిచ్చట నుండనిచ్చుచున్నది. నన్నడిగినచో
నే ననెడుమాట తమకిఁ గోపహేతువు కానిచో మీ మహా
మంత్రికూడ యీ వ్యూహమునందు సంపూర్ణముగా లేని
వాఁడని చెప్పుటకు వీలుండదు. ఆ యిద్దఱు కలిసియే యీ
యెత్తుగడ నెత్తిరని నా యూహ. కానిచో జయద్రథుఁడే
దీనిని భావించినను శ్రీముఖుఁడు దీని నెఱుఁగనివాఁడని యను
కొనుటకు మాత్రము వీలుండదు. మా తండ్రి పేదవాఁడైనను
మేమును శాతకర్ణులమే. గోముఖశాతకర్ణి వంశముయొక్క
లక్షణములు నాకునుఁ దెలియును. జయద్రథుఁడు మంచి
వాఁడు కాఁడని మా నగరములో పసిబిడ్డ బాలాదికిఁ దెలి
యును. నీలాంబర శాతకర్ణియని యొక సత్పురుషుఁడుకలఁడు.
ఆయన కూతు నీజయద్రథుఁడు మోసము చేసెను. ఆమెయం
దితని కొక కొడుకు కలిగెను. ఆమెను వివాహమాడలేదు.
అందుకనియే రాజతనిని వెడలనడచెను. ఇతఁడట్టివాఁడు.
తన్ను నమ్మిన స్త్రీని యర్థాంతరముగా నట్టడవిలో దించి వదలి
పెట్టి పోయెడివానికంటె దుర్జనుఁడని సృష్టిలో నుండునా?

వాని కొక మంచి యూహ వచ్చునని యనుకొనుటకు వీలుం డునా? అతనిని నమ్ముటకు వీలులేదు. నే నీ మాటలు తమరితో నన్నానని కాని తమరితో నెదుటఁబడి మాటాడితి నని కాని మా పద్మరాణిగారికి తెలిసినచో నామెకుఁ గోపము రావచ్చును. మీరు నా మాట మన్నించక బలి మఠమువద్ద నిర్మింపఁబోయెడు మృగయాసౌధములకు వెళ్ళి నచో నే నచ్చట నుండ వాంఛించుచున్నాను. ఈ మాటలు పద్మరాణికి తెలిసినచో నన్నంతిపురమునుండి వెడలఁగొట్టును. నేనుకూడ బలిమఠమువద్ద నిర్మింపఁబడఁబోవు సౌధములకు పద్మరాణితో రావలయును. మీయొద్దనే యుండవలయును. నా చేతనైనంతవఱకు మీ కతఁడు చేయఁబోవు నాపదనుండి మిమ్ము రక్షించుటకు దైవదుర్విపాక వశమున నతఁ డేదైన నాపద కలిగించినచో దానికిఁ బ్రతీకారము చేయుటకు నే నచ్చట నుండితీరవలయును. ఇది నా యభ్యర్థన. ఒకవేళఁ దమ రచ్చటికిఁ బోవునపుడు పద్మరాణి నన్ను గిరివ్రజమున దిగవిడిచి పోదు నను నేమో! కాదు. చంద్రరేఖ మనల ననుసరించి రావలయునని తమరు చెప్పవలయును. సుశర్మ:- నే నట్లు చెప్పినచో పద్మరాణికి నేను నిన్నెఱిఁగినట్లు తెలి యును కదా?—అనఁగాఁ జంద్రరేఖ ఈ రాజు విచిత్రమైన వాగ్వృత్తి కలవాఁడు. ఇతఁ డేమాట మాటాడినను మూల రహస్యమును వెలికిఁ దీయుచున్నట్లు మాటాడును.—అనుకొని యిట్లనెను. "మహాప్రభూ! ఆమె యట్లన్నచో నామెతో నేను మహారాజున కెదురుపడి నేనే యభ్యర్థింతు నందును. అప్పుడు తమరిని వచ్చి నేను మఱల యభ్యర్థింతును. అపుడు

తమరు చెప్పవచ్చును. ఆ యనుమాన ముండదు. సుశర్మ:- ఇంతకు నీ మనస్సులోనున్న యావేగ మెందుకు కలిగినది? నా ప్రశ్న విషప్రశ్న యగుటకు నీ హృదయములోని యమృత మెట్టిది? నీవు నా రాణియొక్క చుట్టమవు. నీ పేరేమి? చంద్ర:- నా పేరు చంద్రరేఖ. సుశర్మ:- నీ పేరు చంద్రరేఖకాదు. చంద్రరేఖ నీయంత బిగువుగా నుండదు. అది బిగువో సడలో దూరపు టాకాశమున తదియ చతుర్థుల నాఁడు కనిపించెడిదానినిఁబట్టి మన కెట్లు తెలియును? ఏదో సన్నని తెల్లని మొయిలు వంకర తిరిగినట్లున్న జాబిల్లిని నీ శరీర సౌష్ఠవమునకు పోల్చుట నా కిష్టములేదు. నీ వొక బంగరు శలాకవంటిదానవు. నీ సౌందర్యము నేత్రాభిరామముగా నున్నది. నీవు సాక్షాచ్ఛ్రీదేవివి.—అనఁగాఁ జంద్రరేఖ కళవళంపడెను. మడమలు విఱుగఁద్రొక్కుకొను చుండెను. నిలువలేకపోయెను. రాజిట్లనెను. "నేను నిన్ను ప్రేమించుచుంటి ననుకొనుచుంటివా? ప్రేమించుటలేదు. కాని ప్రేమించుచున్నాను. నీది సౌందర్యముకాదు. నీది యౌవనము. అందుకనియే నిన్ను శ్రీదేవివంటిని. శ్రీ యనఁగా సమృద్ధియని యర్థము. యౌవనముయొక్క సమృద్ధి నీయం దున్నది. శ్రీదేవి యౌవనమున నీ విషయములో సంపూర్ణావతారము తాల్చినది — చంద్రరేఖ యచటనుండి పాఱిపోయెను.

# ౭

నీలాంబరశాతకర్ణి దౌహిత్రుఁడు జయద్రథి కుమారుఁడు తానుకూడ శాతకర్ణిగానే చెప్పికొనుచుండెను. తండ్రి యెవఁడో వాని వంశమేదో ధాన్యకటకములో నెవ్వరికినిఁ దెలియదు. అతఁడు క్షత్రియుఁడు. సింధుదేశస్థుఁడు నన్న మాటమే యంత వెలిఁగినది. గురువుగారన్న పేరు సర్వత్రా వ్యాప్తి బొందినది. అతని పేరు జయద్రథుఁడన్న సంగతికూడ యెవ్వరికినిఁ దెలియదు. శ్రీముఖశాతకర్ణికిఁ దెలియును. జయద్రథికిఁ దెలియును. జయద్రథి తన కుమారునకు జయద్రథుఁడని నామకరణము చేసెను. నామకరణము చేసెననఁగా నది యొక సంస్కారము జరుగలేదు. తన పేరే కొడుకునకు పెట్టికొనెనని జనులనుకొనిరి. కాని వాని తండ్రిపేరు జయద్రథుఁడై యుండునని యెవ్వరు నూహించలేరు. ఈ చిన్న జయద్రథునకుఁ బదునాలుగేండ్లు వచ్చినవి. తత్పూర్వము కొంచెము కొంచెముగాఁ దెలిసిన తన తండ్రియొక్క యవిజ్ఞతయు, తనయొక్క సాంఘిక దుర్బలత్వమును వానికి నాఁటికి దృఢపడి తండ్రినిఁగూర్చి సరియైన వర్తమానము దెలిసికొనవలయునని యతఁ డెచ్చట నుండెనో కనుఁగొనవలయునని ప్రయత్నములు ప్రారంభమయ్యెను. ఆ ప్రయత్నములు దగ్గఱలోనున్న గ్రామములకుఁ బోవుట సమీపారణ్యములకుఁ బోవుటతో మాత్రము నాల్గేండ్లు గడచినవి. ఈ నాలుగేండ్లలో నతనికిఁ బలు విషయములు తెలిసినవి. అతని తండ్రి యెక్కువ శబరులతోఁ

దిరిగెడివాఁడు. వారి గూడెములలోనే యెక్కువ యుండెడి వాఁడు. వారి మాయలు మందులు ప్రూఁకలు వానికిఁ బాగుగాఁ దెలియును. అతఁడన్నచో వారందఱకు మిక్కిలి గౌరవము. వా రతనివద్ద నెన్నియో విద్యలు నేర్చికొనిరి. కొన్ని పెద్ద సవరగూడెములలో వానికిఁ బ్రత్యేకమైన నివాస గృహములు కలవు. కాని యతనినిఁ గూర్చిన నిశ్చయమైన వార్త వానికిఁ దెలియలేదు. ఎచ్చటికిఁ బోయెననఁగా నచ్చటికిఁ బోయెనని చెప్పెడివా రెవ్వరు లేరు. వారికి చెప్పుట కిష్టములేదా. ఇతనికిఁ జెప్పఁగూడదని యున్నదా. ఇట్లుండఁగాఁ జిన్నజయద్రథునికి పదునెనిమిదేండ్లు వచ్చినవి. ధాన్యకటకములో నతనిస్థితి బాగుగాలేదు. అతఁడు శాతకర్ణి వంశములోనివాఁడే. తండ్రి యెట్టిడైనను తల్లి రాజవంశీయు రాలే. నీలాంబరశాతకర్ణి పేదవాఁ డగుటవలన వారు వెలి వేయఁ బడుటవలన వారి బ్రదుకు ధాన్యకటకమున దుర్భరము గానే యుండెను. కాని జయద్రథుఁడు పెరుగుచున్నకొలఁది వాని పట్టుదలయు వాని సూక్ష్మమైన వివేకమును వాని యంతట వాఁడు చదివి తెలిసికొనిన విషయములలోని తీవ్ర తయు నతఁ డన్నచో ధాన్యకటకమునఁ గొంత గౌరవము కలిగెను. అతఁ డందఱి యిండ్లకుఁ బోవును. అందఱు నతనిని గౌరవింతురు. సామాన్యమైన ప్రేమ ప్రకటింతురు. అతనితోఁ గలిసి భోజనము చేయరు. అతని తల్లి సమాజము లోనికిఁ బోదు. అతని తాతగారు వృద్ధుఁడు. ఏదో యున్న గంజి త్రావుచు బ్రదుకుదురు. జయద్రథుఁడు వయసు వచ్చినకొలఁది నాజానుబాహువు. వృషస్కంధుఁడు, విశాల

నక్షుస్కుఁడు, తీవ్రదృష్టి, యంతర్భావనా నిశిత నేత్రాంశుఁడునై యుండెను. అతని నెవ్వరు సులభముగాఁ దిరస్కరించుటకు సాహసించరు. వీనితోఁబాటతఁడు కాంతారములందుఁ దిరుగుటయు శబరులవద్ద నున్న మందుమాకులు నేర్చుటయు వానితో నప్పుడపుడు వ్యాధిగ్రస్తులకు గాలిచేష్ట తగిలినవారికి సహాయపడుటయు వానికి సంఘమునం దొక శాఖలో మంచి గౌరవమే యేర్పడెను. సత్కులములందు కూడ శిశువులకు చిన్న చిన్న రుగ్మత లేర్పడినచో నతని చికిత్స ఫలవంతముగానుండి నతనికి సర్వ గృహములయందు స్వాగతి నెఱపఁబడుచునే యుండెను. అతని పరోక్షమునఁ బలుబంది వానినిఁగూర్చి ప్రశంసించికొందురు. ఏనాఁడో జరిగినదానినిఁ గూర్చి వానికి వెలి యేమందురు. అయినను పదిమంది పెద్దవాండ్రు కలిసి యీ వెలిని తిరస్కరించి ప్రవర్తించినచోఁ గాదనెడువారుండరు. ఆ సాహస మెవ్వరును చేయలేరు. నిజాని కతని వెలి వెలిగా లేదు. ఇంతియేకాక చిన్న జయద్రథుఁడు ఖడ్గవిద్యలో నెట్లు నేర్చెనో చాల నైపుణ్యము సంపాదించెను. అతఁడు వానివద్ద నేర్చికొనెను అని చెప్పుటకు వీలులేదు. వారితో వారితోఁ గలిసి యభ్యాసము చేయు వేళల నతనికి సహజముగానే యావిద్య వచ్చెను. అతని తోడివారు కత్తివిద్యలో వానిముందు నిలువలేకుండిరి. అందఱును వానికావిద్య తన తండ్రివద్దనుండి యనభ్యస్తముగానే సంక్రమించినదని చెప్పికొనఁజొచ్చిరి. అతనికిఁ గ్రమక్రమముగాఁ దాను ఖడ్గవిద్యా నిపుణుఁడనని తెలిసెను. తన వలన సంఘమునకుఁ గొంత మేలు జరుగునని తెలిసెను

తనకు సంఘములో తన స్వశక్తి హేతువున గౌరవము కలదని తెలిసెను. ధాన్యకటకములో నింకొక సంగతి తెలిసెను వాని తండ్రి సుందరాకృతి కాఁడు. ఇతఁడు సుందరాకృతి. తండ్రి యెవ్వరితోడను మాటాడెడివాఁడు కాఁడు. ఇతఁ డందఱితో కలిసికట్టుగా నుండును. తండ్రి కన్నులలోఁ గ్రౌర్యము కని పించు చుండెడిది. ఇతని కన్నులలో నైశిత్యమున్నను దాని కిబ్బడిగా ప్రసన్నత యుండును. ఇతనికి శాతకర్ణి వంశలక్షణ ములు వచ్చెనుగాని యా సైంధవుని దుర్లక్షణములు రాలేదు. ఇతఁడు తన ఖడ్గవిద్యచేత నప్పుడప్పుడు ధనముకూడ సంపా దించెడివాఁడు, ఇతఁడుపోయి యేదైన నడిగినచో లేదన్న మాట లేదు. చంద్రశేఖరశాతకర్ణి వీనినిఁ బిలిపించి యొక యుద్యోగ మీయవలయుననికూడ యనుకొనుచుండెనన్న వార్త పుట్టినది. అట్టి స్థితిలో నతని మనసులో నిదివఱకున్న వాంఛ తీవ్రమయ్యెను. ఆ వాంఛ యేమనఁగాఁ దన తండ్రిని కనుఁ గొనవలయును. అతఁడు తన తల్లికిచేసిన యవమానమునకుఁ బ్రతిక్రియ జరుపవలయును. ఆ ప్రతిక్రియయొక్క స్వరూపము వానికిఁ దెలియదు. అతఁడు సర్వదా యిట్లనుకొనెను. తన్ను చూచి తన తండ్రి సంతోషించును. తనతో ధాన్యకటక మునకు వచ్చును. తన తల్లి సంతోషించును. తన పలుకుబడి వలన తన కులముమీఁదఁగల యాంక్ష తొలఁగిపోవును. తమయందలి దోషము పరిసిపోవును. అతని కెప్పుడు దీనినిఁ గుఱించి యోజించినను వానియూహ లిట్లే యుండును. ఎప్పు డైన నొకసారి తన తండ్రి వచ్చుటకు నిరాకరించినచో నేమి చేయవలయునని యూహ. తాను తనతండ్రితో నుండిపోవును.

ఇదియొక యూహ. తండ్రిని బలవంతముచేసి తా నింటికిఁ దీసికొని పోవచ్చును. ఇదిమఱొక యూహ. తండ్రి రానిచో వానినిఁ గత్తి యుద్ధమున నోడించి జయించి జితుఁడైన తండ్రి నింటికిఁ గట్టితెచ్చి వాని క్షమాపణము తానుకోరును. అప్పుడు తండ్రి తన్ను క్షమించును. ఇది వేఱొక యూహ. తన తండ్రి మహా ఖడ్గవిద్యా వేత్త యందురు. అతని రక్తము తన రక్తనాళములయందు ప్రవహించుచున్నది కనుకనే తన కీ విద్య యింత సులభముగా వచ్చెను. అట్టి తండ్రిని తాను గెలువఁగలఁడా? గెలువలేఁడు. అప్పుడేమి చేయవలయును? తండ్రి విద్య నేర్చికొన్నది. తన విద్య సహజముగా వచ్చినది. తాను తన తండ్రిని నిస్సంశయముగా గెలువఁగలఁడు. లవకుశులు రాముని యుద్ధములో గెలిచిరని కథలు చెప్పుదురు. రామునియొక్క విద్య నేర్చికొన్నది. గాధిజుఁడు చెప్పినది. లవకుశులవిద్య స్వతస్సిద్ధమైనది. అందుచేత కుశుని యాయుధ విద్యముందు రాముఁడే నిలువలేకపోయెను. అట్లే తన తండ్రి తనముందు నిలువలేఁడు. ఇదియొక యూహ. మహారాజైన చంద్రశేఖరశాతకర్ణి వాని నొక చిన్న సేనానిగా నియమించినట్లు వార్త వచ్చెను. అతఁ డుద్యోగములో చేరవలయును. అతఁడప్పు డుద్యోగములోచేరి లోకసామాన్యముగా నుండిపోవుటయా? తండ్రిని వెదకుటకొఱకు తన ప్రతిభచేత దర్శన మిచ్చుచున్న యీ సుఖమైన లోకయాత్రకు స్వస్తిచెప్పి వెళ్ళిపోవుటయా? చివఱకు కతనికి తండ్రిని వెదకఁబోవుటయే యుత్తమ మార్గమని తోఁచెను. ఒకనాఁటి రాత్రి తల్లికిఁ జెప్పకుండ వెడలిపోయెను.

ధాన్యకటకమునకు చాల దవ్వననున్న — దవ్వన ననఁగా గోదావరీనది దాటి మహేంద్ర తనయను దాటిపోయిన నొక మహాటవిలో నొక వృద్ధుఁడైన కోయవాఁడు కలఁడు. వానికిఁ దన తండ్రివార్త వాఁడు చెప్పినదానికంటె నెక్కువ తెలియు నని యితఁ డనుకొనెను. వాఁడు చెప్పుటలేదు. ఎందుకు చెప్పుటలేదో వీనికిఁ దెలియలేదు. అందులోని రహస్యముఁ దెలిసికొనవలయునని యితఁడు చాలసార్లు ప్రయత్నించెను; ఎంతసేపటికి వాఁడి ట్లనును. "నీకెందుకయ్యా? నీవు సుఖముఁగా నున్నావు. క్రమముగా నిన్ను నీ రాజవంశములో నొకఁడుగా స్వీకరింతురు. మీ తండ్రి యొక బైరాగి. అతని బ్రతుకు వేఱు. నీ దారిని నీవు పొమ్ము." అనుటయే వాఁడు చెప్పు చుండెను. ఇన్నాళ్ళును చిన్న జయద్రథుఁడు దానినిఁగుఱించి పట్టించుకొనలేదు. ఇప్పుడు వానినుండి యీ రహస్యమును తెలిసికొని తీఱవలయునని నిశ్చయించుకొనెను. ఉద్యోగ ములోఁ జేరినచో నతనికి బాల్యమునందుండియు నున్న యీ యూహ తండ్రిని తెలిసికొనవలయునన్న యూహ సంపూ ర్తిగా వెనుకఁ బట్టును. ఇది పరీక్షాకాలము అందుచేతఁ నతఁ డుద్యోగమును వదలి, తల్లిని వదలి తానేమనికిగా మను చున్న తాతను వదలి వెడలిపోయెను. కృష్ణానదిని దాటెను. గోదావరిని దాటెను. వంశధారను దాటెను. మహేంద్ర తనయను దాటెను. అకాంతారములోనికిఁ బోయెను.

నా తండ్రినిఁగుఱించి చెప్పుము. నాకు రాజుద్యోగ మిత్తు ననాఁడు. నేను దానిని వదలిపెట్టి వచ్చితిని. నా తండ్రి యొక్క వార్త తెలిసికొనిగాని నేను తిరిగి యింటికిఁ బోను.

అవసరమైనచో నింటికేపోను. నా తండ్రితోడనే యుందును. నా తండ్రి యేమి చెప్పినచో నది చేయుదును. అనఁగా నా వృద్ధుఁడైన శబరుఁడు నీ తండ్రి యేమి చెప్పనో నీవు చేయుదువని నాకు ప్రమాణము చేయుము. అప్పుడు నీ తండ్రివార్త నీకు చెప్పెదను అట్టి ప్రమాణము నీవద్ద తీసికొని నీ తండ్రి తన వార్త నీకు చెప్పుమని నా కాదేశించెను."

అనఁగా చిన్న జయద్రథుఁడు తటపటాయించెను. తండ్రి యట్లు చెప్పుటకుఁ గారణమేమి? అతఁ డేమి చెప్పును? తా నాచరించరానిది తన తండ్రి చెప్పునా? ధాన్యకటకమునఁ దన తండ్రి పదియేండ్లు పైన నుండెను. అతఁడు చేసిన దుర్వృత్తి యేమియులేదు. తన తల్లినిఁ బాడుచేసె నందురు. ధాన్యకటకమున నతఁ డింకొక స్త్రీ నెఱుఁగఁడు. అతఁడు జారుఁడు కాఁడు. మహాయోధుఁడు. అతనికి వేఱె దుర్వృత్తి యెట్లుండును? అతనివలన నున్న దోష మొక్కటియే. తన తల్లిని పెండ్లాడి ధాన్యకటకములోనుండి పోయినచో నతఁ డెంతటి గౌరవభాజనుఁ డయ్యెడివాఁడు. ఏదో వైరాగ్యము వాని హృదయమును పట్టి లాగియుండును. తాను చూడ లేదా? అచట రాజోద్యోగము స్థిరముగాఁ గనిపించు చుండఁగా దానిని వదలి తన తండ్రినిఁ దెలిసికొనవలయునని బయలుదేఱలేదా? అట్లే యా తండ్రికే తీవ్రమైన యాశ కలదో ఒక దైవదుర్విపాకవశమున వానికిఁగూడ దనతండ్రినిఁ గూర్చి యిట్టి యాపదయే కలదేమో? ఇది వంశ పరంపరగా వచ్చుచున్న దోషమేమో! — ఇంత విచారించి చిన్న జయద్రథుఁడు తచ్ఛబర వృద్ధునకు తండ్రి చెప్పినట్లు

చేయుదునని వాగ్దానము చేసెను. ఆ వాగ్దానము వట్టి వాగ్దానము కాదు. అదియొక యాటవిక సమయము. ఆ ప్రతిజ్ఞను దొలఁగినచో వాని శవమును అడవి కుక్కలు పీకికొని తినును. శవమును కాదు, వానినే యడవి కుక్కలు బ్రదికి యుండగనే పులిని తఱిమినట్లు తఱిమి చీల్చి ముక్కలు చేయును. ఇంత తీవ్రమైన ప్రతిజ్ఞ యెందుకని జయద్రథుఁ డడిగెను. అతఁడు 'నీ తండ్రి నన్నిట్లు చేయుమన్నాఁడు. చేసినచో నీ వంగీకరించినచోఁ దన వార్త నీకు చెప్పుమన్నాఁడు. అంతకంటె నాఁకు దెలియదు. ఆ శబరుఁడు వానిచేత నీ ప్రమాణము చేయించుటకుఁ బెద్ద తతంగము చేసెను. అటవిలోని కొన్ని యోషధులు మనుష్యాస్థులు శ్మశానగత భస్మము కపాలములు, కేశఖండములు. ఎఱ్ఱనీళ్లు, సున్నము, పసుపు, వాని గుడిసెలో నేలమీఁద గీసిన కొన్ని వికారపు బొమ్మలు వాని నడుమ నీ జయద్రథుని కూర్చుండఁబెట్టి యీ ప్రమాణములు చేయించెను. జయద్రథునకు వీని యన్నిటియందు జుగుప్స కలిగెను. ఇట్టి దుర్వ్యవసాయముచేత నిట్టి ప్రతిజ్ఞ చేయించిన తండ్రి ప్రవృత్తి యెట్టిది? ఇది యీ కోయవాఁడు చేసిన దేమో! తండ్రి ప్రమాణము చేయించుమన్నాఁడు. ప్రమాణము చేయుటయనఁగా వీని యుద్దేశ్య మెట్టిది? ఈ దోషము తండ్రిది కాకపోవచ్చును. ఇంత దవ్వు వచ్చెను. తానా ముగ్గులోఁ గూర్చుండెను. వెనుకాడుట యెందులకు? అతఁడు ముందునకు దూఁగెను. ప్రమాణ మైపోయెను. ఆ కిరాతుఁడు జయద్రథునితో నిట్లు చెప్పెను. "ఈ ప్రమాణమైన తరువాత నీవు మఱల ధాన్యకటకమునకుఁ బోరాదు. నీ వడవుల

లోననే యుండవలయును. నీ తండ్రి నీ కింక మూఁడేండ్లకుఁ గనిపించును. మగధదేశమునందు గిరివ్రజపురమునఁ గొంత దవ్వున బలిమరమను నొక పర్వతముకలదు. దాని పైనఁ బడిపోయిన కోట గోడలు కలవు. తత్ప్రాంతమంతయు మహాటవీ ప్రదేశము. ఆ యడవులలో నీ తండ్రి తిరుగు చుండును. నీ తెలివితేటలనుఁబట్టి నీవచ్చటకుఁబోయి వానినిఁ గనుఁగొనవలయును. ఆ తండ్రి మానవుఁడుగా నుండునో మఱియొక మృగముగా సంచరించుచుండునో తెలియదు. మృగ మనఁగా నొక పెద్దపులి కావచ్చును. సింహము కావచ్చును.” అనఁగా జయద్రథుఁడు మనుష్యుఁడు పెద్దపులి యెట్లగునయ్యా? నీ వన్నమాటలు నా కర్థమగుటలేదు. అడవులలో ననేక వ్యాఘ్రము లుండును. వానిలో నొక వ్యాఘ్రము నా తండ్రియని తెలిసికొనుట యెట్లు అనఁగా శబరుఁడు “ఆ యడవిలో వ్యాఘ్రము లుండవు. ఉన్నచో మీ తండ్రి యొక్కఁడే యుండును. అతఁడే వ్యాఘ్రముగా నుండును. అనఁగా నా యడవిలోనున్న యొక్క పెద్దపులియు మీ తండ్రియన్నమాట. అనెను. అనఁగా జయద్రథునకుఁ గోపము వచ్చెను. “ఓరి ముదివగ్గా! నన్ను మోసముచేయు చున్నావా? పులియేమి? నా తండ్రియేమి? నీవు నాచేతఁ జేయించిన ప్రమాణమేమి? నే నెవ్వఁడ ననుకొన్నావు? నే నచ్చమైన సూర్యవంశ క్షత్రియుఁడను. వేద వేదాంగ వేత్తలైన శాతకర్ణుల రక్తము నా శరీరములోఁ బ్రవహించు చున్నది. కత్తితో నీ తల తఱిగెదను. నిజము చెప్పుమనెను. ఆ వృద్ధుఁడు నవ్వి యిట్లనెను. “నాకుఁ దెలిసినంతవఱకు

నీకును నీ తండ్రికిని జూపఁగదు. నీవు చేసిన ప్రమాణము నీ కాపద్ధేతువగును. నిన్ను రేచుకుక్కలు పీకికొని తినును" అనఁగా జయద్రథుఁ డిట్లనెను. "ఓరీ! నేనేమి యాటవికుఁ డను కాను. శబరమంత్రములు నన్నేమియు చేయలేవు. వానియందు నాకు విశ్వాసములేదు. విశ్వాసము లేనివాని నిట్టి వేమియుఁ జేయలేవు. ఇట్టి క్షుద్రవిద్యలు నామీఁదఁ బనిచేయవు. నా సంగతి నీకేమి తెలియును? నిజముగా నా తండ్రియే నిన్నిట్లు చేయుమని యాజ్ఞాపించినచో నా తండ్రికిఁగూడ నా సంగతి తెలియదు." అని జయద్రథుఁడు వెడలిపోయెను. ఆంధ్రదేశము దాటి కళింగములయందు కొన్నాళ్ళు వసించెను. కొన్నాళ్ళోఢ్రదేశ కాంతారములం దుండెను. మఱికొన్నాళ్ళు వంగదేశపు టడవులలో నివసించెను. మూఁడేండ్లు లెక్కచూచికొనెను. అప్పుడు మగధ దేశములకుఁ బోయెను. బలిమశమును వెదకెను. ఆ కాంతారములు చేరెను. అతనికి నచ్చోటఁ బెద్దపులియని కనిపించ లేదు. వాఁడు చెప్పినది నిజమే. ఈ యడవిలోఁ బెద్దపులులు లేవు. ఒక పెద్దపులి కనిపించినచో నది తప్పకుండ తన తండ్రి కావలయును. అతఁ డాశ్చర్యపడుచుండెను. ఇదియేమి చిత్రమైన సన్నివేశము. అతఁడు కడచిన మూఁడేండ్లుగా నడవులలోననే నివసించుటచేత వానికి బలిమశకాంతారమున నుండుట కష్ట మనిపించలేదు. అడవులలో నేది యేది తిన వచ్చునో వానికిఁ దెలియును. ఎచట సురక్షితముగా నిదుర పోవచ్చునో వానికిఁ దెలియును. వలసిన వస్తువులు దూరమునందున్న కొన్ని పల్లెలనుండి కొని తెచ్చికొనవచ్చునని

వానికిఁ దెలియును. దానికి ధనము కావలయునని వానికిఁ దెలియును. ఆ ధనము సంపాదించుమార్గము వానికిఁ దెలియును. ఎండబెట్టిన యిప్పపూవులు, ఇప్పపూఁదేనె, దుప్పి కొమ్ములు, చాయపప్పు మొదలైన వస్తువులు తీసికొనిపోయి యరణ్య ప్రాంతములందున్న పెద్ద పల్లెలలో నమ్మినచోఁ గొంత ధనము వచ్చును. అతని చేతిలోఁ గత్తికలదు. అతఁడు పరువెత్తు దుప్పి వెంటఁబడి పులివలె దానిమీఁద లంఘించి దానినిఁ బొడిచి చంపఁగలఁడు. ఎదురుపడిన భల్లూకము నోటిలో నెడమచేతిలోనున్న కఱ్ఱను చొప్పించి దాని ముంగాళ్ళ నఖములు ఖండించఁగలఁడు. అతనిని వనజంతువు లేమియుఁ జేయలేవు. ఆ యడవిలో వానికి పులి కాలిగుర్తు లెచ్చటను కనిపించలేదు. రేచుకుక్కల, లేళ్ళ, సివంగుల, వేఁగొలముల, మనుబోతుల, మహిషముల గిట్టల గుర్తులు సమృద్ధిగా నెచ్చటఁబడిన నచ్చట నున్నవి. మానిసి పాదచిహ్నము కనిపించదు. వ్యాఘ్రము పాదచిహ్నము కనిపించదు. ఒకనాఁడు తన కాలి గుర్తులుకానిమానిసి కాలిగుర్తులు వానికి కనిపించెను. చిన్న జయద్రథుడు తా నడవులలో మూఁడేండ్లు తిరిగెను. అతనియం దొక వనజంతు స్వభావము వృద్ధిపొందె నని చెప్పవచ్చును, అడవి మృగములు కొన్ని పెఱ మృగముల కాలి గుర్తులను మూఁజూచుచు వాసనబట్టి యా మృగము పోయిన దారి ననుసరించి దాని పడక వద్దకు పోఁగలవు. అట్టి లక్షణము చిన్న జయద్రథునకుఁ గలిగెను. అతని కప్పుడప్పు డనిపించును. ఈ లక్షణము తనయం దెట్లు సమకూడెను? తనకుఁ బదునెనిమి దేండ్లు వచ్చువఱకు తాను

పట్టణవాసి. చిన్నప్పటినుండి యడవిలో నున్నవారి కిట్టి పసి కుదురునేమో? తన కెట్లు కుదిరెను? తనకింత కత్తి విద్య వచ్చుటకు తన తండ్రి నెత్తురు తన నెత్రు నాళములయందుఁ బ్రవహించుట హేతువని కొంద ఱందురు. తాను నిజమే యనుకొనెను. ఈ కాంతార మృగ స్వభావము తన తండ్రి యందుఁ గలదేమో. ఆలస్యముగానైన నిప్పుడది తనయందు సంక్రమించెనేమో! ఆ తండ్రి యడవిమృగమా! కానిచో నతఁడు పెద్దపులి యగుటయేమి? అతని కేయూరహారము నిశ్చయముగా నుండుటలేదు. అతఁ డప్పుడప్పు డిట్లనుకొనును. "నేను చివరి కడవిమృగము నైపోనుకదా. నేను పోను. నే నడవిమృగమను కాను. నా మాతామహునియొక్క దయా విశేషమున నే నగుటకు వీలులేదు. నే నడవిలో నున్నను సూర్యోదయముకాకముందు స్నానము చేయుదును. సంధ్యా వందనము చేయుదును. నా తాత నా కుపదేశించిన మంత్రమును నిత్యము జపించుచున్నాను. నే నడవి మృగ మను కానేకాను. నా తండ్రి నా కీ యుపకారము చేసెను. నేను ధాన్యకటకములోనుండఁగా నింత తీరికగా జపముచేయు టకు వీలుండెడిది కాదు. ఇప్పుడేమిపని యున్నది? నా యాచారమునకు భంగములేదు. నేను మేల్కొని యున్నంత సేపును మా తాత చెప్పిన మంత్రము నా నోట నాడుచునే యున్నది. మా తాత నా కుపనయనము చేసెను. ధాన్య కటకములోని క్షత్రియు లెవ్వరును రాలేదు. నాకు గాయత్రీ మంత్ర ముపదేశించెను. వేఱ మంత్రము నుపదేశించెను. నేనీ మూఁడేండ్లలో మా తాతచెప్పిన మంత్రము తొంబది

తొమ్మిది లక్షలు చేసితిని. ఇంకొక్క లక్ష చేసినచో నాకా మంత్రము సిద్ధించునని మా తాతగారు చెప్పిరి. ఈ లక్ష పూర్తికాకముందు నా తండ్రి నాకు కనపడకుండుఁగాక. ఇట్లనుకొనుచు తన కాలి గుర్తులుకాని కాలి గుర్తులవెంట నతఁడు కాంతారమున పరిభ్రమించుచు నా గుర్తులు కాంతారమును దాటిపోయి ఏదో యొక పల్లెకు దారితీయుట తెలిసికొని కొంత మేరనుండి గుర్తు లంతర్హిత మగుటచేత తన మనస్సులోని యొక యనూహితమైన యొక యతర్కితమైన యొక సహజమైన యూహబలముచేత నా పురుషుఁడా పల్లెలో నుండునని యనుకొని యా పల్లెకుఁబోయి యా యింటికిఁ గూడఁ బోయెను. ఆ పురుషుని పే రతనిలో స్ఫురించెను. జయద్రథున కాశ్చర్యమువేసెను. గడప ముంగిటకుఁ బోయి "ఇంటిలోఁ దోహారున్నాఁడా? యని యడిగెను. తోహారు వెలికి వచ్చెను. తోహారునకు జయద్రథునిఁ జూచినంతనే యిట్లనిపించెను. "వీఁడే పెద్దపులి. వీఁడే తాను నేర్చిన యొక మంత్రముచేతఁ బెద్దపులి యగుచున్నాఁడు. మఱల మానిసి యగుచున్నాఁడు. మహాసేనాధిపతి వాని సంగతి నాతోఁ జెప్పలేదు. ఇతఁ డింతటి చిన్నవాఁడా? అయ్యో! మఱియు వీని మొగము చూచినచో వీఁడట్టి దుష్కార్యము చేయఁ డనిపించు చున్నది. కాని వీఁడే పెద్దపులి యనిపించుచున్నది" అనుకొనెను. తన యూహ యగునో కాదో నిరూపించుకొనవలయును. అని తోహారు వాకిఁట నిలుచున్న జయద్రథుని కాళ్ళమీఁద నిన్ని చెంబెడు నీళ్లు తెచ్చి పోసెను. జయద్రథునిఁ గడలవద్దనెను. అతని పాదపుగుర్తు తడిసిన నేల

మీఁద నద్దుకొనిన తరువాత వానిని లోనికిఁ బిలచెను. కూర్చుండఁబెట్టెను. అతనికి రెండుమూఁడు ఫలము లారగింపఁ బెట్టెను. పనియున్నట్లు బయటకుఁబోయి వాని కాలి గుర్తును పరీక్షించెను. పులియొక్క వెనుకటి పాదపుగుర్తులు తోహారు చిన్న త్రాడుపెట్టి పొడుగు వెడల్పులు కొలిచి వ్రేళ్ళగుర్తులు పాదమునందలి రేఖలు సర్వమును గుర్తుపెట్టికొనెను. అవి యన్నియు నీ జయద్రథుని పాదమునందు సరిపోయెను. కాని యొక్కటియే భేదము కలదు. పులి వెనుకటి కాలి యెడమ పాదమున బొట్టనవ్రేలును సరిసమానముగా నుండీ పాదపు రెండవవ్రేలు బొట్టనవ్రేలునకు కొంత తగ్గి యుండెను. ఇతని కుడిపాదమున రెండవ బొట్టనవ్రేలుకంటె మించి యుండెను. ఈ భేద మొక్కటి తక్క తక్కిన దంతయు సరిపోవుచుండెను. ఈ భేదము భేదమా కాదా? పొట్టివ్రేలు నడకలో పొడుగు వ్రేలు కాదు. ఇది భేదమే యని నిర్ణయించెను. మఱి వీఁ డెవఁడు? లోనికిఁబోయి నాపేరు నీ కెట్లు తెలియు ననెను. జయద్రథుఁడు తనకు స్ఫురించినదని చెప్పెను. తోహారున కర్థము కాలేదు. ఇతనినిఁ జూచినచో బ్రాహ్మణుఁడో సుక్షత్రియుఁడో యన్నట్లుండెను. తనతో నేమి పనియుండి వచ్చెనని యడిగెను. జయద్రథుఁడు మొదటినుండి చివరి వఱకుఁ దన కథ యంతయుఁ బూస గ్రుచ్చినట్లు చెప్పెను. తోహారు జయద్రథుని పాదములమీఁదఁ బడెను. 'ఓ దొరా! నీ వెక్కడి కొడుకవు? అతఁ డెక్కడి తండ్రి?' అని మనసులోఁ దుకతుక లాడెను. ఆ నాఁటినుండి యిద్దఱును కలసి యామూనిసి పులికొఱకు వెదకుటకు యారంభించిరి. ఇట్లుండఁగా

బలిమరముపద్ద ననుకోని యొక విస్తారము జరుగ నారం భించెను. పందలకొలఁది జనము వచ్చిరి. వాస్తు శాస్త్రజ్ఞులు, పునాదులు త్రవ్వెడివారు, గోడలుకట్టెడివారు సున్నపుబండ్లు తోలెడివారు, తాపీపనివాండ్రు, వారిమీఁది యధికారులు వచ్చిరి. ఎవ్వరును గృహనిర్మాణము జరిగెడిచోట తప్పఁ దక్కిన యడవితో మార్గములు పాడుచేయరాదు. చెట్లు నరుకరాదు. అడవియొక్క శోభ నశించుటకు హేతువులు కారాదు. అచ్చటికి సామగ్రి పోవలసిన బండ్లు చుట్టు తిరిగి యైనసరే ఆయి కదల్చకుండ చిన్న మొక్కయైననుసరే నరుకకుండఁ బోవలయును. మొదలైన రాజాజ్ఞలతో నెల తిరుగకముందు బలిమర పర్వతమునకు నంటికొనియున్న కాంతార ప్రదేశమునందు రాజసౌధము నిర్మించఁబడెను. ఆ సౌధము విశాలమైనది. ముందొక పెద్ద చావడి. వెనుక రెండు వరుస గదులు ప్రతి గదియు విశాలమైనదే. అనఁగా సౌధము మూఁడు సావడుల వెడల్పున నుండును. నడిమి సావడి మేరలో దక్షిణపు దిక్కుననున్న గదిలో రాజుయొక్క శయనాగారము. దాని వెనుక మఱియొకగది యున్నది. ఆ గది పద్మరాణి నివసించుట కేర్పడినది. దాని నంటికొని యుత్తరముగా వెనుకటి వరుసలో మూఁడు గదులు, రెండవ వరుసలో మూఁడుగదులు కలవు. వంటశాల యీ సౌధము నకు వెనుకభాగమున వేఱ యున్నది.

ఈ గృహ నిర్మాతలలోఁ బలుమంది తోహారు నెఱుఁగుదురు. జయద్రథు నెఱుఁగరు. జయద్రథుఁడును తోహా

రును స్నేహితులు. వా రెవ్వారికి వారి స్నేహముయొక్క స్వరూపము తెలియదు. పైకి నిద్దఱును నాటవికులే. ఆ నిర్జాతలలో నధికారి కలఁడు. అతఁడు క్షత్రియుఁడు. చదివికొనిన వాఁడు. అతనికి జయద్రథునకుఁ గొంత పరిచయము కలిగెను. జయద్రథునియొక్క రూపము పరమాటవికుని రూపము. అతని జ్ఞానము సర్వ పురాణగత విషయస్పర్శకలది. ఆ యధికారి కాశ్చర్యము వేసెను. అతఁడు రెండు మూఁడుసార్లు 'నీ వెవ్వరవు ? ఈ యడవిలో నెందుకిట్లు తిరుగుచుంటివని యడిగెను. కాని జయద్రథుఁ డా ప్రశ్న నెప్పుడును తోలఁగఁ ద్రోయుచునే యుండెను. మాటలలోఁబెట్టి యలయించును. అది యేదో రహస్యమని యతఁ డూరకుండును. ఈ రాజ సౌధ నిర్మాణహేతువున జయద్రథునకుఁ దన రెండు ప్రయోజనములు దూరమైనట్లుండెను. మొదటిది - తన జపము పూర్వమువలె సాగుచుండుటలేదు. తోహారుతోడి పరిచయమే దానికిఁ గొంత యభ్యంతరము కలిగించెను. ఈ జనము వచ్చుట మఱియు నభ్యంతర మయ్యెను. ఇంతమంది యుండఁగాఁ దా నెచ్చటికోపోయి కొండ గుహలో నిద్రించినచో వా రేమనుకొందురు ? అదికాక పదునెనిమిదేండ్లు మహానగరమున నివసించిన యతనికి పట్టణవాసులైన జనమును చూచినంతనే వారితోఁ గలసి యుండవలయునని పించెను. కనుకఁ బవలెల్ల జపములేదు. ప్రాతఃకాలమునఁ నా కొండ మీఁదనున్న యొక చిన్ని నీటి తాతిపడెలో స్నానము చేయును. అచ్చట నేకాంతజపములోఁ గూర్చుండును.

అంతే—మఱి యతఁ డే ప్రయోజనమును వాంఛించి యీ జీవితమును గ్రహించెనో యీ యడవులకు వచ్చెనో యీ తండ్రిని వెదకుట యన్నది పూర్తిగా మాటునఁ బడ్డట్లు నటించెను. తోహారు వానితో వాని తండ్రిసంగతి చెప్పనేలేదు. చెప్పఁదలఁచుకోలేదు. తానొక పులిని చూచెనని దాని వెనుకటికాళ్లు మనుష్యుని పాదములని తోహారు జయద్రథునకుఁ జెప్పలేదు. చెప్పినచో నా పాద చిహ్నములకొఱకు మఱల నిద్దఱు నడవిలోఁ దిరిగెడివారే. చెప్పకపోవుటకు హేతువుకూడ కలదు. కొన్నాళ్ళనుండి యీ యడవిలోఁ గాని యీ మహాతటాకముయొక్క యొడ్డునందుఁగాని యీ క్రొత్త గుర్తులు కనిపించుటలేదు. తోహారనేకరాత్రులందుఁ బోయి యీ చెట్టుమీఁదఁ గూర్చుండెను. అర్ధరాత్రము లంతయు వృథా గడచిపోవుచుండెను. పులి వచ్చినట్లు లేదు. నీటిలో దిగినట్లులేదు. ఆ రెండుచెట్ల నడుమనున్న కొయ్యను నీటిలోనికిఁ ద్రోసికొని చెఱు పీదికొని పోవుచున్నట్లును లేదు. మహాసేనాని తరువాతఁ దన్ను కలిసికొనలేదు. తనకు వార్త పెట్టలేదు. తనంతట తాను పోయి మహాసేనానితో నీ విషయము మాటాడుటకు వీలులేదు. సాధ్యమైన విషయము కాదు. ఆ నాఁడు సేనానివెంటఁ దానుకూడ దిగి యీఁదికొని పోయినచో నేమయ్యెడిదో తెలియదు. సేనాని నివారించెడి వాఁడు. ఆ సేనాని యెచ్చటికి పోయెను? తిరిగి యెప్పుడు వచ్చెను? గిరివ్రజపుర మెప్పుడు చేరెను? ఈ సంగతు లేమియుఁ దోహారునకుఁ దెలియవు. తన కేమియుఁ దెలియని

యా విషయమునుగూర్చి జయద్రథున కేల చెప్పవలయును? సామాన్యముగా నాటవికులు రహస్య గోపనవిద్యయందు నిష్ణాతులు. వారు మాటాడనే మాటాడరు. అందులో నీ విషయము పరమ నిగూఢమైన విషయము. ఎప్పుడు మహా సేనాని తననుఁ గలసికొని మఱల నా పులివిషయము ప్రసంగించలేదో అప్పుడా విషయము మహా రహస్యమైనదని నిశ్చయమైనది.

ఈ రీతిగా చిన్న జయద్రథునకు తన తండ్రియొక్క యన్వేషణ దవ్వైపోయినది. తోహారుతోడి చెలిమి తన ప్రయోజనమునకు సాహాయ్యకముగాలేదు. ఆ వార్త యంతయు నతనికిఁ దెలిసెను. రాజు తన భార్యతోఁ గొంత పరివారముతో వేటకు వచ్చును. ఈ సౌధమునందుఁ గొన్నాళ్ళుండును. అనుకొనుచుండఁగనే సౌధనిర్మాణము పూర్తి యైనది. గుఱ్ఱములమీఁదఁ బల్యంకికలమీఁద శకటముల మీఁద రాజును, రాజపరివారమును వచ్చెను. రాజు వచ్చిన తరువాత నచట నొక నిలుకడ జీవితము సాగుట కారంభించుటకు నెలనాళ్లు పట్టెను, అప్పటినుండి మఱల నడవి యడవి యయ్యెను.

# ౮

రాజవంశముతో జయద్రథుఁడు కలిసిరాలేదు. కాని రాజును పద్మరాణియు వారి పరివారమును వచ్చి యీ బలిమత పర్వతప్రాంత నిర్మిత మృగయార్థమైన భవనముల యందు వచ్చి నివసించుట యారంభించిన తరువాతఁ గొలఁది దినములకు జయద్రథుఁడు రాజభవనములకు వచ్చెను. అతని రాక పలుమందికి విడ్డూరముగనే గనిపించెను. రాజువెంట వచ్చిన పరిచారకులలో సగముమంది క్రొత్తవారగుటచేత యీ జడల సదాశివయ్యను చూచినంతనే యతఁడు సూటిగా నంతిపురములోనికే పోవుటచేత తొలుతఁ బోవుటకు వీలు లేదని యభ్యంతరము చెప్పిన వారివంక నతఁడు చూచిన చూపులలోని బడబాగ్నిజ్వాల సోకినవారు గలరు. అందఱకును వాని రాక క్రొత్తయనిపించెను. ఈ జటలేమి? ఈ కృశించిన తనువేమి? పెద్దపులి కన్నులవంటి యీ కన్నులేమి? ఇతనికిని గిరివ్రజపురమునకును సంబంధమెట్లు? అచ్చటి పరిచయము కానిచో నిచ్చట నింత సూటిగా నంతిపురములోనికే పోవుట సంభవించదుకదా, మొదలైన ప్రశ్నలతోఁ గ్రొత్త పరిచారకులు తికమక పడుచుండఁగా ముఖ్యముగా నాశ్చర్య పడఁదగిన యిద్దఱు వ్యక్తులకు నతని దర్శనము వాని మొదటి రాకయందే కలుగలేదు. ఇద్దఱికిఁగలిసి యొక్కసారి కలుగలేదు. తొలుతఁ దోహాఘున కతని దర్శనము కలిగెను. రాజకులములో నున్నవారికి నచ్చెగువెక్కువ.

జానపదుల కంతకంటెఁ దక్కువ. ఆటవికులకు మఱియుఁ దక్కువ. ఈ యెక్కువ తక్కువలు వారిలోఁగల వివేకులను సంబంధించి చెప్పినమాట. అందుచేతఁ దోహారు రాజకులము నందలి పరిచారకులుబొందినంత యాశ్చర్యముఁ బొందలేదు. ఇతఁ డెవఁడన్న ప్రశ్న యుదయించుటయు వెంటనే సమాధానము కలుగుటయు నైకకాలికముగా జరిగెను. మొగము యొక్క కవళికలును, శరీరచ్ఛాయయుఁ దొలఁగించినచో వాఁ డెవఁడో తెలిసిపోయెను. ఇతఁడు జయద్రథుని తండ్రి. సర్వశరీర నిర్మాణమునందు వారి పోలికలు సరిపోవుచుండెను. ఇతఁ డధిక తపస్వి యగుటచేత శరీరకార్శ్య మధికముగా నుండెను గాని వేఱు భేదములేదు. కొడుకుయొక్క వయస్సు నందలి లేఁతఁదనము మాత్రమే విభేదముగాఁ గనిపించు చుండెను. వెనుకనుండి చూచినచో వాఁడే వీఁ డనుకొన వచ్చును. తోహారు వానిఁగూర్చి రాజకులమునందు కొంత ప్రస్తావించెను, పరిచారకుల కెవ్వరకు వాని సంగతి తెలియదు. పరిచారకులకు తెలియదు. అతఁడు వెనుకఁ బాటలీపుత్రమున రాజకుటుంబ మున్నప్పుడు వచ్చినాఁడట. రాజుతో మాటాడినాఁడు. రాణితో మాటాడినాఁడు. మఱి యెవ్వరితోడను మాటాడఁడు. వానిని బలుకరించుటయు భయహేతువుగా నుండును. ఈమాత్రము తెలిసిన తోహారునకు వానినిగూర్చి యంతును పంతును పట్టలేదు. ఏమి చేయవలయును? రాజుతో పోయి మాటాడవలయునో? ఆయన రాజుకాడు, సేనాపతి యైనచోఁ దాను వెళ్ళి మాటాడ వచ్చును తోహారిరాజు నెఱుఁగఁడు. ఈ రాజు మున్నె

ప్పుడో నొకటి రెండుసార్లు వేటకు వచ్చెను, గాని ఈ రాజు యొక్క వేట స్వరూపమే వేఱు. ఈ రాజు ధనుస్సును ఖడ్గ మునుఁ జేతఁ గైకొని వెంట నొకరిద్దఱు సేవకులనుఁ దీసికొని యడవిలోనికిఁ బోవును. కనిపించిన మృగము నెదిరించి చంపును. వానితో యుద్ధము చేయును. దవ్వుననుండి బాణముతో వానిని సంహరించును. ఇది రాజులుచేసెడి వేటకాదు. రాజులు పటువ తోలింతురు. మాటు పెట్టుదురు. దొమ్మిగా వేట సాగింతురు. అట్టి సందర్భములలో నాటవి కుల యొక్క సాహాయ్య మర్థించుటకలదు. ఈ రాజున కది లేదు. ఉన్నను పూర్వ మెప్పుడో యీయన వేటకు వచ్చి నపుడు తోహారునకు నింతటి యటవీశాఖా పరిజ్ఞాన నైపుణ్య మును లేదు. లేకపోలేదు. అతనికికల యీ విజ్ఞానమునకు నే డతనికి వచ్చిన ప్రసిద్ధి నాఁడు లేదు. అపుడు వాని సాహాయ్య మర్థించెడివారే లేరు. ఇతఁడు జయద్రథుఁ డని స్ఫూర్తి కలిగినంతనే తోహారు వాని యడుగు జాడలవెంట దవ్వు దవ్వునఁ బోయి విస్పష్టమైన పాదచిహ్నములు కల చోట వాని కొలతలు వాని రేఖలు వాని గుర్తులు సర్వమును కొలిచికొని పరీక్షించి నిశ్చయించుకొనెను. చిన్న జయద్ర థుని కాలిగుర్తునందు కలిగిన భేదము కనరాని పాదము తోహారు చూచెను. ఆహా! ఇతఁడు వ్యాఘ్రము. వీనిని వెన్నాడవలయును. వీని నివాసస్థాన మెచ్చట? ఇతఁడు మఱల చెఱువు నీదికొని పోవునా? వాని వెంటఁ బోవల యును. ఆనాఁడు తెలియని వీని నివాసస్థలము మఱల తెలియకుండుట జరుగదు. ఇతఁడు పులి యెట్లగును! అప

విలో నుండి యుండి యగునా? దానికి మంత్రమో, మాయయో యున్నదా? ఉన్నచో వాఁడు నివసించుచోట దాని నాచరణములోనికిఁ బెట్టును. ఇతఁ డెప్పుడో యొక ప్పుడు చెఱువు నీదికొని పోవలయును. అప్పుడు వీని వెంటఁ బోవలయును. వాని గుట్టు తెలిసికొనవలయును. మొద లైనది నిశ్చయించుకొనెను. ఇతఁడు ప్రొద్దుననే రాజకుల మునకు వచ్చెను. ఎప్పుడు నిట్లే వచ్చునా? ఈ సమయము నందు వీని కొడుకునకు వీని దర్శనము కలుగదు. అతఁడు ప్రాతఃకాలమున స్నానముచేసి జపము చేసికొనుచుండును. ప్రొద్దెక్కిగాని తన గుహనుండి యతఁడు వెలికి రాఁడు.

ఆనాఁటి మధ్యాహ్నము తోహారు చిన్న జయద్రథు నితో నిట్లనెను. 'అయ్యా! నీ తండ్రిని నేను చూచితిని. ఆయన యిచటికి వచ్చెను. మఱల నెప్పుడువచ్చునో తెలి యదు. ఇన్నాళ్ళు నీతో నీ తండ్రిని నే నెఱిఁగియున్న సంగతి చెప్పలేదు. యథార్థమున కాయనను నే నెఱుఁగను. ఆయననుఁగూర్చి నాకుఁ గొన్ని విషయములు తెలియును. ఆ తెలిసిన విషయములు నాకు తెలియునో తెలియదోయన్న సంగతియే నాకు విస్పష్టము గాలేదు. అవి నాకు తెలియును అన్న విషయము నీ తండ్రిని చూచినంతనే నాకితనిఁగుఱించి తెలియు ననిపించినది. ఇది చమత్కారము. నీవు నాయందు నమ్మకముచేతనో నీ ప్రకృతిలో సహజముగానున్న మంచి తనము చేతనో నీ పూర్వకథ యంతయు నీ జన్మ వృత్తాం తము పితృన్వేషణము వననివాసము చేసిన ప్రమాణము మొదలైనవవన్నియు రేఖామాత్రమైనను దాఁచకుండ చెప్పితిని.

నాకు నీ తండ్రిని గుఱించి కొంత తెలియును. ఆ సంగతి నీతో చెప్పలేదు. ఎందుచేతననఁగా నాకుఁ దెలిసిన విషయము సందిగ్ధముగా నుండెను. ఇప్పు డందలి సందేహము పటాపంచలైనది. నీకు దానిని నేను దెలియఁజేసెదను. నీకు నీతండ్రిసంగతి సంపూర్ణముగాఁ దెలియవలయునని యున్నచో నేమాత్రమును తొందరపడరాదు. తొందర పడినచో నీ పని పాడైపోవును. ఇందులో రెండు విషయములున్నవి. నీతండ్రిని నీ వచ్చుటఁ జూడవచ్చునని చెప్పినవాఁడు నీచేత గట్టైన ప్రమాణము చేయించుకొనెను. నీచేత నట్టి ప్రమాణము చేయించుకొని నీకుఁ దన స్థావరము చెప్పుమని బోధించిన తండ్రి యెట్టివాఁడో తెలియదు. ఆ తండ్రినిగుఱించి జాగ్రత్తగా నూహించవలయును. అతఁ డెట్లు చెప్పిన నీ వట్లు నడువవలసిన ప్రమాణము చేసితివి. ఆ తండ్రి చెప్పెడి దేమియో దుష్టమైన విషయమో లోకా సామాన్యమైన విషయమో కానిచో నట్టి ప్రమాణము చేయించుకొన నక్కఱలేదు. ఇది మొదటి విషయము. రెండవది యేమనఁగా ఆ తండ్రిని నే నెఱుఁగుదును. ఎఱుఁగుదుననఁగా నతఁడే నీ తండ్రియని నిరూపించికొనుటకు వీలైనది. నిరూపితమైనది. కొన్ని నెలలక్రింద నే నీ యడవులలోఁ దిరుగుచుండఁగా నే నొక యాశ్చర్యకరమైన విషయమును చూచితిని. ఈ మహాకాంతారమునఁ బులులు లేవు. అడప తడప నూటికి కోటికి నెప్పుడైన నొక పులి చెదరి వచ్చినచో నది యిచట నివాస మేర్పఱచుకొనుట జరుగలేదు. అందుచేత నీ యడవ

పులలో పులి కాలి గుర్తు కనిపించదు. ఇట్లుండఁగా నొక నాఁడు నాకు పులియొక్క ముందటి కాలిగుర్తులు కనిపించినవి. రెండు మూఁడుచోట్ల కనిపించినవి. మూఁడు చోట్లను విచిత్రముగాఁ గనిపించినవి. ముందుకాళ్లు పులివి. వెనుక కాళ్ళు మనుష్యునివి. ఇది యెట్లు పొసఁగును? ఎడములు కొలిచితిని. మూఁడు స్థలములయందును సరిపోయినవి. ఈయన మహారాజు. ఈయన సేనాపతి యున్నాఁడు. ఆయనయే మహామంత్రి. వారిపేరు సిముఖుఁడు. ఆయనకు నాకునుఁ బరిచితి కలదు. వారితోఁ బోయి చెప్పితిని. మే మిద్దఱము వచ్చితిమి. ఇచ్చటికి యోజనముమేర నొక మహా తటాక మున్నది. ఇచటినుండి యచ్చటికి నొక్కటియే కాంతారము. ఆ చెఱువులో నొకచోట గుండ్రని నీటిపడియ యొద్దున నీ పులికాళ్లు చూచితిని. అచట నీటిపైకి వ్రాలియున్న చెట్టు కొమ్మలలో నొక రాత్రివేళ మేమిద్దఱము కాపు కాచితిమి. ఆ చీఁకటిలో వచ్చినది మనుష్యుఁడో పులియో తెలియలేదు. కాని పులి యని లీలఁగాఁ దెలియుచుండెను. మెఱయుచున్న కన్నులున్నవి. ఆ నీటిపడియలోఁ గొంత దూరము పోయిన తరువాత నీటిలోననే యున్న రెండు చెట్ల నడుమ నొక తెప్ప కొయ్యవంటిది కలదు. దాని నాధారముగాఁ జేసికొని యా పులి యా తటాకము నీదికొని పోయెను. సిముఖుఁడు దాని వెంటఁ బోయెను. నే నా చెట్టుపైననే యుంటిని. మఱునాఁడు ప్రొద్దెక్కువఱకు మంత్రి కొఱకు వేచియుంటిని. ఆయన రాలేదు. నేను చెట్టు దిగి యితర కార్యములు చూచికొని మఱల వచ్చి చెట్టుమీఁదఁ గూర్చుండి వాని కొఱకుఁ బ్రతీ

క్షించితిని. ఇట్లాఱుదినములు చేసితిని. పులి జాడ లేదు. మంత్రి జాడలేదు. మంత్రి యేమైనాఁడో తెలియక చెఱువులో నటు నిటు నీదియెన్ని స్థలములో చూచితిని. నాకు గుర్తు తగులలేదు. అపుడు గిరివ్రజపురమునకుఁ బోయితిని. మంత్రి యచటనే యున్నాఁడు. నే నేమనుకొనవలయును? మంత్రి యా పులిని వెన్నాడెను. ఆ సంగతి తెలిసికొనియే మఱలియుంటినికదా? ఆ పులి యితని నేమియుఁ జేయలేదు కదా! పులి యైనచో నెందుకు చేయదు? ఆ పులి నీతఁడు చంపలేదుకదా! చంపినచో వెనుకటికాళ్లు మానవుని పాదములైన పులిని మహాపట్టణమునందు చూపించుటకు దాని శవమును తెచ్చియుండును. దీని వెనుక నేదో అతి గహనమైన రహస్య ముండి యుండవలయును. నే నెవ్వఁడను? సామాన్యుఁడైన యాటవికుఁడను. నాతోఁ నెందుకుచెప్పును? చెప్పవలసిన యవసరమేమి? ఎచ్చటనో మృగయాయోగ్యమైన జంతు వున్నచో వేటయందు మమకారముకల యధికారులకు పోయి చెప్పుట మా ధర్మము. అంతకు మించి మావలన రాజులకు ప్రయోజనము లేదు. నేఁను నీ తండ్రిని చూచితిని. అతని పాదములు కొలిచితిని. నీతోఁ జెప్పలేదు. తొలుత నిన్ను చూచినపుడు నీవే యతఁడ వనుకొంటిని. నీకు నా గుడిసెలో ఫలాహారమును పెట్టి నీ కాలిగుర్తును కొలిచి చూచితిని. నీ కా జ్ఞాపక మున్నదో లేదో నీవు తొలుత నా పర్ణశాలకు వచ్చినపుడు నిన్ను వాకిట నిలుచుండఁబెట్టి నీ కాళ్ళమీఁద నీళ్లు పోసితిని. నీ కాలిగుర్తు నేలమీఁద విస్పష్టముగాఁ గనిపించుట కట్లు చేసితిని. నీ తండ్రి పాదము

నకును నీ పాదమునకును కొంచెము భేదము కలదు. ఆ భేద మునుఁ బట్టి నీ వదనారవిందమునుఁబట్టి నీవు పులిమానిసివి కావని నిర్ణయము చేసితిని. నేఁడు నీ తండ్రి కాలి గుర్తును కొలిచి పరీక్షించి నువ్వుగింజంతయైన భేదము లేకపోవుటను తెలిసికొంటిని. ఇట్టి స్థితిలో నీ వేమియు ననుకొననిచో నే నొక మాట చెప్పెదను. అట్లు ప్రమాణము చేయించుకొనిన తండ్రిని పోయి యెదురుగా నిలిచి నీవంటివాఁడు నేను నీ కొడుకనని చెప్పుట న్యాయమా? ఆయన నిన్నేమి చేయు మనునో? దాని నూహించవచ్చునుకదా! ఒక్కటిమాత్రము నిశ్చయము. ఆయన నిన్ను చేయుమనెడిపని సాధువైనది యెప్పుడును కాదు. నీ వసాధుకార్యమును చేయలేవు. సుక్షత్రియునివలె జపతపాదులు చేయుచున్న నీ వెక్కడ? మానిసిగానుండి పులియగుటకు మందులు మూలికలలో, మాయ మర్మములలో యభ్యసించిన నీ తండ్రి యెక్కడ? ఆయన యీ మంత్ర మెందుకు నేర్చెను? ఈ మాయ నెందుకు కనిపెట్టెను? మా యడవులలో నందందు మఱియుఁ గుత్సితు లైన కిరాతులు చెప్పికొనుట కలదు. ఏవో విద్యలచేత క్రూరహింస్ర మృగములుగాఁ గావచ్చునని మీ తండ్రి యింతటి వట్టి కిరాతమైన విద్యలోని లోతుపాతులు పరిశీలించి దేని కిట్లైనాఁడు? ఏ మహాఘోరము చేయుట కిట్లైనాఁడు? ఏ మహాపాపము చేయుట కిట్లారంభించినాఁడు? ఎవరిని సాధించుట కీ దుష్టమంత్ర మభ్యసించినాఁడు? ఊహించినచో నీ రాజును వధించుటకుఁ దా నీపని చేసెనా యని పించు చున్నది. ఏల యనఁగా నిచ్చటి పరిచారకులు రాజు

పాటలీపుత్రమం దుండఁగా మీ తండ్రి యచ్చట దర్శన మిచ్చెనని చెప్పుచున్నారు. ఇచటి యీ భవన నిర్మాణ మునకు రాజ కుటుంబ మిచ్చటికి వచ్చుటకు మీ తండ్రియే హేతువు కావలయును. ఏమి యూహించి రాజు నిచ్చటికిఁ దెచ్చెను? ఏమి చెప్పి రాజు నిచ్చటికిఁ దెచ్చెను! ఆ రాజు నకు నితనికిఁ గల సంబంధమేమి? అతని నుపాంశువధ చేయ వలయునని యీయన యూహించెనా? అట్లు వధించుట రహస్యముగాఁ జేయవలయునా? రాజునకు నితనికి చెలిమి యున్నదా? మన కేమియునుఁ దెలియదు. ఆ రాజును చంపుట కీ ప్రయత్నము చేయుచున్నాఁడని నేనూహించు చున్నాను. నా యూహ నిజమైనచో నీవు వాని పుత్రుఁడ వని చెప్పికొనినంతనే మీ తండ్రికి మఱల వ్యాఘ్రము కావలసిన యవసరములేదు. ఆ రాజు నెదురుపడి చంపుటకు మోమోటమి పడియేకదా యింత ప్రయత్నము చేసినది. నీ వా నీ తండ్రి చెప్పిన మాట చేసితీఱవలయును. లేనిచో నిన్ను రేచుకుక్కలు పీకికొని తినును. ఆ నీ తండ్రి రాజును వధించుమని నీతో చెప్పును. వధింతువా? నీవు ప్రత్యక్ష ముగా పోయి నేను నీ కుమారుఁడనని చెప్పినంతనే యతఁ డిదియే యనును. నా యూహ నిజమైనచో నిట్లే జరుగును. ఇంకొక విధముగా నూహించుటకు వీలులేదు. అందుచేత నీవు చేయవలసినది యేమనఁగాఁ దొలుత నీ తండ్రియొక్క స్వరూపాభిజ్ఞానము సందిగ్ధేతరమైన పద్ధతిగా కలుగఁజేసికొన వలయును. పాపము! కొన్ని యేండ్లు తండ్రిని చూడ వలయునని కలవరించితివి. తండ్రి కనిపించెడి స్థితి వచ్చినది.

ఆ స్థితి పరమసంకటముగా నున్నది. తండ్రి కనిపించును. తండ్రిని జూడవచ్చును. అన్న నిముసములో నా తండ్రి నీ యూహకు నీ యాశకు నీ స్వప్నభావమునకు నీ పరిస్థితులకును వ్యతిరేకమైన లక్షణములు కలవాఁడుగాఁ దోచుచున్నది. అందుచేత నీ వాగి విచారించి యతని గూడెక్కడనో కనుఁగొని అచ్చటి యతని ప్రవర్తనమునుఁ బరిశీలించి నేను నీ పుత్రుఁడనని చెప్పికొనుటకు యోగ్యమైన పరిస్థితి యేర్పడినచోఁ జెప్పవలయును. నే నాటవికుఁడను. నీవు వేషముచేత నాటవికుఁడ వైనను పెంపకముచేత బుద్ధి లక్షణముచేత నాగరుఁడవు. నాకు తోఁచిన యూహ నేను చెప్పితిని. ఇది యంతయు నీకంటె నూహాశాలి ననిపించుకొనుటకు చెప్ప లేదు. నాయందు నీవు ప్రకటించిన విశ్వాసమునకు ప్రతిఫలముగాఁ జెప్పితిని. — ఆనాఁటి రాత్రి వారిరువురును తటాకము నొడ్డున యా గుండ్రని నీటిపడెలో రెండు చెట్లనడుమ నున్న తెప్పకొయ్యమీఁద వ్రాసిన చెట్టు కొమ్మలో నాఁడు శ్రీముఖశాతకర్ణియు తోఁహారుసు దాఁగికొనిరి. నేఁడు జయద్రథ శాతకర్ణియు తోఁహారుసు దాఁగికొనిరి. ఎవ్వరు రాలేదు. తెల్లవాఱెను. అట్లు పది రాత్రులు జరిగినది. అన్నియు వృథా యైనవి. జయద్రథుఁడు తన తండ్రి యెట్లుండునో చూచుటకుఁగూడ వీలులేకపోయెను. అతఁడు బలిమఠమువద్ద లున్న రాజమృగయా భవనమునకు నాఁడు ప్రొద్దుటవచ్చెను. ప్రతి ప్రాతఃకాలమునను వచ్చుచున్నాఁడేమో. ఇచటికి నచటికి నామడదవ్వున్నది. తెల్లవాఱలిచటఁ బ్రతీక్షించి ప్రొద్దుననే రాజభవనము ముందుఁ బ్రత్యక్ష మగుటకు

సాధ్యముకాదు. ఈ సందేహము చిన్న జయద్రథునకుఁ గలిగెను. తోహారు వాని నిచ్చటికిఁ దీసికొనిరానిచో నీ పది దినములలో యెప్పుడో యొకప్పుడు తండ్రిని చూచెడివాఁడు. జయద్రథుఁ డన్నాఁడుకదా "నేను దవ్వుననుండి యాయనను చూచెడివాఁడను. నేను కనిపించినను పెద్ద దోషము లేదు. తన్నతఁ డెట్లు గుర్తు పట్టును? నేను నీ కొడుకునని చెప్పను. అతనికి తెలిసెడిదికాదు. నేను తండ్రిని చూచుట జరిగెడిది? అనఁగాఁ దోహారిట్లనెను. "అయ్యా! మీరనినమాట నాకు నాలోచనాసహితముగాఁ గనిపించుటలేదు. నీకింత వయస్సు వచ్చినప్పుడు నీవు నీ తండ్రిని చూడవలయు ననుకొందువు. అప్పటికి మూఁడేండ్లు దాటినచో మగధాటవులలో నీ తండ్రి యుండును. పులివలె నున్నచో నుండవచ్చును. ఈ లెక్క నీ తండ్రి కెట్లు తెలియును? నీకు పదునెనిమిదవయేట నీ కీ తీవ్రభావము కలుగునని యాయన యెట్లూహించెను? అప్పటికి మూఁడేండ్లకు గదా బలిమర ప్రాంతాటవులకు నిన్ను రమ్మన్నది? ఆయన యీ పదకము నెన్ని యేండ్లనుండి వేసికొన్నాఁ డందువు? ఎట్లు వేసికొన్నాఁడు? నీకు పదునెనిమిదవయేట నిట్టి తీవ్రావేశము కలుగునని యాయన కెట్లు తెలియును? అంత తెలిసినవాఁడు నిన్ను చూచుట కోడనే గుర్తుపట్టలేఁడా? మఱియు నిన్నిచ్చటికే యేల రమ్మనెను? ఆ రమ్మనుటలోఁ జేయుంచిన ప్రమాణమేమి? తెలిసినదా? అనఁగా జయద్రథునకుఁ దెలిసినది. అతఁడు నిజమే ననెను. మఱి యేమి చేయుమందువు? తోహారు మఱల నిట్లనెను." మన మిచ్చటఁ బది దినములు ప్రతీక్ష

చేసితిమి. ఫలితము కనిపించలేదు. పదళ్ళు బలిమత ప్రాంతా రణ్యములయందు ప్రతిదినము నేను పులికాలి చిన్నెలు కనిపించునేమో యని ప్రొద్దుక్రుంకువఱకు వెదకుచునే యుంటిని. అట్టి గుర్తులు లేవు. అనఁగా నాయన మఱలఁ బులికాలేదు. ఎందుచేత కాలేదు. ఆతఁడు పులియగుటకుఁ గావలసిన మ్రాఁకులో మర్మములో యీ తటాకము నీదికొని పోయి యచట నెచ్చటనోగల యునికియందు నిక్షేపించి యుండును. ఎప్పుడో యొకప్పుడు తా నిచ్చటకు వచ్చితీఱ వలయును. మనము రాత్రులందే యిచట ప్రతీక్ష చేయు చుంటిమి. ఇది నిర్జనమైన ప్రదేశము. తన వృత్తిని సంశ యించువాఁ డెవ్వఁడు లేఁడు. అన్న ధైర్యముతో నాయన దివావేళలయందే యచ్చటికిఁ బోవుచుండెనేమో. ఆ పులి యగుటమాత్రము రాత్రులందే చేయును అని నే ననుకొను చుంటిని. ఆయన పులియై యీ యడవులలో తిరుగుటకు సంకల్పించెనే నేదో యొక రాత్రివేళనే యగును. మనకుఁ దప్పక కనిపించును. మన మోపిక పట్టుకొని నెలనాళ్లైన నిట్లుండక తప్పదు. అనఁగా జయద్రథుఁ డిట్లనెను. "నీవు చెప్పిన దంతయు నిజమైనచో నతఁడు పులి యగుట రాజ మృగయాభవనమునందలి వార్తలమీఁద నాధారపడి యుండును. అచటి వార్తలు తెలిసికొని వానినిఁబట్టి మన మిచటఁ గాపువేయుట సమంజసముగా నుండునుకదా. నా విని తోహా రిట్లనెను. "అయ్యా! నే నచ్చటి వార్తలు కనుఁ గొంటిని. పరిచారకులకుఁగాని, పరిచారికలకుఁగాని వీనినిఁ గుఱించి యేమియు తెలిదు. ఆ రాజునకే తెలియును. ఆ

రాణికే తెలియును. వారితో మనము మాటాడుటయన్నది లేదుకదా. అనఁగా జయద్రథుఁ డిట్లనెను. "ఓయీ రాజు సరే. రాజునకు పలుమంది భార్య లుందురు. వార్తలనుబట్టిఁ యిచ్చటి కొక్క-భార్యయే వచ్చెనని తెలియుచున్నది. మాది ధాన్యకటకమని చెప్పితినికదా! మారాజధానిలో నున్న యొక గొప్ప సామంతుని కూతురు రాజునకు భార్య యైనది. ఆమె పే రిన్నాళ్ళును నాకు గుర్తునకు రాలేదు. నిన్న హఠాత్తుగా స్మరణకుఁ దగిలినది. ఆమెపేరు పద్మ రాణి. నే నామె నెఱుఁగుదును. ఆమె నన్నెఱుఁగును. మే మందఱ మొక వంశములోనివారమే. నేనుపోయి నేను పద్మరాణికి చుట్టమను. ఆమెతో మాటాడవలయునని చెప్పి నచో నా కామె దర్శనము కలుగవచ్చును. అప్పటి కీ వ్యవ హారము కొంత తేలిక పడినట్లగునుకదా!" ఆమాటలకు శ్రీహరుకూడ నంగీకరించెను. కాని యిద్దఱిమనస్సులలో నొక సందేహముకలదు ఇన్నాళ్ళిచ్చోటుమీఁదనుండి ప్రతీ క్షించిరి. ఈ ప్రతీక్షను నాల్గైదు దినములు మానినచో నీ నాల్గు దినములలో సతఁడు పులియై వచ్చుట జరిగినచో చేతఁ జిక్కిన యవకాశమును పోఁగొట్టికొ న్నట్లగును. తోహా రడి గెను. ఆ పద్మరాణి నీతో మాటాడునా? వారి కుటుంబము నకు మీ కుటుంబము నకు సయోధ్యకలదా? అనఁగా నీ ప్రశ్నతో మఱల జయద్రథునకు సంశయ ముత్పాదిల్లెను. ఏమైనను పోయి పద్మరాణిని చూచుటకే నిశ్చయపఱచు కొనిరి. చివరకుఁ బోయిరి. అచ్చటఁ దోహానకేమి పని

యున్నది? ఎందుచేతనో రాజపరిచారలు తోహారును సంశ యించరు. జయద్రథుని సంశయింతురు. ఆ జటలవానికి వీనికిఁగల శరీర సామ్యముచేత వారిసందేహము లధికము లయ్యెను. వానివలె వీఁడుకూడ మాటాడకుండ సూటిగా రాజుకడకును రాణి కడకునుఁ బోయినచో వారేమియు మాటాడెడివారుకాగు. ఇతఁడు లోనికిఁబోవుట కనుజ్ఞ కొఱకుఁ బ్రయత్నించినంతనే యా యనుజ్ఞ దవ్వనకుఁ బో నారంభించెను. ఇతఁడు పద్మరాణిపేరుచెప్పెను. వారి కా పేరే తెలియదు. ఆమె చిన్నరాణి యనియే వారికి తెలియును. ఇతనికి దర్శనమెట్లు కలుగును? ఇట్లు నాలైదు దినములు గడచెను. ఇతఁడు వెళ్లును. భవనముచుట్టును తిరుగును. రాజసేవకు లెవరును వీనిని పలుకరించరు. వీనినిఁ జూడరు. అతనికి చివరను విసుగువేసి తోహారుతో "ఇది లాభములేదయ్యా, ఆచెట్టుమీఁదఁ గూర్చుండి ప్రతీక్షచేయు టయే మనము చేయవలసినపని యనెను. తోహా రిట్లనెను. మనము భయభ్రష్టులమైతిమి. చెట్టుమీఁద పది దినములు కూర్చుంటిమికదా. ఇక్కడఁ బది దినములుందమనెను. అట్లేయుండిరి. ఉన్నను మఱియుఁ బ్రాతఃకాలమున జయ ద్రథుఁ డుండఁడు. తోహారు వాని తండ్రికొఱకుఁ బ్రతీ క్షించును. అతఁడు కనిపించుటలేదు. ఏమైనాఁడో తెలి యదు. ఇట్లుండఁగాఁ దరువాత మూఁడుదినములు జరిగిన తరువాత నొకనాఁడు రాజభవనము వెనుకతట్టున జయ ద్రథుఁడు దూరముననుండి చూచుచుండఁగా రాజభవనపు

వెనుకటి గదిలోనుండి యెత్తుగానున్న యొక గవాక్షము నందొక స్త్రీవదనము గోచరించెను. అతఁ డామెవంకఁ జూచుచుండెను. ఆమె వదనము నీడలోనుండెను. అంతః పురమునందున్న యొకస్త్రీ గవాక్షమునుండి చూచుచున్న దన్నంతమాత్రమే జయద్రథునకుఁ దెలిసెను. ఎవఁడో పురుషుఁడు గవాక్షమువంకఁ దనవంకఁ జూచుచుండఁగా నాస్త్రీ వెంటనే తొలఁగిపోవలయును. ఆమె యట్లు పోలేదు. ఇది యేమి యపాయకరమైన విషయమోయని జయద్రథునకు భయము కలిగెను. ఆమె చంద్రరేఖ. దూరాన నీ చిన్న జయద్రథునిఁ జూచెను. మొదట ననుమానము కలిగెను. ఔనా కాదా యనిపించెను. అతఁ డిచ్చటి కెందుకువచ్చె ననుకొనెను. పోయి పద్మరాణితో చెప్పెను. పద్మరాణి యిట్లనెను. ఎందుకుకాఁడు? అతఁడే యైయుండును. వీఁడు వాని కుమారుఁడేకదా! ఈ దుర్వ్యవసాయము తండ్రియు కొడుకునుఁగలిసి చేయుచున్నారు కాఁబోలును. తండ్రి యిచ్చట లేనప్పుడు కొడుకు నిచ్చటనుంచి పోవుచుండెఁ గావలయును. ఓసి చంద్రా! మన రాజున కీపిచ్చి పట్టినది. ఇది యెట్లు పరిణమించునో తెలియదు.” అనెను. కాని చంద్రరేఖ మనసులో నీ చిన్న జయద్రథునిఁగూర్చి యనుమానములేదు. ఇతఁడు మున్ను తమయింటికి పలుసార్లు వచ్చెడివాఁడు. తమది మిక్కిలి పేదకుటుంబ మగుటవలన ధనవంతులైన శాతకర్ణుల యిండ్లకుఁ బోవుటకు వెనుఁదీసి నట్లుగా తమయింటికి వచ్చుటకు జయద్రథుఁడు వెనుఁదీసెడి వాఁడుకాఁడు. తనకు నతనికిఁ బరిచయముకలదు. వారంప

యొక్క కుదుటిలోనివారే. తరాలు తెగిపోయినను తమ యింటిలోని యాడుపిల్ల వానికి చెల్లెలే. లేదా ఆమెమేనత్త యగును. లేదా పినతల్లి కావచ్చును. ఇట్టివరుసలేయుండును. తన్నుమాత్రము జయద్రథుడు సోదరివలెఁ జూచెడివాఁడు. అంత పెద్దపరిచయమునులేదు. పరిచయము లేకపోవుటయును లేదు. అందుచేత నామెకుఁ బద్మరాణికిఁ దెలియకుండ నీ జయద్రథునితో మాటాడవలయు ననిపించినది. కనీసము వానితండ్రియొక్క యూహ యెట్టిదో వాని యీ పన్నాగ మెందుకో కొంత కాకపోయినఁ గొంతయైననుఁ దెలియఁ గలుసు. మూఁడేండ్లక్రిందటి మాట. ఈ జయద్రథుని కొడుకు తండ్రివంటివాఁడు కాఁడని తమ కులము నందు చెప్పికొనెడివారు. అది నిజమైనచో నితఁడు తండ్రితోఁ గలసివచ్చినవాఁడు కాఁడు. కలసివచ్చినవాఁ డైనచో బాటలీపుత్రమున కేల రాలేదు? గిరివ్రజమునం దేల కనిపించలేదు? పద్మరాణికి వానియందు ద్వేష ముండుట సహజమే. పద్మరాణి తండ్రియైన గంగాధరశాత కర్ణి రాజపక్షమువాఁడు. ఇతఁడు గోముఖశాతకర్ణి పక్షము వాఁడు. తమ క్షత్రియులలో ద్వేషముగాని స్నేహములుకాని మిక్కిలి తీవ్రముగా నుండును. చంద్రరేఖ యానాఁటి కూర కుండెను. మఱునాఁడొక పరిచారకునిఁ బిలిచి వానితో నిట్లు చెప్పెను. "అయ్యా! నిన్న నాకొక పురుషుఁడు కనిపిం చెను. అతనిది ధాన్యకటకము. అతఁడు నన్ను చూచుటకు వచ్చియుండును మీరు లోనికి రానీయలేదు కాఁబోలు. అతనిని కనిపెట్టి నాయున్నచోటికి తీసికొనిరమ్ము" అనెను.

తరువాత మూనాళ్ళకు చిన్న జయద్రథునకు చంద్రరేఖా దర్శన మబ్బెను. చంద్రరేఖ పద్మరాణితోఁ గలసి యుండు మన్నదని వానికిఁ దెలియదు. అమ్మగారి చుట్టము ఆమె పేరు చంద్రరేఖ. ఆమెది ధాన్యకటకము. నిన్నెఱుఁగునట. రమ్మనుచున్నదనఁగా జయద్రథునికి చంద్రరేఖ స్ఫురించ లేదు. లోనికిఁ దీసికొనిపోయి యేమిచేయుదురో మూనాళ్ళ క్రింద నంతిపురమునుండి చూచుచున్న యొక రాజస్త్రీని తాను తెప్ప వాల్చక చూచెను. ఆ దోషమిట్లు పరిణమించు చున్న దేమోఅని భయము వేసెను. కాని యా సమయమునందే చంద్రరేఖ బయటకువచ్చుటయు, నామె నితఁడు చూచుటయు నామెయే పలుకరించుటయు, ఆమె గదిలోనికిఁ బోవుటయు ధాన్యకటకపు వార్తలు త్రవ్వికొనుటయు జరిగినది. కాని యితఁడు చంద్రరేఖను తన తండ్రినిఁ గూర్చి యెట్లడుగును? ఏమని యడుగును? ఆమెకుఁ దెలియునుకదా? ఆమెయే యా ప్రసక్తి తేవలయును. ఆమె నోరెత్తలేదు. తరువాత పది దినములవఱకు నితఁడు చంద్రరేఖ నివసించు మృగయా భవనభాగమునకు నాలుగైదుసార్లు పోయెను. నాలుగవసారి చంద్రరేఖ యన్నది. "జయద్రథుఁడా, మన మైదాఱుసార్లు కలిసికొంటిమి. నీ వానాఁ డెట్లుంటివో యీనాఁడు నట్లే యుంటివి. నీలో మార్పు లేదు. అట్టివాఁడ విచ్చటికెందుకు వచ్చితివి? జయ:- అనఁగా నాలో మార్పున్న నేనిచ్చటికి రావలయుననియా? చంద్ర:- అవును. జయ:- ఎట్టి మార్పు? చంద్ర:- అది నీకే తెలియవలయును. జయద్రథుఁడు తా నింకను బయటపడనిచో తనకుఁ గలిగిన యీ యంతఃపుర

పరిచయము వృథా యగునని యిట్లనెను. "చంద్రరేఖా! నన్నుకూడ నీవు నా తండ్రి వృత్తివంటి వృత్తి కలవాఁడ ననుకొనుచుంటివా? అతని వృత్తి నా కింకను తెలియలేదు. అతనిని నేనింతవఱకు చూడలేదు. చూడవలయునని బయలుదేఱితిని. మూఁడేండ్లైనది. ఇచ్చట నతని పొడ తెలిసినది. తెలియుటలో నొక వికార లక్షణముగాఁ దెలిసినది. అతనినిఁ గలసికొని నేను నీపుత్రుఁడను. నీదర్శనార్థము వచ్చితినని చెప్పవలయునా చెప్పరాదా నాకు తెలియకుండనున్నది. ఇచటి కాయన వచ్చుచుండునట. ఆయనకు రాజుగారితో రాణిగారితో మాత్రమే పరిచయము కలదట. ఆయన యెందుకు వచ్చుచున్నాఁడో యెవ్వరికినిఁ దెలియదు. నీ కేమైనఁ దెలిసినచోఁ జెప్పఁగలవా? చంద్ర:- నాకుఁ దెలియును. తెలియదు. పద్మరాణి యనుమతి లేకుండ నేను మాటాడుటకు వీలులేదు. జయ:-నన్నుఁ గుఱించి యామెతోఁ జెప్పుము. ఆమె నీకన్న పెద్దదికదా. ధాన్యకటకములో నాకు మంచిపేరే యున్నది. ఆమెనన్ను గుఱించి మంచిగానే వినియుండును. ఆమె ప్రసన్నురాలైనచో నే నామెతో మాటాడవలయునని యున్నది.— చంద్రరేఖ తరువాత నితనినిఁగూర్చి పద్మరాణితోఁ జెప్పెను. ఆమె యితనికి దర్శనమిచ్చుట కంగీకరించలేదు. లేదు సరి కదా చంద్రరేఖతో నతనిని రాజభవనములోనికి రానీయవల దని యాజ్ఞాపించెను. చంద్రరేఖ యేమిచేయును? ఈసారి యతఁడు వచ్చినపుడు రానిచ్చుటయా? రానీయక పోవుటయా? ఒకసారి రానిచ్చి నీ విచ్చటికి వచ్చుట రాణిగారి కిష్టము

లేదని మంజలించవలయు ననుకొనెను. అతఁడు వచ్చెను. చంద్రరేఖ యతనితో నామాట చెప్పెను. జయద్రథుఁ డిట్లనెను. "చంద్రరేఖా! పద్మరాణి యట్లభిప్రాయపడు టలో దోషమేమియునులేదు. నాతండ్రి యడవులలోఁ బెరి గెను. నేను పట్టణములోఁ బెరిగితిని. నాశరీరములో శాతకర్ణుల రక్తము ప్రవహించుచున్నది. నాది యాంధ్ర రక్తము. నాతండ్రియొక్క శరీరములోని రక్తము సైంధ వము. అతఁ డవిజ్ఞాత వృత్తాంతుఁడు. నా జన్మవృత్తాం తము సర్వజనులకుఁ దెలియును. నాతల్లి మోసపోయినది. కాని దుశ్శీలకాదు. నీవు దాఁచుచున్నను నాకుఁ దెలి యును. నాతండ్రి వ్యాఘ్రమయ్యెడి యొక మంత్రమో మాయయో నేర్చినవాఁడు. అతని వ్యాఘ్రత్వ మెట్టిదియో తెలిసికొనవలయుననియే నే నిచ్చటికి వచ్చితిని. ఈరాజ దంపతులలో నతఁడేమి మోసము తలంచినాడో నాకుఁదెలియ కుండ నున్నది. అది నీవలనఁ దెలిసికొనుటకు వచ్చితిని.— అనఁగాఁ జంద్రరేఖ యీ జయద్రథునితోఁ జివరిసారి మాటా డుటకు పద్మరాణి యనుమతియిచ్చిన స్వల్పవేళాపరిమితి మైపోఁగా దౌవారికుఁడువచ్చి వానిని వెడలి పొమ్మనెను. జయద్రథుఁడు వెడలిపోవుచు నామెతో నిట్లనెను "ఒక్కటే మాట. ఇంక నే నిచ్చటికి వచ్చుటకు వీలులేదు. నాబదు లింకొకఁడు రావచ్చును. వానిపేరు తోహారు. వానిని రాజ భటులు రానిత్తురు. నాకుఁ జెప్పవలసిన దేదైననున్నచో వానితోఁ జెప్పుము" అని యతఁడు వెడలిపోయెను. ఈసంగతి యంతయు తోహారుతోఁజెప్పెను. ఇద్దఱునుకలిసి యాలో

చించుకొనిరి. అంతిపురములోని వార్తలు తమ కేమి తెలిసినట్లు ఏమియు తెలియలేదు. చంద్రరేఖను చిన్న జయద్రథునిమీఁద ననుమానము మాత్రము లేదు. ఆమె యొకవేళ నచటి రహస్యము వెలికిఁ జెప్పవలయునని యెంచి నచో తోహారుమాత్రము తిరిగి తిరిగి రాజభవనము చుట్టును మెలఁగుచుండవలయును. ఇంతియే తెలిసినది. ఇప్పటికి జయద్రథునకు నా తటాక తటవృక్షోపరి మజిలఁ బోయి రాత్రులందు కాఁపు కాయుటకు నభ్యంతరమేమియు లేదు. రాజ భవనమునందు తనకుఁ దెలిసెడి వార్తయే లేదుకదా! పద్మరాణి తనకుఁ దెలిసియుఁ దెలియనట్లే యైనది. అహో! మానవజాతియందలి పురాణవైర మెంతపనిచేయును? తరములు గడచుచుండును. ఆ వైర మట్లే పనిచేయుచుండును. ఆతలివాఁడు సత్పురుషుఁడని తెలిసినను వానిని నమ్మరే. అదియుకాకఁ దన తల్లియందలి దోసమేమి? తనయందలి దోసమేమి? తానతనికిఁ గొడుకగుట దోసము. తన తల్లి యొక్క దోసమేమి? వానినిఁ బ్రేమించుటయే దోసమా? వివాహము కాకమున్నె వానినిఁ గలియుట దోసమా? రెండును దోసములేనా? వానినిఁ బ్రేమించుట దోసమా? దోషమేమో! ముక్కు మొగ మెఱుఁగనివానినిఁ బ్రేమించుట యెట్లు? ఇది యిప్పుడు విచారించఁదగిన విషయము కాదు. నాఁటినుండి జయద్రథుఁ డొక్కఁడే యాచెట్టుమీఁద నిశావేళయంతయుఁ బ్రతీక్షించుచు కూర్చుండుచుండెను. తెల్లవాఱులచటఁ గన్నులలో వత్తులువేసికొని కూర్చుండును. తెలవాఱబోవుచున్నదనఁగా చెట్టుదిగి వచ్చును. ఈ యామడ

దూరము నడచి వచ్చెను. తన స్నానము సంధ్యయు నెఱ వేర్చి కొనును. మఱల నా చెట్టువద్దకే పోవును. ఆ తటాకపు టొడ్డునందు తిరుగుచుండును. సాయంసంధ్య యా తటాకము నందే తీర్చును. చీఁకటి పడినంతనే మఱల వృక్ష మారోహించును. తోహా రేదో వార్త తెచ్చునని ప్రతీ క్షించు చుండును. అతఁడు కనిపించుటయే లేదు. తన తండ్రి తనకుఁ గనిపించినచోఁ దోహారు చెప్పినట్లు తండ్రి తన్ను గుర్తుపట్టునేమో! తా నెట్లు గుర్తుపట్టును? అతఁ డెట్లుం డును? ఇప్పటి యతని మూర్తినిఁగూర్చి తాను తోహారు నడుగలేదు. అతఁడు చెప్పలేదు. అందులో నిది రాత్రిపూట నెట్లు సాధ్యమగును? ఇట్లుండఁగా నొకనాఁడు చెట్టుమీఁద జయద్రథ శాతకర్ణి కొన్నినాళ్ళ నిద్దురలేని తనపు బరువును పట్టుకొనలేక నిదురపోయెను. కొమ్మలలోనుండి పడకుండ భద్రముగాఁ జూచికొని నిదురపోయెను. తెల్లకు తెల్లవారి యతనికి మెలకువవచ్చెను. అతఁడు తత్ప్రాంతమంతయుఁ బరీక్షించెను. అంతయు నున్నదున్నట్లే యున్నది. కాని యిన్నాళ్ళుగా నీటిలోనున్న యా రెండు చెట్లనడిమి తెప్ప కొయ్యమాత్రము లేదు. అహా! తన తండ్రి వచ్చెను. ఆ తెప్పకొయ్య నెక్కి యీదుకొని పోయెను. అయ్యో! పాడునిద్ర సరిగా నీనాఁడే వచ్చెను. అతఁ డొడ్డునందు పరీక్షించెను. కొంత ప్రొద్దెక్కి తగినంత వెలుతురు వృక్ష ముల మధ్య భాసించుచుండెను. ఆ యొడ్డున నెచ్చట చూచినను తన కాలిగుర్తులు తోహారు కాలి గుర్తులు మాత్రమే కలవు. ఆతనికొక యూహ తోచెను. తన కాలి

గుర్తులును తన తండ్రి కాలిగుర్తులును కొంచెము భేదముతో సమానముగా నుండునని తోహారు చెప్పెను. తా నొకచోట రెండు పాదములు వేసి వాని గుర్తులను బరిశీలించికొనెను. ఆ భేదమేమియో తోహారు నడుగలేదు. నీటియొద్దున తన కాలి గుర్తులవలెనున్న కాలి గుర్తుల నన్నింటిని పరిశీలించెను. ఒక కుడిపాదపు గుర్తులో భేదము కనిపించెను. ఒక గుర్తులో కాలి రెండవవ్రేలు బొట్టన వ్రేలుకన్న పెద్దది. ఇంకొక కాలిగుర్తులో నది చిన్నది. అచ్చముగాఁ దన తండ్రి తన వలెనే యుండునా? మొగములలోమాత్రము భేద మున్నదని తోహారు చెప్పెను. ఆ కాలు మాఱల తిరిగివెళ్ళినట్లు గుర్తు లేదు. ఎప్పుడో యొకప్పుడు తండ్రి తిరిగి వచ్చునుకదా? పది దినములైననుసరే. తన స్నాన సంధ్యలు వదలిపెట్టినను సరే, దివారాత్రములు తా నా స్థలమును వదలఁడు. అతఁడు పగలే వచ్చినచో తెప్పకొయ్య దూరముననే కనిపించును. తాను డాఁగికొనియుండును. దూరముననుండి చూచును. రాత్రులందు వచ్చినచో సవ్వడినిఁబట్టి నీటిలోని యలికిడినిబట్టి గుర్తు పట్టును. పట్టి యేమిచేయవలయును? ఎదురుపడి నేను కొడుకనని చెప్పుటకు వీలులేదుకదా! తానంతటి ప్రమాణము చేసెనుకదా! అతనివృత్తి సంపూర్ణముగాఁ దెలిసికొన్న తరువాతఁగాని తాను బయట పడకూడదు. అతని వృత్తి సద్వృత్తి యైనచో తాను పుత్రుఁడనని చెప్పును. కానిచోఁ జెప్పనే చెప్పఁడు. చెప్పకపోయినచోఁ దండ్రి యీ పని చేయుమని శాసించుటలేదు. తాను చేయుటలేదు. సద్వృత్తియైనచో నభ్యంతరమేలేదు. కనుక తాను తండ్రికి

తాను పుత్రుఁడనని చెప్పికొనకముందు వాని స్వరూపము సంపూర్ణముగాఁ దెలిసికొనవలయును. ఆ తండ్రిని దూరమున నుండి యనుసరించును. అతని వివేక మధికమైనది. తోహారు చెప్పినట్లు తనకుఁ దన తండ్రినిఁ దెలిసికొనవలయునన్న తీవ్రా వేగము తన పదునెనిమిదవయేట కలుగునని తెలిసికొన్న వాఁడు, ఆ తరువాత మూఁడేండ్లకు తా నీ యడవులలో నుండునని నిర్ణయించికొనినవాఁడు, పరులయొక్క యింగిత మును తెలిసికొనలేఁడనుట యెట్లు? తన సర్వ మనోభావము, తన సర్వప్రవృత్తియు తన తండ్రికి నవగతమై యుండి యుండ వలయును. తానిప్పు డీయడవులలోఁ దిరుగుచున్నదికూడ యతనికిఁ దెలియునేమో. కనుక నతనికిఁ దెలియ కుండ నతని ననుసరించుట కష్టమగును. ఏమిచేయ వలయును? అతని మంచుల ప్రమాఁకుల కర్మాగార మా చెఱువు నాతిలియొద్దనుఁగలదు. పర్వతములలో నుండును. అచ్చటికిఁ బోవలయును. అచ్చటనే తండ్రిని కలిసికొననలయును. ఇంకొకస్థలము తమ యిద్దఱికలయికకు యోగ్యమైనదికాదు. అది యెట్లు సంభవించును? ఆ ప్రదే శమును తోహారు కనుఁగొనలేకపోయెను. దానికొక్కటే మార్గము. అతఁడు మఱలవచ్చి మఱలఁ జెఱువు నీదకొని పోవునప్పుడు వానివెంటనే తెలియకుండఁ బోవలయును. అతఁ డప్పుడు వచ్చును. మఱల నెప్పుడుపోవును. ఆరాత్రిపూట జయద్రథశాతకర్ణి వెలిఁగించిన యఖండమువలెఁ జెట్టుకొమ్మ లలోఁ గూర్చుండెను. ఒకరాత్రివేళ చెఱువులో నెవరో యీదికొనివచ్చు సవ్వడి వినిపించెను. అతఁడు కొమ్మలలో

దాఁగియుండుటయే చేయవలయునా? చీఁకటిలోఁ దన కెంత కనిపించునో తండ్రికినంతే కనిపించును. అందుచేత దిగి కొంతదగ్గఱిస్థలమునకు రావచ్చునా? ఆ యీదుకొనివచ్చు వ్యక్తి చాలదగ్గఱకు వచ్చెను. అతని కన్నులు మిఱుగుడు పురుగులవలె నుండెను. జయద్రథుఁడు గ్రహించెను. అతఁడు పులియై వచ్చుచున్నాఁడు. ఇప్పుడు కనిపించనేరాదు. ఇతఁ డెచ్చటికి పోవుచున్నాఁడు? రాజభవనమువద్దకా? ఇతని ననుసరించవలయునా? ఎదురు తిరిగి తనమీఁదఁ గలియఁ బడినచో నేమిచేయవలయును? తనచేతిలో ఖడ్గమున్నది. ఆపులి తన్ను గాయపఱచినను తాను దానిని సంహరించఁ గలఁడు. అతఁడు మానుషాకృతితోనుండి ఖడ్గధారియైనచోఁ దండ్రి కొడుకులలో నెవరుగెలుతురో చెప్పుటసాధ్యముకాదు. కాని తండ్రి వట్టిపులి. ఇతఁడు ఖడ్గవిద్యానిపుణుఁడు. ఇంత కును వానినిఁ జంపినచో తానుచేయుపని పితృవధము. అనుస రించవలయునా వద్దా? అనుసరించినచో నేమగును? అతఁ డెచ్చటికి పోవుచున్నాఁడు? పోయి రాజును సంహరించు నేమో! రాజభవనములోనికి పోవుటయెట్లు? రాత్రిపూట ద్వారబంధములు బిగించియుండును. ఖడ్గపాణులైన సేవకు లుందురు. అది సాధ్యమైన పనికాదు. తనయొక్క మనో వృత్తి తెలిసిన తనతండ్రి తన్నేవధించుటకీవేసముతో వచ్చె నేమో! అనుకొనుచుండెను. పులివచ్చెను. దిగెను. ఒడ్డె క్కెను. అడవిలోనికిఁ బోయెను. ఎచ్చటతిరిగెనో తెలి యదు. కొంతసేపటికి తిరిగివచ్చెను. మఱలఁ దెప్పకొయ్య యాధారముతోఁ దటాకము నీదికొంచుఁ బోవుచుండెను.

జయద్రథుఁడు తండ్రి ననుసరించి పోవుచుండెను. పోఁగా పోఁగా నా మహాజలపాతమువద్దకుఁ బోయిరి. తాను తన తండ్రి ననుసరించుచున్నానని యతనికిఁ దెలియకుండ నుండు టకు నానాఁడు శ్రీముఖశాతకర్ణి యెన్నియగచాట్లు పడెనో, అన్ని యగచాట్లు నేఁడు జయద్రథశాతకర్ణియుఁ బడెను. ఒక్కటియే భేదము. శ్రీముఖుఁ డా గుహలోనికిఁ బ్రవే శించెను. జయద్రథుఁ డా గుహలోనికిఁ బ్రవేశించలేదు. అతఁడట్లే యొకచాటుననుండి యాగుహవంకఁ జూచుచుం డెను. కొంత ప్రొద్దెక్కెను. తండ్రి పులివేసమునుఁబరిత్య జించి వచ్చి జలపాతముక్రింద స్నానముచేసెను. మఱల గుహలోనికిఁ బోయెను. ఇప్పటికి తనతండ్రి యునికిపట్టు వానికిఁ దెలిసెను. ఇప్పుడేమిచేయవలయును? ఇపుడు కాదు. తండ్రిలేనప్పుడు గుహలోనికిఁబోయి గుహనుఁ బరీక్షింపవల యును. ఆ గుహలోనికిఁ బోయినవాఁడు మఱలరాలేదు. బయటనుండి ప్రతీక్షించుచున్న కొడుకునకు ప్రొద్దుగ్రుంకెను. అతఁడు కొంతనీరుత్రావెను. ఏవో పండ్లుతినెను. ఈచెఱు వీదుటతో ఆవాగున కెదురీదుటతో నతని దేహసంధులన్నియు విశ్లథములయ్యెను. అతఁడు గుహకంతదగ్గఱి మేరలోనెందు కని కొండమీఁద నొకస్థలముచూచి తనయునికి సుస్థిరము చేసికొని నిదురపోయెను. అతనికి మఱునాఁడు ప్రొద్దెక్కి మెలకువ వచ్చెను. ఆరాత్రి యేమిజరిగినది? తానింతప్రమ త్తుఁడయ్యెనేమి? తొందరగానేఁగి స్నానముచేసి మఱలజపము చేసికొనెను. కోటికిని తనజపము పాతికవేలు మిగిలెను. మఱల నేవో పండ్లారగించెను. నెమ్మదిగా గుహవద్దకు

నడచిపోయెను. లోన నేమియు సవ్వడిలేదు. మిక్కిలి జాగ్రత్తగా లోనఁ బ్రవేశించెను లోన నెవ్వరునులేరు. ఆలోననున్న యే యే వస్తువులను పూర్వము శ్రీసుఖశాత కన్నిచూచెనో యితఁడు నా యా వస్తువులను దర్శించెను. అతనికివలెనే యితనికిని రెండువస్తువులు నిర్వ్యాజపాటు కలిగించెను. ఒకటి ఖడ్గములు. రెండు రంగులు. ఖడ్గములు చూచినంతనే యతఁడు తన తండ్రియన్న భావమునకు బలము కలిగెను. ఇతఁడును ప్రోవుచేయఁబడియున్న శబలధూళిరాళి త్రొక్కెను. ఇతని యొడలును జల్లుమనెను. ఇతఁడును గ్రహించెను. ఇది యేదో ముగ్గు. ఆ ముగ్గులోఁబడి పొరలాడఁగాఁ బురుషుఁడు వ్యాఘ్రమగును. అంతేకాదు. ఆ వ్యాఘ్రమగుటకుఁ బూర్వము కాంతారములోని యొక వస్తువును సంగ్రహించవలయును. వ్యాఘ్రమునకు లేదా వ్యాఘ్రరూపధారికి తద్వస్తు సంగ్రహణము సేఁతసులభమైనది. అందుకనియే తనతండ్రి కడచినరాత్రి వ్యాఘ్రముగా వెళ్ళి యుండును. వట్టిముగ్గు నేర్చినవానికి నది సాధ్యముకాదన్న మాట. ఇట్లాలోచించుచు నతఁ డచ్చట కూర్చుండెను. తనతండ్రి యెచ్చటికిఁ బోయియుండును. తటాకమునుదాటి పోయెనా? ఈసారి మనుష్యుఁడుగానే పోయెను. ఈచెఱువు భాగము తెంపులేకుండ నీదవచ్చును. తా నీదివచ్చినాఁడు. ఈ తెప్పకొయ్య యెందులకు? పులిగా నున్నపుడు సాధ్యముకాదేమో! ఇంతకును తన తండ్రి తెప్పకొయ్యను వదలిపెట్టినచోట తెప్పకొయ్య యున్నదో లేదో. అని పోయి

చూచివచ్చెను. తెప్పకొయ్య యచ్చటనేయున్నది. అతఁడెచ్చటికినిఁ బోలేదు. తాను గుహలో నున్నచో నతఁడు తప్పకుండ వచ్చును. వచ్చినపుడు మాటాడవచ్చును. అని కొడుకు మఱల గుహకుఁ దిరిగివచ్చి యచ్చటనే కూర్చుండెను. ఏదో యూహించుచుండెను. తన తల్లికి జరిగిన యవమానము తాను పడుచున్న యీ యిక్కట్లు, తన తండ్రియొక్క యీ దుర్వ్యవసాయము సర్వమును వాని మనస్సులో నిప్పులు రేగించుచుండెను. ఇంతలో నెవరో గుహలోనికి వచ్చిన ట్లనిపించెను, తలయెత్తి చూచెను. నిన్నటి పవలు దూరమునుండి చూచెను. నేఁటి పవలు దగ్గఱినుండి చూచెను. లేచి నమస్కారము చేయవలయునా? పాదముల మీఁదఁ బడవలయునా? తండ్రీ! నిన్ను చూచుట కెంత శ్రమపడితినని యనవలయునా? నా తల్లి నీకొఱకుఁ బరితపించి పోవుచున్న దనవలయునా? అహో! ఏమితండ్రి. కొడుకేమియు మాటాడలేదు. తండ్రి వచ్చి యేమనవలయును? ఎవరు నీవు? ఈ గుహలోని కెందుకు వచ్చితివి? అనవలయును. అతఁడు మాటాడలేదు. ఒకరినొకరు జూచుకొనిరి. అట్లే యైదు నిమేషములు కడచెను. తండ్రి వెనుతిరిగిపోయెను. కొడుకేమి చేయవలయును? అనుసరించవలయునా? అతఁడనుసరించలేదు. అచ్చటనే కూర్చుండెను. మఱలఁ దండ్రి కొంతసేపటికి వచ్చెను. కొడుకు:- ఎవరు నీవు? తండ్రి:- అదినే నడుగవలసిన ప్రశ్న. కొడుకు:- నే నడుగుచున్నాను, చెప్పుము. తండ్రి:- ఇది నా గుహ. నీ వెవ్వఁడవో వచ్చి

యిచ్చటఁ గూర్చుంటివి. నేనొక తాపసిని. తాపసికి సొంత మని లేదు. కనుక నీ వెవఁడవో వచ్చి నా గుహ నాక్ర మించితివని యనలేదు. తపస్సు చేసికొనుటకు నా కెంత యధికారమున్నదో నీకంత యధికారమున్నది. నీకుఁ గావల సినచో ఈ గుహను నీవు తీసికొనుము. ఈ గుహలోనుండి నీవే తపస్సు చేసికొనుము. నేను పోవుదును. కొడుకు:— తపస్సు చేసికొనువారు ఖడ్గములను దాచరు. పులులు కారు. ముగ్గులు వేయరు. ఇది యంతయు తుచ్ఛమైన నీచమైన నికృష్టశబరవృత్తి. తండ్రి:-ఎవని తపము వాఁడు చేసికొనును. నేను ఖడ్గముతోఁ దపస్సు చేయుదును. పులినై తపస్సు చేయుదును. అది నీ కెందుకు? నీ కిష్టము లేనిచో నావర్ణము లన్నియు బయట పాఱవేయుము. నా కత్తులను వెలికి విస రుము. నా దారిని నేను పోదును. నీవు నాతో వివాద పడుటకు వచ్చితివా? నేను నీతో వివాదపడను. నిజమైన తపస్వి యితరునితో వివాదపడఁడు. కొడుకు:- నేను తపస్విని కాను. నేనొక రాచవాఁడను. ఇతరులయందు దుర్వృత్తిని నేను సహించలేను. తండ్రి:- నీవు రాజవు కావు. న్యాయా న్యాయములు విచారించుటకు నీ కర్హతలేదు. కొడుకు:— ఉన్నది. తండ్రి:- ఉన్నచో విచారించుము - పది నిమేష ములు గడచెను. కొడుకు లేచి వెడలిపోయెను.

233

౯

దినదినము తోహారు ప్రొద్దుట రాజభవనమునకుఁ బోవును. అచటఁ జంద్రరేఖకొఱకుఁ బ్రతీక్షించును. ఆమె కనిపించనే కనిపించదు. ఎన్నాళ్ళని యిట్లు వృథాగాపోయి ప్రతీక్షించుట. అయినను కొందఱి ప్రకృతిలో నీపని చేయ వలయునని యనుకొన్నచో నది యేఱు నూతైనను నిట్లుద యించెడి సూర్యుఁ డట్లుదయించినను వారు మానివేయుట యుండదు. ఇట్టి ప్రకృతి నాగరకులయందు తక్కువగా జానపదులయందు కొంత యెక్కువగా నాటవికులయందు సమృద్ధిగా నుండును. ఆపని యట్లే చేయుచుందురు. దానిని మానివేయనే వేయరు. తోహారున కీ మహాప్రయత్నము నందు హఠాత్తుగా నొకనాఁడు ఫలితము గనిపించెను. చంద్ర రేఖ వచ్చెను. "ఉంటివా? ఇన్నాళ్లైనతరువాత నీవు కని పించలేవేమోనని భయపడితిని, కనిపించితివి. మీ జయ ద్రథుఁ డెచ్చటనున్నాఁడు? ఆతనితో మాటాడవలయును. ఈలోపల వ్యవహారము నాకుఁ దెలియకుండఁ బండిపోవు చున్నది. నే నొంటరిదాననై యీ గూఢరహస్యమును భేదించలేకున్నాను. జయద్రథుని పిలుచుకొనిరమ్ము. అతఁ డీనాఁడు వచ్చి తీఱవలయును. రాజసేవకు లితనిని నిరోధిం చరు. నే నావిషయములో కొంతశ్రద్ధ వహించితిని. నిశా వేళయందు రక్షకులైనవారితో నీమృగయాభవనమున జరుగు చున్న కొన్ని రహస్యములనుఁగూర్చి వారితో ముచ్చటించి

తిని. వారును నాకు సాయపడెద మన్నారు. జయద్రథుఁడు వచ్చినచో వా రతనిని నిరోధించరు. నేఁటిరాత్రికి జయద్రథుఁడు వచ్చితీఱవలయును. ఇప్పటికే యాలస్య మైనదేమోయని నాయనుమానము. నీ వీనాఁడు జయద్రథునిఁ గలసికొనఁగలవా? ఇది చాలయవసరమైనకార్యము. అనఁగాఁ దోహారిట్లనెను. "నీకార్యము సఫలమగును. ఈ మాట నాల్గుదినములక్రింద నాతోఁ జెప్పినచో నెంతో నిష్ప్రయోజనముగా నుండెడిది. మొన్నటివఱకు జయద్రథుఁడులేఁడు. నిన్ననే వచ్చినాఁడు. అతఁ డెచటికిఁ బోయినాఁడో నాకుఁ దెలియదు. అతఁడు వచ్చిన తరువాత నీవు నాకీవార్త నందించుటయే నీవుచేయఁబోవు ప్రయత్నము సఫలమగుననుటకు నిదర్శనము" అని తోహారు వెడలిపోయెను. జయద్రథునిఁ గలిసికొని చంద్రరేఖ చెప్పినమాటలను చెప్పెను. జయద్రథుఁడును సంతోషించెను. "నిజమే. ఇంతకుమున్ను చంద్రరేఖ భయపడవలసిన పరిస్థితులు జరుగలేదు. నేను మూనాళ్ళక్రిందనే యనుకొంటిని. ఈ వ్యవసాయ మేదో నాఁటివఱకు పరిపక్వతఁ గాంచలేదని నాకుఁ దెలియును. అప్పటినుండి మిక్కిలి శీఘ్రముగా నది జరుగుననియు నేను మిక్కిలి తొందర పడవలయుననియుఁ జంద్రరేఖ కిష్టమున్నను లేకపోయినను రాజసేవకులనుఁ బ్రతిఘటించియైనను నేను మృగయాభవనమునుఁ బ్రవేశింపవలయు ననుకొన్నాను. అంతగాఁ దీయించినచో రాజుతల తీయించును. అంతకంటె నేమిచేయును? నే నాయన కెదుటఁబడి తనకు రానున్న మహాపదను మొగముననే చెప్పివేయవలయు ననుకొంటిని.

కాని లోకములో నొకలక్షణమున్నది. ఎవఁడు దేనిని గాటముగా విశ్వసించునో వాఁడు వానినుండి తొలఁగిపోఁడు. వానిని దానినుండి తొలఁగించుట దుర్ఘటమైన విషయము. అది నిస్సంశయముగా వాని కాపద్ధేతువని నిరూపించి చూపించుము. వానికిఁ గ్రమ్మిన మాయ తొలఁగనే తొలఁగదు. ఈ లోక మట్టిలక్షణముకలది. ఈమోహముక్రమ్మట రాజునందెంత గాటముగా నుండునో సామాన్యునందు నంతియే గాటపుఁదనమును వెలయించుకొనును. రాజేదో మోహమునందుఁ బడి యున్నాఁడు. దాని స్వరూపమేదో నాకుఁ దెలియుటలేదు. ఆ పద్మరాణినిఁ గలసికొన్నచో నాకుఁ దెలియును. మానవ స్వభావములోని మఱియొక భూత మామెనుఁ బట్టికొన్నది. మానవునియందు జన్మసిద్ధములైన యజ్ఞానములు వందలు వేలును. వారి వారి కర్మానుగతి యొక్కొక్క జీవుని నొక్కొక్క యజ్ఞానభావమన్న దయ్యము పట్టికొని పాలార్చుచుండును. సరే. నేఁటిరాత్రికి చంద్రరేఖనుఁ గలసికొందును. చూచితివా నీవలన నాకెంత సాహాయ్యము జరిగినదో. ఆ దుష్టులైన సేవకులు నన్నిచ్చటికి రానీయరామెను. నీవు లేనిచో నాకీ వార్త తెలిసెడిదికాదు.'' — ఆ రాత్రిపూట రెండుజాములు దాటకమున్న అనఁగా నడిరాత్రివేళయందు జల్లుద్రథుఁడు మృగయాభవనమునకుఁ బోయెను. అతని నెవఁడో సైనికుఁడు చూచుటయుఁ బిలుచుటయు నితఁడు తన్నుఁదాఁ దెలిపికొనుటయు వాఁ డనుమతించుటయు మొదలైన కష్టమేమియు లేకుండఁగనే వానికొఱకుఁ జంద్రరేఖ ప్రతీక్షించుచుండెను. వాకిఁటిలోనుండియే ప్రతీక్షించు

చుఁడెను. జయద్రథుఁడేనా అన్న చంద్రరేఖ కంఠస్వరము భాసించి యతఁడామెను బోయి కలసికొనెను. ఆమె యతనిని సవ్వడిలేకుండ రాజభవనమునకు నుత్తరదిశయందున్న నొక విడిగదిలోనికి బొట్టనవ్రేళ్ళమీఁద నడిపించుకొనుఁ దీసికొని పోయెను. ఇద్దఱును చీకఁటిలోననే యుండిరి. ఆమె యతనితో నిట్లు చెప్పెను. "నేను పూర్వమే నీతోఁ జెప్పియుండ వలసినది. నేనప్పుడు నీకు చెప్పుటకు నాకు ధైర్యము చాల లేదు. రాణి కిష్టములేని విషయము నీతోఁ జెప్పుట భావ్యము కాదు. ఇప్పు డావ్యవహారము ముంచుకొని వచ్చినట్లున్నది. ఇప్పుడు నాకుఁ జెప్పక తప్పదు. నాకీ వ్యవహారము పాటలీపుత్రములో నున్నప్పుడే దెలియును. ఏదో యిది యంతయు గాలిమాటలు. దీనిలో యథార్థమన్నది యుండదు. ఇది యొక యింద్రజాలమువంటిదని రాజును వినోద పఱచుటకు సంకల్పింపఁబడినది. అట్టి దుర్ఘటమైన కార్యము సృష్టియందు సంభవించినపుడు చూచికొనవచ్చునులే యన్న ధైర్యము నాకు సగానికి సగముండెను. అయినను వాఁడు ధైర్యముచేసి రాజున కెదుటఁబడి—అదివఱకెన్నడు రాజుతో మాటాడని దానను – చెప్పితిని. అతఁడు చాల విచిత్రమైన పురుషుఁడు. ఆ రాజునుఁగూర్చి నీ కేమని చెప్పఁదును? ఆయన స్వభావము తెలియఁజెప్పుట సాధ్యముకాదు. నీవు శాతకర్ణివి. నాయందు సోదరభావము కలవాఁడవు. ఈ సమయము గడ్డు సమయము. దానినిఁగూర్చి సుంత నీతోఁజెప్పినచో మనము చేయఁబోవు పనికి నధిక ప్రయోజనము సిద్ధించునేమోయని చెప్పుచుంటిని కాని నిజానికిఁ జెప్పరాదు. ఆరాజు నన్నదివఱ కెఱుఁగఁడు.

రాజు నన్నుఁ జూచినచో నాయందు నతనికిఁ బ్రేమ కలుగు నేమో యన్న శంక పద్మరాణికి లేకపోలేదు. అందుచేత నామె నన్నెల్లపుడు రాజదృష్టికి తగులకుండ రక్షించు చుండెడిది. రక్షించుకొనుచుండెడిది. ఇట్లుండఁగా నొకనాఁడు నీ తండ్రి జయద్రథుఁడు వచ్చెను. అతఁడొక పదకమును వేసెను. పదకము వేసెననుటకంటె వలపన్ననుటమంచిది. ఆ వలలో రాజును పద్మరాణియు తగుల్కొన్నారు. అప్పుడు వలవేయలేదు. అతఁడు వలవేయుదమని మనసులోభావించి వేసినచో వీరిద్దఱు నందులో పడుదురా పడరాయన్న యూహతోఁ బాటలీపుత్రమునకు వచ్చెనని నా కనిపించినది. లేదా యింకొక విధముగాఁ జెప్పవచ్చును. అతఁ డచ్చటికి వచ్చి వీరి స్వభావమునుఁ గుర్తించి ఇట్టి లక్షణములుగల జంతువులను సంహరించుట కెట్టివల సిద్ధముచేయవలయును. అని విచారించుటకు వచ్చినట్లున్నది. ఇతఁడు వచ్చినప్పటి నుండి నా కతనియందు ద్వేషమే కలిగెను. అతఁడు నీకు తండ్రి. నేను నీతో నీమాటలు చెప్పుట యెంతవఱకు సమంజసమో నాకుఁ దెలియదు. నాకు నిన్నుఁగుఱించి యేమియు తెలియదు. రాజొక యాపదలో నున్నాఁడు. అతని నాపదనుండి సముద్ధరింపవలయునని నాకున్నది. నా యంతట నేనాపని చేయలేను. మఱియొకని సాయము నే నభ్యర్థించవలయును. ప్రస్తుతము నీవుతప్ప నా కింకొకఁడు కనిపించలేదు. నేను నిన్నభ్యర్థించుచున్నాను. ఏమిపని చేయుచున్నానో నాకు తెలియదు. నిజముగాఁ జూచినచో నీవు నీతండ్రి చేయుచున్నపనికి ననుకూలుఁడవై వర్తించవల

యును. అట్టి నీతో నేను నా రహస్యమును జెప్పుచున్నాను. నీసంగతి నాకుఁ దెలియదు. నీతండ్రియొక్క యీపన్నాగము నీకుఁదెలిసి వెలినుండివచ్చి నభ్యంతరములను నివారించుటకు నీవు పైనఁ దిరుగుచున్నావేమో? నీ వట్టివాఁడ వైనచో నేను నీతో నీమాటలు చెప్పుట దొంగచేతికిఁ దాళపుచెవి యిచ్చినట్లేయగును. నాకు గత్యంతరములేదు; నీవు నన్నుఁ దీసికొనిపోయి ముంచినచో నా యఖాతమున ముంచుము; నీ తండ్రి నిర్మించిన మహావర్తమున కభిముఖముగా నన్నుఁగూడ లాగికొనిపొమ్ము; లేనిచో దూరముగా లాగుము; ఆరాజుతో నే నిదివఱకు మాటాడలెదు; రాజును రాణియుఁగలసియున్నపుడు నేను వారికెప్పుడు దూరముగానేయుంటిని; వారిద్దఱే రహస్యములు చెప్పికొందురో; కాని మీతండ్రి వచ్చిన తరువాత మీతండ్రియు రాణియుఁగలసి మాటాడినప్పుడు వారిమాటలను నేను పొంచియుండి వింటిని; తరువాత రాణి పోయి రాజుతో మాటాడెను; అప్పుడును వారిమాటలను రహస్యముగా వింటిని; అట్టిపని తత్పూర్వము నే నెన్నడును చేయలేదు; ఆ రెండుప్రసంగములను విన్నతరువాత నాకు భయమువేసినది; పద్మరాణి నన్నెప్పుడును మన్నించదు! నేను చదువురాని దాననియు జానపదురాలననియు నవివేకురాలననియు నామె యుద్దేశ్యము; నాయందొక్కయౌవనమే యున్నది; తక్కిన యే తెలివితేటలును లేవు; అనియే యామె యుద్దేశ్యము; ఆమెతో నే నీసంగతిచెప్పి ప్రయోజనములేదు; ఆమె రాజుతో మాటాడి వెడలిపోయినతరువాత నేను సాహసించి రాజువద్దకుఁ బోయితిని; ఈజయభద్రఘుఁడు

విశ్వసనీయుఁడు కాఁడు; వానినిఁగూర్చి నాకు ధాన్యకటకములోఁ దెలియును. అతనిని నమ్మి నీవేట నీదినచో వాఁ డెచ్చటనో నట్టేట సుడిగుండముచూచి బుడింగుమని ముంచును. నే నీ కథ చెప్పుచుంటిని. రాజు నా యౌవనమును వర్ణింప నారంభించెను. నే నేమిచేయఁవలయును? రాజునందు నేను విముఖురాలనా కాను. ఓయి జయద్రథా! ఈ సంగతి చూడుము. అతని కొక యాపద రానున్నది. ఈ యాపద నుండి నిన్ను నీవు రక్షించుకొనుమని చెప్పుటకు వెళ్ళితిని. అతనికి నా యందుఁగల వాంఛ సుస్పష్టమైనది. అట్టిసంధిలో నేను పడితిని. జీవుఁడు తన స్వార్థము నెంత వాంఛించును? ఆ రాజునందు నాకుఁగల వైయక్తికమైన వాంఛా పరిపూర్తి యందు నా మన స్సెక్కువ లగ్నమైనది; అతనియొక్క భద్రతనుఁగూర్చి నేను వెళ్ళితినన్న భావమునకుఁ గొంతశక్తి తగ్గిపోయినది; నేనేమి చేయవలయును? తరువాత నే నతనినిఁ బలుసార్లు కలిసికొనుటకుఁ బ్రయత్నించితిని; ఆ నా ప్రయత్నమును విఘటితము చేయవలయునని పద్మరాణి; ఆ యడ్డంకులను దాటి యెట్లో యొకట్లు మఱల రాజుముందుఁ బడవలయునని నా కోరిక; ఆమె యధికారిణి; నేను చుట్టమనైనను పేదరాల నగుటచేత దాసీకల్పను; నాకు రాజును మఱల దర్శించుట సాధ్యపడనేలేదు; అతనికి నేను గనిపించినప్పుడు నాయందంత ప్రేమ ప్రకటించిన రాజు నన్నుఁ గలిసికొనుటకుఁ బ్రయత్నించవలయునుగదా? అట్టి ప్రయత్న మతని యందు దృశ్యమానము కాలేదు; ఈ మృగయాభవననిర్మాణ ప్రయత్నము జరుగుచున్నన్నినాళ్ళు పద్మరాణి నన్నిచ్చటకుఁ

దీసికొని వచ్చునో రాదోయని నాకు భయము; తీసికొని రానిచో నేమైనను సరే; మఱల రాజు నెదుటఁబడి యనుమతి యాయనద్వారా సంపాదించుటకు నిశ్చయించితిని; నీ కిది యంతయు వృథాగాఁ జెప్పితినేమో యనిపించు చున్నది; కాని జరిగినదంతయు చెప్పకపోయినచో నీవలన నే నర్థించు సాహాయ్యమునకు సంపూర్ణత కలుగదని యుండదని నా యభిప్రాయము; అందుచేతఁ జెప్పితిని; అసలు విషయము చెప్పనేలేదు; నే నన్నివిషయములను ప్రోవుచేసికొని వాని నుండి కొన్ని యభిప్రాయము లేర్పఱచికొని వానిని నీకుఁ జెప్పుచున్నాను; ఇందులో నాకుఁ దెలిసిన దిది; ఆ రాజు యొక్క యథార్థమైన స్వరూపము నాకుఁ దెలియదు; అతఁడు బిట్టు కాముకుఁడని నా యభిప్రాయము; అతని కొక యూహ యున్నది; అవునో కాదో చెప్పము; కాని అ[illegible] యిది; తాను మనుష్యుఁడు; రాజు; తాను వాంఛించిన స్త్రీనిఁ దాను పొందుటకు నభ్యంతరములేదు; కొండమీఁది కోతి యైనను వాఁడు కోరినచో దిగివచ్చును; తొలుత రాజు, తరువాత సుందరమూర్తి; మఱియుఁ దరువాత దాత; అతని నెవరు వాంఛించరు? కనుక నతనికి లోకమునందలి మనుష్య స్త్రీలయందలి వాంఛ పర్యాప్తమైనది; అతని కొక యూహ యుదయించినట్లు నే ననుమాన పడుచున్నాను; ఆ యూహ యేమనఁగా మానవస్త్రీ ఆడులేఁడియో, యాడుపులియో, వానరియో యైనచో నట్టి స్త్రీతో సంగమించవలయుననియో దానిని చూచి యానందించవలయుననియో యా కోరిక యెట్టిదయో నాకుఁ దెలియదు. అట్టి రాజున కిట్టి కోరిక

యేమియోకూడ నాకుఁ దెలియదు. ఇది యేమి కోరిక? అసహజముగా నున్నది. అహో! ఈ సృష్టిలోని కామమునకు నియమ మని లేదు. ఈ బుద్ధి లోక నియమమునుకూడ దాటి పోయినది. నియమము లేకపోవుట అనఁగా మనుష్య జాతి యందలి హద్దు పద్దు లేకుండ ప్రవర్తించుట. ఇది మానవ జాతిని దాటిపోయిన హద్దు పద్దు లేకపోవుట. ఈ యూహ సామాన్య పురుషునియందో, స్త్రీయందో యైనచో నది శిక్షార్హ మగును. ఈ యూహ కలిగిన దొక రాజునకు. ప్రజలను శిక్షించెడివాఁడు రాజు. వానిని శిక్షించెడివాఁ డెవఁడు? రాజులయొక్క దోషము లీరీతిగా లౌకిక శిక్షను దాటిపోయి పారలౌకికశిక్షను వాంఛించుచున్నవి. అందుచేతఁ గూడఁ బరలోక ముండక తప్ప దనిపించుచున్నది. అనఁగా జయద్రథుఁ డిట్లనెను. "చంద్రరేఖా! నీవు తెలివితక్కువదాన ననుకొనిన పద్మరాణియొక్క వివేకమును సంశయింపవలసి వచ్చుచున్నది. చంద్ర:- ఆమె చాల చదువుకొన్నది. ఖడ్గవిద్యా నిపుణురాలు. రాజనీతి చక్కఁగాఁ దెలిసిన వ్యక్తి. ఆమె తండ్రి యామె నిచ్చటి కెందుకు పంపెననఁగా శ్రీముఖ శాతకర్ణికి ప్రతిస్పర్థినిగాఁ బంపెను. ఆమె వివేకవతి యను కొనుటకు సందేహపడ నక్కఱలేదు. జయ:- ఇంత చదువు చదువవచ్చును. దానికి తగిన వివేకము లేకపోవచ్చును. ఆమె నిజముగా వివేకవతియైనచోఁ దాను వచ్చి రాజునకుఁ బ్రియురాలై యైదాఱేండ్లు గడచినది. ఈపాటికి రాజ్య మామె చేతిలో నుండవలసినపని. చంద్ర:- ఉండెడిదే. కాని యామెయు రాజును నొక తీవ్రమైన లోతైన వలపులో

మునిఁగియున్నారు. ఆ రాజునకు తన భార్యయైన పద్మరాణి యాఁడు లేఁడియో, యాఁడు పులియో కావలయును. ఇతర స్త్రీ లైనచో పనికిరాదు. అతనియందుఁగల సర్వస్త్రీభావము పద్మరాణి మయముగా నుండును. సృష్ట్యాదియందు ప్రజాపతి యున్నాఁడు. అతఁ డొక్కఁడే పురుషుఁడు. అతనియందు స్త్రీభావ ముదయించినది. రాజు ప్రజాపతి యైనచో పద్మరాణి యా స్త్రీభావమూర్తి. రాజునకు పద్మరాణియనఁగానది. జయ:- నీకింత పాండిత్య మెచ్చటిది? నీవు చదువుకొనలేదంటివికదా? చంద్ర:- ఆ సంగతి యట్లుంచుము. అందు కనియే చదువుకొనినవానికంటెఁ జాకలివాఁడు మేలందురు. ప్రస్తుతము ఈ భావముమీఁద నీ తండ్రి తాండవించుచున్నాఁడు. అతనికిఁ బులియగుట చేతనగునట. అది యెట్లు చేతనగునో నాకుఁ దెలియదు. అది యసంభవమైనవిషయము. ఈ పిచ్చిరాణియు పిచ్చిరాజును వానిని నమ్ముచున్నారు. ఇందులో నేదో మోసమున్నది. పద్మరాణి నాడుపులిగాఁ జేయఁగల్గుదునని నీ తండ్రి వా రిద్దఱిని నమ్మించినాఁడు. ఈ మూఢవిశ్వాసములోఁబడి వారు కొట్టుకొనుచున్నారు. అతనికి వీరిని మోహములోదించి యే మైకములోననో పెట్టి రాజును సంహరింపవలయునన్న యూహ యున్నదని నే నను కొను చుంటిని. అంతకంటె నిందులోనున్న రహస్య మేమియును లేదు. ఇప్పు డేమి చేయవలయునో నాకు తోచుట లేదు. రాజు నెందుకు చంపవలయును? ఇప్పుడు రాజు చచ్చినచో శ్రీముఖశాతకర్ణి వెంటనే రాజగును. సాహసించి నే నీ సంగతి పద్మరాణితో చెప్పితిని. "ఏమమ్మా! నీతండ్రి

నిన్నుఁ బంపించినది శ్రీముఖశాతకర్ణి మగధరాజ్యము నాక్ర మించకుండఁ జేయుటకుఁగదా! నీవు రాజుయొక్క వలపులోఁ బడి నీ నీతిశాస్త్రజ్ఞతకుఁ బ్రయోజనము లేకుండఁ జేసితివికదా? ఇదివఱకే రాజ్యమంతయు శ్రీముఖుని యధీనమునందున్నది కదా? ఈ నట్టడవిలో నీ భర్త చనిపోయినచో దిక్కుదిబాసు లేని చావగునుకదా! రాజు వేటకు వెళ్ళెను. అచట నొక పులి వానిని సంహరించెను. ఆ రాజునకు సంతానము లేదు. వెంటనే తానే రాజగును. శ్రీముఖుఁడు రాజగుటకు నీకంటె సహాయపడినవా రెవరగుదురు? అనఁగా నామెకు నామాట రుచించలేదు. ఒకవేళ నామాటలోని యర్థమును విచా రించెడిదేమో, నాకు రాజుమీఁదఁ గోర్కె కలదన్న యీర్ష్య నా వాక్యములందలి యర్థమును భావించనీయలేదు. ఇది జరిగిన వ్యవహారము. ఈ నట్టడవిలో రాజునుఁ జంపినచో విచారణలేదు. వాని దారిని వాఁడు పోవును. ఇది శ్రీముఖు నకు మిక్కిలి మేలు. రాజునుఁ బద్మరాణియే వధించినదని చెప్పవచ్చును. ఆమెను నిర్బంధింపవచ్చును. ఆమెను ప్రాడ్వివాకులయెదుటఁ బెట్టవచ్చును. ఆమెను శిక్షించ వచ్చును. అతని కార్యము సులభముగాఁ గమ్మికొనిపోవును. నాకు నాలుగైదు దినములనుండి యలజడి యెక్కువైనది. ముందు నీకొక సంగతి చెప్పవలయును. ఈ భవనిర్మాణము యొక్క పద్ధతి నీకుఁ దెలిసినఁగాని యిందులో నీవు నాకు సాయపడలేవు. నీవు పగలు దూరమునుండి చూచి యుండ వచ్చును; అది వట్టి బహిరాకృతి; నేలమీఁద గీసి చూపించ వచ్చును కాని యీ చీఁకటిలో నది సాధ్యముకాదు; కనుక

చెప్పెదను వినుము; ఈ మృగయాభవననిర్మాణ మిట్లున్నది; నాలుగు గదుల పెట్టుసావడి ముందున్నది; వెనుక నా ప్రమాణములో రెండు సావడు లున్నవి; వెనుకటి రెండు సావడులు నాల్గు నాల్గు గదులుగా విభజింపఁబడిన వనుకొనుము; నడిమి సావడి మేరయు వెనుకటిసావడి మేరయు దక్షిణపువైపున నొకదాని నొకఁ డంటుకొనిన నాల్గు గదులున్నవి; అనఁగా వెనుకటి రెండుసావడులమేర రెండు సగములయందు గదులు లేవు; కాని సావడులయొక్కచివళ్ళ రెండుగదులున్నవి; అనఁగా నాల్గుగదులమేరలో దక్షిణపుదిశయందు రెండురెండుగదులు కలవు; ఉత్తరపు దిశయందు గది కలదు; నడిమి మేర యందు రెండుభాగములయందు గదిలేదు. అనఁగా నీ నాల్గుగదులలో నేమిజరుగుచున్నదో తక్కినగదులలోనున్న వారికిఁ దెలియదు. అచ్చముగా నాగదులు నాల్గును రాజునకు రాణికిఁ బ్రత్యేకింపఁబడినవి. భవనము మూఁడు సావడులమేర నడిమి సావడిమేరలో పూర్తిగా దక్షిణమునందున్న గది రాజు పడకగది. దాని నంటుకొని యుత్తరమునందున్న గది రాణియొక్క నివాసగృహము. వానికి పశ్చిమము నందున్న రెండుగదులును రాజుయొక్కయు రాణియొక్కయు దుస్తులు నలంకారములు మొదలైన వుండుట కేర్పాటైన గదులు. ఈ నాలుగుగదులు నొక కోటవంటివి. వానిలో నుండి వెలికి గవాక్షములులేవు. రాజుగదిలోనుండి దక్షిణ దిశగా దొడ్డిలోనికిఁ బోవుటకు ద్వార మున్నది. ఈనాలుగు గదులలోనుండి యొకదానిలోనుండి యొకదానిలోనికిఁ బోవుటకు ద్వారములున్నవి. వెనుకటి మూఁడవసావడి మేరలో

నున్న రెండవగది యనఁగా దక్షిణపుదిశ నంటికొనియున్న గదికాని గదినుండి దొడ్డిలోనికి ద్వారముకలదు. భవన మంతయు చూచుచునే యున్నావుకదా ప్రాగ్దిశాభిముఖముగా నున్నది. నేనుండు గది యుత్తరదిశయందు నడిమిసావడి మేరలోని చివరిగది. వంటకు భోజనమునకుఁ బడమటివైపున వేఱే యిల్లున్నది. అది రాజు నివసించుగదులమేరకు సూటిగా నెట్టయెదురునయున్నది. నేను తొలుత నిన్నెచ్చటచూచి తిని. నాగదికి గవాక్షముపైన నున్నది. నేను నిచ్చెన నొకదానిని వేసికొని యా గవాక్షములోనుండి యుత్తర దిశగాఁ జూచితిని. ఆనాఁడు నీవచట నాకుఁ గనిపించితివి.

జయ:-నీదగ్గఱ నిచ్చెనయున్నదా? చంద్ర:-ఉన్నది. అది యొక్కటియే నా కాశను కలిగించుచున్నది. ఏలయనఁగా రాజును రాణియునున్న నాల్గుగదులు నొక్కప్రదేశమైనచో బయటనుండి లోనికి చూచుటకు వీలే లేదు. ఆ నాల్గు గదులలో నొకదానిలోనుండి యొకదానిలోనికిఁ బైయెత్తున గవాక్షములుకలవు. ఏదైన యాపద జరిగినచోఁ బ్రధాన ముగా రాజుగదిలో జరుగును. అచ్చట నేమిజరుగునో తెలిసికొనుట యసంభవము. ఈ జయద్రథుఁడు తానెచ్చట నుండునో తెలియదు. పడమటి దిశగా రాజుగది నంటు కొనియున్న గదిలో నతఁ డుండునని నా యుద్దేశ్యము అనఁగా మూఁడుగదులలో వెలుతురుండును. పడమటివైపు దొడ్డిలోనికి త్రోవగలిగిన గదిలో వెలుతురుండదు. ఆ గదిలో నిచ్చెనవేసికొని చూచినచో పైగవాక్షమునుండి రాణి గదిలో నేమిజరుగుచున్నదో జయద్రథుని గదిలో నేమి

జరుగుచున్నదో చూడవచ్చును. రాజుగదిలో నేమిజరుగు చున్నదో చూచుటకు వీలే లేదు. కాని నాలుగుగదులలో నొకదానిలోనుండి యొకదానిలోనికిఁ బోవుటకు ద్వారము లున్నవి. పడమటి దొడ్డిలోనికి వచ్చుటకు ద్వారముగల గదిలోనుండి రాణిగదిలోనికిఁ బోవచ్చును. జయద్రథుఁ డుండునని నే ననుకొనుచున్న గదిలోనికిని బోవచ్చును. రాజున్న గదిలో నేమిజరుగుచున్నదో చూడవలసినచో రాణి గదిలోనుండియో జయద్రథుని గదిలోనుండియో మాత్రమే చూడఁగలను. ఇదిస్థితి. మొట్టమొదట నాగదిలోనికి పోవుటయెట్లు? ఆలోనికి నిచ్చెనను తీసికొనిపోవుట యెట్లు? ఆలోనికి నిచ్చెనను తీసికొనిపోవుటయెట్లు? కాని గదులు పెద్ద విశాలమైనవికదా? జయ:- లోననుండెడు దీపములు పెద్ద వియా? చిన్నవియా? చంద్ర:-రాజుగదిలోని దీపమును రాణి యొక్క గదిలోని దీపమును మిక్కిలి ప్రకాశవంతములుగా నుండును. జయద్రథుని గదిలోని దీపము గ్రుడ్డిదనియే చెప్ప వచ్చును. జయ:-అయినచో మనమెట్లో యొకట్లు పడమటి దెసనుండి యాఁగదిలోనికిఁ బోయినచో నెట్లో యొకట్లు సంబా ళించుకొనవచ్చును. చంద్ర:-మనమిద్దఱము పోవుట సాధ్య మగునా? నే నొకరుఁడను బోయినచో రాణి నన్నుఁజూచి నచో నన్ను బ్రతుకనీయదు. జయ:-నేను పోయెదను. చంద్ర:-నీ వెవ్వఁడవో నీతండ్రికిఁ దెలియునా? జయ:-తెలి యును. తెలియదు. చంద్ర:-నాకొక యనుమానమున్నది. అతని కెప్పుడేది యెట్లుజరుగునో తెలియును. అతని వివే కములోకాతీతమైనది. నేను దానిని గ్రహించితిని. ఒక

నాఁడు నేను రాజుయొక్క గదినుండి దక్షిణదిశగాఁ దెలిచి కొనెడి ద్వారమువద్ద నిలుచుంటిని. ఆలోపలనున్న యతఁడు వెనుకనుండివచ్చి నన్నుపట్టుకొని దూరముగాఁ దీసికొనిపోయి "ఓసి చంద్రరేఖా! రాణితోఁజెప్పి నిన్నిప్పుడు శిక్షింపఁ జేయఁగలను. నీవిచ్చట దాఁగియున్నావని నాకుఁదెలియును. నాకు స్ఫురించును. నాకెవ్వరును చెప్పలేదు. లోన నేమి జరుగుచున్నదో తెలిసికొనుటకు ప్రయత్నము చేయకుము. అది నీ ప్రాణములమీఁదికి వచ్చును. బయట నిలుచున్న నిన్ను బయట నిలుచున్నట్లుగానే పులియో గొంతునుండి దుఃఖరావముకూడ సన్నగానైన వెలికిరాకుండునట్లు పీక బిగించి యెత్తుకొనిపోయినచో నీవేమి చేయఁగలవు? అని నన్ను వదలిపెట్టెను. నే నచ్చట నిలుచుండవలయునని లోనేమి జరుగుచున్నదో తెలిసికొనవలయునని యనుకొని నట్లెవ్వరికిని తెలియదు. నాకాయూహ యంతకుముందే తోఁచినది. భవనముయొక్క పడమటిదెసనుండి వెళ్ళినచోఁ జీఁకటిలోనున్న యాగది కవాటమునుండి నేను కనిపింతు నేమోయని భవనముయొక్క ముందుదెసనుండి తిరిగిపోయి తిని. అతని కెట్లు తెలిసినది? ఆతఁడు మనుష్యుఁడు కాఁడు. వానికేవో యధికములైన శక్తులుకలవు. నీవు లోనికిఁ బోదువు. గదిలో నెవఁడో యున్నాఁడని వాఁడు నిస్సంశయ ముగా గ్రహించును. ఉన్నదున్నట్లు నీకు చెప్పుచున్నాను. నేను నిన్నాపదలోనికి దించుట నా కిష్టములేదు. నీవును నీ తండ్రియు నొక్కటియే యైనచో నాపదకమునకు నా ప్రయత్నమునకు వచ్చిన యధికనష్టములేదు. ఒక్కటే నష్టము.

నేను నీ తండ్రి ప్రయత్నమునకు వ్యతిరేకురాలనని విస్పష్టము చేసికొనుచున్నాను. అపుడు నీవుగాని నీతండ్రికాని నన్నేమి చేయఁగలుగుదురు. ఏపులినోటనో వేయుదురు. నష్టము లేదు. నీవు నీతండ్రియొక్క వృత్తికి వ్యతిరేకివైనచో నేను చేసెడి ప్రయత్నమునకు కొంత సాయపడుదువు. ఇది యంతయు నే నాలోచించియే నీతోఁ జెప్పుచున్నాను. ఇందులోఁ దోహారు నా కుపయోగపడలేఁడు. తక్కిన పరిచారికలవలననుఁ బరిచారకుల వలనను నాకేమియు లాభము లేదు. వారందఱు ప్రాగ్దిశయందు దూరముగానున్న భవనములో రాత్రులందు నివసించుచుందురు. ఎవఁడో యోగి వచ్చుచున్నాఁడు. రాజును రాణియు వానివలన వేదాంతము వినుచున్నారో, యుపదేశము పొందుచున్నారో యని మాత్రమే తక్కిన వా రనుకొనుచున్నారు. నేనుకూడ నిజముగా వారితోఁబాటు పరిచారకుల భవనమునం దుండవలసినదాననే. కాని కొద్ది చుట్టరికముచేత నీ భవనమునందే దూరముగానున్న గదిలో నన్నుండనిచ్చుచున్నారు. జయ:- చంద్రరేఖా! నీవన్నమాట చాలనిజము. నే నా గదిలోనికిఁ బ్రవేశించినచో నేనచ్చట నున్నానని యాయనకు నిస్సంశయముగాఁ దెలియును. చంద్ర:-అయినచో వెళ్ళవద్దు. జయ:- వెళ్ళుదును. చంద్ర:-అతఁడు నిన్ను వధించినచో? జయ:- నే నతని కొడుకునుగదా! నన్నువధించఁడు. చంద్ర:- నీ వతనికి వ్యతిరేకివా? అనుకూలుఁడవా? మొదట నాకది చెప్పుము. జయ:- నే నెట్టివాఁడనైన. నీకేమి? నాతోఁ జెప్పఁదగినదంతయుఁ జెప్పివేసితివి. ఇంక నన్ను వదలిపెట్టుము.

చం|ద:-కాని నన్నొకయాశపెట్టుకొని కూర్చుండుమందువా? జయ:-భగవన్నామము స్మరించుకొంచు కూర్చుండుము. చం|ద:-ఓయీ! నీమాటలు నన్ను చంపుచున్నవి. చంపుట లేదు. ఈస్థితిలో నాకేదో తేల్చిచెప్పినచో నాగుండియకు నిలుకడగాని లేనిచో నాస్థితి యెట్లుండునందువు. జయ:- నీకుఁ దేల్చి చెప్పుటకు నాకు సావకాశములేదు. నే నొక్క-టియే చెప్పుచున్నాను. నీకది చాలును. నేను నాతం|డికి వ్యతిరేకిని. చం|ద:- నిజముగానా ? జయ:- నిజముగానే. చం|ద:-నన్ను భగవన్నామము చేయుమంటివి ? ఏ భగవం తునిఁగూర్చి. జయ:-మనము మాటాడుచుండఁగా నెంత సేపైనదో నీకుఁ దెలియునా? నేను లోనికిఁ |బవేశించుటకు నాగదియొక్క- తలుపు తెఱచియున్నదో లేదో. తెఱచి యున్నచో వెళ్ళఁగలుగుదును. లేనిచో వెళ్ళలేను. ముందా సంగతి చూచికొని రావలయును" అని జయ|దథుఁడు బయలుదేఱెను. చం|దరేఖయొక్క- గదిలోనికి నొక్కఁడే మార్గమున్నది. ఆమె గది నంటికొని పడమటి దిశ యందుఁగల వెనుకటి గదిలోనికిఁబోయి యుత్తరముగానున్న ద్వారమునుండి దొడ్డిలోనికిఁబోయి పడమటి వైపునకు మఱలి యా గదిలోనికిఁ బోవలయును. ఆ |త్రోవనుండియే చం|దరేఖ యతనిని తన గదిలోనికిఁ దీసికొనిపోయెను. చం|దరేఖ గదిలోని దీపము |గుడ్డిదీపము. వా రింతసేపును రహస్యముగానే |బసంగించుకొనుచున్నారు. తమ |పసంగము పెఱలకు వినిపించునేమో యన్న భీతి చం|దరేఖకు కలదు.

ఏల యనఁగా మనమొక చోటనుండి యొకటే ధోరణిగాఁ గొంతసేపు మాటాడుచున్నచో నా సవ్వడితరంగములు సన్నని ధ్వని ధారగా వాయువీథులయందుఁ బ్రసరించు చుండును. ఆ ధారయొక్క సాంతత్యము సన్నని యీల విడుపులేకుండ సాగుచున్నట్లు దూరము వారికి వినిపించును. చంద్రరేఖ కొక్కటే ధైర్యము. ఆ గదిలో నున్నవారు తామొక మహాకార్యమునందు నిమగ్నులై యుండవచ్చును. ఆ కార్యవ్యగ్రత యింతసన్నని పెలుసవ్వడిని పాటించనీయదు. అపుడు జయద్రథుఁ డిట్లనెను. ఇంతకుఁ బ్రధానము నిన్నడుగ వలసినది యడుగనేలేదు. వారేది చేయఁదలఁచుకొనిరో అది యీ రాత్రియే చేయుదురని నీకనుమానమెందుకుఁ గలిగినది.
చంద్ర:- నిజమే. నే నా సంగతియే చెప్పలేదు. అతఁడు మృగయాభవనమునకువచ్చి యైదాఱుదినములైనది. మఱల నీనాఁటి ప్రొద్దుటనే వచ్చెను. అప్పటికే సేవకులును మేల్కొని లేరు. అదివఱకు నాలుగైదుసార్లు వచ్చినపుడెల్ల నేవో చిన్న చిన్న మూటలు తీసికొని వచ్చెడివాఁడు. ఆ మూట లిచ్చట వదలిపెట్టి వెళ్ళిపోవుచుండెడివాఁడు. ఈనాఁడు చేతులు జాడించుకొనుచు వచ్చెను. నా కనుమానము వేసినది. చేర్చవలసినవన్నియు నిదివఱకే చేర్చినాఁడు. ఈనాఁడు తుది ప్రయత్నము చేయుటకే వచ్చియుండవచ్చును. అనుకొంటిని. మఱియు నింకొక్కటి జరిగినది. అతఁడు వచ్చెడివాఁడు. కొంతసేపుండి వెళ్ళెడివాఁడు. ఈ నాఁ డిట్లు జరుగలేదు. అతఁడు వెళ్ళనేలేదు. అయ్యయ్యో, నా తెలివి కాలిపోను.

అతఁడు నిన్న ప్రొద్దున వచ్చెనయ్యా. నా మనస్సు మన స్సులో లేదు. చూచితివా? అతఁ డీనాఁడు వచ్చెననుకొను చుంటిని. అతఁడు నిన్ననే వచ్చెను. ఇంతవఱకు రాజసౌధము వదలి పోలేదు. కడచిన రాత్రియే యేదో మహాఘోరము జరుగు ననుకొంటిని. ఆ ఘోర మింతవఱకు జరుగలేదు. ప్రొద్దు క్రుంకువఱకు జరుగలేదు. ప్రొద్దు క్రుంకువేళ నేను బద్మరాణినిఁ జూచితిని. అతఁడు నేటి ప్రొద్దున వచ్చినచో నేను నీకు వార్త యెట్లంపఁగలను. అతఁడు నిన్న ప్రొద్దుటి వచ్చినాఁడు. కడచిన రాత్రియెల్ల నాకు నిదురలేదు. తెల్ల వాఱిన తరువాతఁ దోహారు కనిపించినాఁడు. వానితోఁ జెప్పితిని. నీవు వచ్చితివి. ఆతఁడు వచ్చినది నిన్న ప్రొద్దుట. అతఁడు బయటికే రాలేదు. లోన నేమి చేయుచున్నాఁడో తెలియదు. పరిచారకు లెవ్వరును నా దెసకుఁ బోరాదని రాజాజ్ఞ యైనది. రాజునకుఁ బ్రతిదినము భోజన మాయనగది లోనికే పోవుచుండును. నిన్నను నేఁడును రాజును రాణియు నిద్దఱు వంటశాలలోనికిపోయి భోజనముచేసిరి. అందఱ కిది యాశ్చర్యముగా నుండెను. నీ వేమిచేసిననుసరే. నీవు పొమ్ము. చేతనైనచో సాయపడుము. లేనిచో నీ మహా ప్రవాహములోఁ గొట్టుకొనిపోవుచున్న మమ్ము మొసలివలె నీటిలోనికి గుంజుకొనుము. ఇంతే నేను చెప్పవలసినది." అని చంద్రరేఖ మొగముమీఁదఁ జేతులు పెట్టుకొని సన్నగా నుండి యుండి యేడ్వ నారంభించెను. జయద్రథుఁ డామెను వదలి దొడ్డిలోనికిఁ బోయెను. గోడవెంట నక్కి నక్కి

నడచుచు పడమటివైపున రాజనివాసమైన యీ నాల్గు గదులలో పడమటిదెసకు ద్వారముగల గది కవాటాంచలమున నిలుచుండి లోనుండి ఏదైన సవ్వడివచ్చునేమోయని వినుచుండెను. ఏమియు వినిపించలేదు. తలుపుటెక్కలు దగ్గఱగా వేసియున్నవి. లోన గడియ బిగించియున్నదా? త్రోసి చూడవలయును. త్రోసినచో ద్వారబంధము కిఱ్ఱుమనునేమో, ఒకగాలి తెరను రానిచ్చెను. ఆగాలి తెర వచ్చినపుడు తలుపును త్రోసెను. తలుపు తెఱచుకొనెను. గాలి లోనఁ బ్రవేశించెను. తనదోషము లేదు. లోననెవరైన నున్నచోఁ దలుపు గాలికే తెఱచుకొనె ననుకొందురు. మఱలఁ దలుపు మూయఁబడినచో నాగదిలో నెవ్వరో యుండిరనుకొనవలయును. తలుపు మూయఁబడలేదు. ఆగదిలో వెలుతురులేదుకనుక దొడ్డిలోనికి వెలుతురు రాలేదు. ఆ గదిలోనుండి రాణి గదిలోనికి త్రోవయున్నదని చంద్రరేఖ చెప్పినది. సామాన్యముగా ద్వారము లొకదానికి సూటిగా నొక్కటియుండును. రాణి గదిలోని వెలుతురు రాణి గదియొక్క ద్వారము తెఱచియున్నచో దొడ్డిలోనికిఁ గొట్టవలయును. కొట్టలేదుకనుక రాణి గదియొక్క ద్వారము మూయఁబడియున్నది. జయద్రథుని గదిలోనుండి యీ గదిలోనికినున్న ద్వారముకూడ తెఱచుకొనియున్నదా? ఉన్నచో నాగదిలో దీపమున్నచో నీ గదిలోనికి వెలుతురువచ్చును. గదిలో వెలుతురున్నదో లేదో తెలిసికొనుటకు తొంగిచూడవలయును. సాహసించి తొంగి

చూచెను. ఆ గదిలో వెలుతురులేదు. నడుమ ద్వార మున్నచో నాద్వారము మూయఁబడి యుండెనా? ఆ గదిలో వెలుతురేలేదా? వెలుతురులేనిచోఁ దాను సాహసించి ప్రవేశించినచో నా గదిలోనున్న పురుషునకుఁ దాను కనిపించును. రెండు గదుల నడిమిగోడలో ద్వారమున్నచో నా ద్వార మెచ్చట నున్నదో దూరముగా నున్నదో దగ్గఱ నున్నదో. అతఁడు లోనికిఁ బ్రవేశించి గోడల నంటికొని సంచరించ వలయును. తాను కవాటమునకు నుత్తర దిశాంచల మందున్నాఁడు. దక్షిణదిశాంచలమునందుండి యైనచో ద్వారము నంటికొని యొత్తిగిలి లోనఁ బ్రవేశించి లోనిగోడ నానుకొనిపోవచ్చును. అందుచేత నతఁడు నేలమీఁదఁ బండుకొని ప్రాకి కవాటమును దాఁకి మఱల నిలుచుండి దక్షిణ కవాటాంచలము నత్తుకొని లోనికిఁ బ్రవేశించెను. పడమటి గోడ నానుకొని నిలుచుండెను. తన కెడమవైపున గదియొక్క ద్వారము దూరముగా నుండెను. అది యించు మించుగా నా గోడ ముందటిగది నానుకొనియున్న చోట నుండెను. ఇతఁడు గోడవెంట పడమటిగోడ చివరిదాకపోయి మఱలఁ దూర్పుగాతిరిగిన గోడవెంట గవాటమువఱకుఁబోయి లోనఁ జూచెను. ఆ లోన సన్నని దీపమున్నది. ఆ దీపపు వెలుతురు తానున్న గదిలోనికిఁ బ్రవేశించుటకుఁగూడ దానికి శక్తిలేదు. తొంగి చూచెను. లోన నెవ్వరును లేన ట్లుండెను. ఒకవేళఁ దానే గోడ నానుకొని యుండెనో యా గోడ నానుకొని యా గదిలో నాతలివేపునఁ బురుషుఁ

డున్నచోఁ దనకుఁ గన్పించఁడు. అతఁడు తలయెత్తి చూచెను. తా నానుకొనియున్న గోడ పైభాగమున చిన్న గవాక్ష మున్నది. ఆ గవాక్షములోనుండి చూచినచో లోన నేమి యున్నదో తెలియును. చంద్రరేఖ గదిలోనికిఁ బోయి నిచ్చెన తెచ్చినచో నెట్లుండును? అంతకన్న చేసెడి దేమియు లేదు. లోన నేమి జరుగుచున్నదో తెలియదు. కాలము వృథాగా గడచిపోవుచున్నది. మఱల నా గోడవెంట నెమ్మది నెమ్మదిగా సాగి యతఁడు బయటికి వచ్చెను. నిచ్చెనకొఱకు పోకముందు రాజుయొక్క శయ్యాగృహముయొక్క దక్షిణ ద్వారము తెఱచికొనియున్నదా లేదా చూడవలయు నని పించెను. అతఁ డా రెండుగదుల మేర పొడుగును దక్షిణదిశగా నేఁగి తొంగి చూచెను. రాజుయొక్క శయ్యాగృహ ద్వారము తెఱువఁబడియే యున్నది. లోనుండి వెలుఁగు బయటకు వచ్చుచున్నది. ఆ వెలుతురు చూచినంతనే వానికొక ధైర్యము కలిగెను. అది యంతటి రహస్యకార్య మైనచో రాజుయొక్క గది తలుపు తెఱచియుండునా? పోయి రాజు గదిలోనికి తొంగి చూచినచో నేమగును? అది చేయకూడదు. అతఁడు వెనుకకు వచ్చెను. ద్వారబంధపుమేర ప్రాకిపోయెను. చంద్రరేఖ గదిలోనికిఁ జేరెను. ఆమెతోఁ జెప్పెను. నిచ్చె నను తీసికొనెను. దానితో బయలుదేఱెను. తన యీ ప్రయ త్నము నిశ్శబ్దముగా సాగించుమని తన యిష్ట దైవమును ప్రార్థించెను. నిచ్చెనను లోనికిఁ జేర్చెను. దానిమీఁద నెక్కి జయద్రథుని గదిలోనికిఁ జూచెను. అందులోనున్న

చిన్న దీపముయొక్క కాంతి దూరమునకుఁ బోకపోయినను పైకిఁ బ్రసరింపకపోయినను నేలమీఁదఁ గొంతమేర పడుచునే యుండెను. నేల యంతయు వన్నెలు వన్నెలుగా నుండెను. వెంటనే జయద్రథునకుఁ దెలిసెను. అతఁడేమిచేయవలయును? ఇంతవఱకు పులికాలేదు. అయినచో గజ్జలుగాని సందడికాని యేమియు జరుగలేదు. ఏస్థితిలోనున్నది. పైనుండి చూపు విస్పష్టముగా లేదు. అచ్చటినుండి చూడఁగా రాణి గది యొక్క పడమటిగోడకు పైభాగమున నదేయెత్తున గవాక్షమున్నది. ఆ లోపల సమృద్ధిగా వెలుతురున్నది. తన నిచ్చెన యా గవాక్షమున కానించి చూడవలయునన్నచో తన నిచ్చెన సరిగా జయద్రథుని గది కవాటమున కెదురుగా నుండును. అది యెట్లు సాధ్యమగును? అతఁడు గవాక్షము లోనికి దూరి గది లోతట్టునఁ జూచెను. కనులు పొడుచుకొని చూచెను. చూడఁగా చూడఁగా గోడ కానుకొని యేదో యున్నట్లు కనిపించెను. అది తన తండ్రి కావచ్చును. అతఁడు దేనికొఱకో ప్రతీక్షించుచున్నాఁడు. అతనికొక యూహ తోచినది. రాణిని పులిని చేయవలయునుగదా? తన గదిలో ముగ్గు వేసినాఁడు. రాణినిఁ దీసికొనివచ్చి యందులోఁ దొరలించవలయును. ఎందుకు చేయఁడు? రాణి పులి యైనచో రాజుయొక్క గది దక్షిణ ద్వారము తెఱచియున్నది అంత నిశ్శబ్దముగా నుండదు. సాహసించి నిచ్చెన రాణి గది గవాక్షమునకు వేసెను. ఎక్కెను. చూచెను. అతని కాశ్చర్యము వేసెను. రాణి గదిలో

నింకొక పులిముగ్గుండెను. రాణి ప్రక్క కూరుచుండి యుండెను. ఆమె యేదియో యాలోచించుచుండెను. రాజు గదిలోనికి పోవు త్రోవ తెఱచియుండెను. రెండవ పులిముగ్గు లెందుకు? అతని కర్థముకాలేదు. అట్లే నిలుచుండి చూడ రాదు. తన తండ్రి ద్వారమువద్దకు వచ్చినచో తన నిచ్చె నయుఁ దానును కనిపింతురు. అతఁడు దిగి వచ్చెను. నిచ్చెన నచటినుండి తొలఁగించెను. ఏమి చేయవలయునో తోఁచ లేదు. తానున్న గదిలోనుండి రాణి గదిలోనికిఁ బోవు ద్వారమును త్రోసి చూచినచో? అట్లు చేయుటకు వీలు లేదు. రాణి మేల్కనియున్నది. లోన పెద్ద వెలుతురున్నది. ఆ తలుపు లోన గడియవేసియున్నదా? త్రోసినచో వచ్చునా? త్రోసి చూచుటకు వీలులేదు. ఏమిచేయవలయును? తానున్న గదికి తండ్రియున్న గదికి నడుమనున్న గోడయొక్క పైభాగ మున గవాక్షము నంటి తాను తడుముచుండగా నొక బల్ల వంటిది కనిపించెను. గోడలోనుండి మేకులువేసి యా బల్లను వేసిరి. దానిమీఁదఁ దాను పండుకొన్నచో నిచ్చెనను పైకిలాగి తనవద్ద నుంచికొన్నచోఁ దనయునికి యెవ్వరికినిఁ దెలియదు. అతఁడు బహు ప్రయత్నముమీఁద నెంతయో శ్రద్ధగా నతని యిష్టదైవముయొక్క యనుగ్రహవశమున — ఆ యిష్టదైవ మెంత దొడ్డయో, ఆ దైవము బ్రతికియుండఁగా నిట్టి పను లెన్ని చేసెనో—ఆ చెక్కమీఁదఁ బండుకొనెను. నిచ్చెనను పైకి లాగికొనెను. దానిని భద్రముగాఁ బట్టికొనెను.

ప్రతీక్షించుచుండెను. అంతలో ననేకములైన కార్యములు పరమశీఘ్రముగా సంభవించుట యారంభించెను. రాణి గదిలోనుండి పెద్దపులి గుఱ్ఱు వినఁబడ నారంభించెను. — రాణి పెద్దపులి యైనది. — తన తండ్రి గదిలో తండ్రిలేచి కూర్చున్నట్లు తోచెను. ఇతఁడు గవాక్షము నుండి తొంగిచూచెను. ఏమిజరుగునోయని యతఁడు ప్రతీక్షించుచుండెను. రాణియొక్క గుఱ్ఱు కొంతసేపటికి, రాజు గదిలోనికిఁ బోయినది. ఇంతలోఁ దనతండ్రి తానున్న గదిలోనికి వచ్చెను. రాణి గదితలుపు త్రోసెను. రాణి గదిలోనికిఁ బోయెను. రాణి గదినుండి రాజు గదిలోనికి పోవుత్రోవ మూసినట్లుండెను. అతఁడేమి చేయుచున్నాఁడో తెలియలేదు. ఇతఁడు తాను బంధుకొనియున్న బల్లమీఁది నుండి రాణి గదిగోడలోని గవాక్షములోనుండి చూచుటకుఁ బ్రయత్నించెను. ఎవనిశరీరము పాముపలె మెలికలు తిరుగునో వాఁడు చేయవలసినపని యది. చిన్న జయద్రథుఁడు తన శరీరమును చూచికొని యా గవాక్షపుటంచు పట్టికొని మేను సాచి లోనికిఁ జూచుచుండెను. తండ్రి లోన నేమి చేయుచున్నాఁడు. ఆముగ్గును చెఱిపివేసినాఁడు. దీని కర్థ మేమి? రాణి పులిగానే యుండిపోవలయును. తాను మఱల రాణి కాఁజాలదు. రాణి నిట్లుమోసముచేయుట యెందులకు? ఎందులకో తెలియలేదు. అతని తండ్రి నడిమితలుపును మఱల తెఱచెను. తాను శీఘ్రముగా తానున్న గదిలోనికి వచ్చెను. రాణి గదితలుపులు తెఱచియేయుంచెను. తన

గదిలోనికి తాను పోయెను. లోన గడియవేసికొనెను. ఇప్పుడు తెలిసినది. రాణి రాజును చంపినచో చంపును. చంపదా? తన వ్యాఘ్ర ప్రకృతి రాజ భవనమునుండి వెడలిపోవలె ననిపించును. వెళ్ళినచో రాజుయొక్క గదిలోనుండి దక్షిణ దిశగా పోవచ్చును. లేనిచో తానున్న గదిలోనుండి పడమటి దిక్కుగా వెలికిఁ బోవచ్చును. పులిగానైన యామె వెడలి పోయినఁగాని జయద్రథుఁడు తనతలుపు తెఱవఁడు. రాణి యొక్కగుఱ్ఱు రాజు గదిలో వినిపించుచుండెను. తన గది లోనికి వచ్చెను. ఇతఁ డున్న గదిలోనికి వచ్చెను. ఇంచు మించుగా నరజాము సేపు పులియైనరాణి తిరుగుచునేయుండెను. రాజును వధించినట్లులేదు. పులియైన తరువాతఁ బూర్వజ్ఞాన ముండును కాఁబోలు? భర్తను చంపలేదు. చివర కాపులి వెడలిపోయెను. ఇతఁడు తాను రాణిగదిలో చూచెడిదేమియు లేదు. నెమ్మదిగా నట్టే శరీరమును వెనుకకు లాగికొని తండ్రి గదిలోనికిఁ జూడ నారంభించెను. తండ్రి యేమి చేయుచుండెను. దీపమును పెద్దది చేసెను. తనగదిలోనుండి రాజు గదిలోనికి పోయెడి తలుపుగడియ తీసెను. అతనిగదిలో నుండి తానున్న గదిలోనికి వచ్చెడు తలుపుతీసెను. తాను ముగ్గులోఁ బండుకొనెను. అప్పుడు చిన్నజయద్రథుఁ డొక యాశ్చర్యమును చూచెను. అది యిట్లుండెనని, యిట్లు జరుగుచున్నదని కనులకుఁ దెలిసెనుగాని మనస్సునకుఁ దెలియలేదు. ఏమిజరిగినది? ఒక తల్లియొక్క గర్భములో శిశువు తొమ్మిదినెలలు పెరుగును. తొమ్మిదినెలలలో

జరిగెను మార్పంతయు రెండు నిమేషములలో జరిగినచో నా స్త్రీయొక్క గర్భకోశమునఁజూచి యీ మార్పిట్లు జరిగిన దని గ్రహించఁగలవాఁ డెవ్వఁడు? అదిచూచి గ్రహించెడి శక్తి యే కన్నులకుండును? ఏదో జరిగినది. ఏమి జరిగినదో తెలియదు. అది జరిగినంతసేపు తన కనులుమాత్రము తెఱచుకొనియే యున్నవి. అదిచూచిన కన్నులు గ్రుడ్డివికావలయును. వాని వెనుకనున్న మనస్సు పిచ్చిది కావలయును. కాని చిన్న జయద్రథుని కన్నులు గ్రుడ్డివికాలేదు. వాఁడు పిచ్చివాఁడు కాలేదు. ఎందుచేతనో తెలియదు. తొంబదితొమ్మిదిలక్షల డెబ్బదియైదువేల వాని జపము వానినాదు కొన్నది కావలయును. తండ్రియైన పులి తనగదిలోనికి వచ్చెను. రాణి గదిలోనికిఁ బోయెను. అచ్చటినుండి యాపులి రాజుగదిలోనికిఁ బోయినట్లు తెలిసెను. చిన్న జయద్రథుఁడు తానేమి చేయుచున్నాఁడో తెలియదు. ఆచేయుట కెంతసేపు పట్టినదో తెలియదు. నిచ్చెన దింపినాఁడు. దిగినాఁడు. ముందర తండ్రిగదిలోనికిఁ బోయినాఁడు. రాజుగదిలోనికిఁబోవు తలుపు గడియబిగించినాఁడు. తండ్రిగదిలోని పులిముగ్గును నాశనము చేసినాఁడు. తాను నిరాయుధుఁడు. తండ్రిగదిలో పీలుగా నొకఖడ్గము కనిపించినది. ఆ ఖడ్గమునుఁ జేతితో పుచ్చుకొన్నాఁడు. తానెంతతొందరగా నడచెనో తెలియదు. ఆ గదులలోనుండి బయటకు వచ్చినాఁడు. పనువెత్తినాఁడు. చంద్రరేఖయుండు గదిలోనికిఁ జొచ్చినాఁడు. లోన గడియ వేసికొన్నాఁడు. అప్పుడు

తోఁచినది. సీసీ! యేమిపని చేసితిని? అయ్యో! అతఁడు రాజును సంహరించును. తాను కత్తితో రాజున్న గదిలోనికిఁ బోలేదు. పోయి యేమిచేయును? తండ్రిని సంహరించునా? రాజు చావకుండ చూడవచ్చునే. రాజు ప్రాణములు రక్షించుటకు తాను తండ్రిని సంహరించుటయో తండ్రిచేత తాను మడియుటయో తప్పదే. ఇంతకు నా యూహ యతనికి తోఁచలేదే. తాను మఱల బయటకుఁ బోయినచో నేమగును?— ఇంతలో నొక మహాభయ నినాదము తన్మృగయాభవన వియన్మండలమున వినిపించెను. ఒక జీవి మరణవేళయందు మహాభయంకరమైన పరిస్థితిలో మరణించు సమయమునందు పెట్టిన పెద్దకేక. రాజు సంహరింపఁబడెను. పరిచారకు లందఱు లేచిరి. గుబ్బిసలాడుచుండిరి. పాతిక దివ్వటీలు వెలిఁగింపఁబడెను. పులియైన జయద్రథుఁడు రాజును సంహరించెను. అచ్చటినుండియే తన గదిలోనికిఁ బోవలయునని ప్రయత్నించెను. ఆ గది తలుపు లోన మూయఁబడి యుండెను. ఎట్లో తెలియలేదు. రాణి గదిలోనికి వచ్చెను. ఆ గదిలోనుండి ఇప్పటివఱకు చిన్న జయద్రథుఁడున్న గదిలోనికి వచ్చెను. అచటి నుండి తన గదిలోనికి వెళ్లెను. తన పులిముగ్గంతయు చెఱుపఁబడి యుండెను. ఇది యెవఁడుచేసెను? తాను రాణిని నిత్యవ్యాఘ్రముగాఁ జేసెను. ఇం కెవఁడో తన్నుఁగూడ నిత్యవ్యాఘ్రముగాఁ జేసినాఁడు. వాఁ డెవఁడు? పులిగానున్న తన మనసునకుఁ దెలియుటలేదు. అయ్యో! మానవుని మెదడులో

నున్న మనస్సునకు, జంతువుయొక్క మెదడులోనున్న మనస్సునకు నెంతభేద మున్నది? అప్పుడా వ్యాఘ్రరూపముననున్న జయద్రథుని శార్దూలకంఠబిలమునుండి యొకపరమదుఃఖసూచి గర్జామహాధ్వానము వెలువడెను. ఒకానొకపులి హఠాత్తుగాఁ దనపైన నొక మహాశిల బడినచో మరణించుచుఁ బెట్టిన కేక యెట్లుండెనో యాకేక యట్లుండెను. ఆ పులి నాల్గు గదుల యందు తిరిగి తిరిగి శీఘ్ర శీఘ్రముగాఁ దిరిగెను. ఈ మహా వ్యాఘ్రగర్జ పరిచారకుల కందఱకు వినిపించెను. అందఱును భయపడిపోవుచుండిరి. రాజున్న ప్రదేశమునకుఁ బోవలయునో పోరాదో దెలియలేదు. చిన్న జయద్రథున కొక్క యూహ పుట్టెను. తానేమిచేసెనో యది చేసెను. దానిని పూర్తిగాఁ జేయవలయును. ఏమైననుసరే. తాను పితృవధమును చేయుటలేదు. తండ్రినైనను శిక్షించవచ్చును. అతఁడు చేసినపని కతఁ డనుభవించి తీఱవలయును. పరిచారకులందఱు గుమికూడియుండిరి. వారిలోఁ దోహాఱు కనిపించెను. తోహారు చేయి పట్టుకొని దూరముగాఁ దీసికొని వెళ్ళెను. అతని చేయి వదలకుండగనే చిన్న జయద్రథుఁడు మహారణ్యములోఁ బరువెత్త నారంభించెను. ఇద్దఱుఁగలిసి యామడదూరము పాతిక నిమేషములలోఁ బరువెత్తిరి. చెఱువునొద్దకుఁ బోయిరి. నీటిలో దిగిరి. రెండు చెట్ల నడిమి తెప్పకొయ్య శాతకర్ణి బయటకు లాగెను. ఇద్దఱు దానిమీఁద నెక్కిరి. చేతులతోఁ గాళ్ళతోఁ ద్రోసికొని పోవుచుండిరి. అది యెంత వేగముగాఁ బోవుచున్నది. ఒక

పులి దానిమీఁదనెక్కి ముంగాళ్ళతో జలమును త్రోసినపుడే అంత వేగముగా పోయిన యా తెప్పకొయ్య ఇప్పు డిద్దఱు మనుష్యు లెక్కి పెద్ద పెద్ద చేతులతో నీటిని వెనుకకు గుంజి నపుడు పదిరెట్లెక్కువ వేగముగా నేఁగుచుండెను. వాగు మొగమువద్దకు వచ్చిరి. వాగులోఁ జొరఁబడిరి. తెప్ప కొయ్యను వాగున కెదురుగాఁ దీసికొనిపోవుట కష్టసాధ్యము. ఇద్దఱును దిగిరి. వాగు నొడ్డుపట్టిరి. ఆ త్రోవ తెలిసినదికాదు. కాని వాగును గుర్తుపెట్టికొనుచు భగవంతుఁ డిచ్చినంత వేగముతోఁ బోసాగిరి. ఆ గుహావద్దకుఁ జేరిరి. జయద్రథుఁడు లోనికిఁ బోయెను. అచటఁ బులిముగ్గు వేయఁబడియుండెను అట్లుండెనని యతఁ డనుకొనెను. అట్లే యుండెను. అతఁడా ముగ్గునంతయుఁ గాళ్ళతోఁ జెరిపివేసెను. చేతులతో ముట్టు కొన్నచో నేమగునో ? కాళ్ళతోడనే యా శబలవర్ణ ధూళి నంతయు పూర్వపు త్రోవుతోఁ గలిపెను. ఇద్దఱును గుహా ముఖమునకు వచ్చిరి సూర్యకాంతులు ప్రాక్పర్వతో పరి భాగమును చుంబించుచుండెను. దూరమునుండి వ్యాఘ్రగర్జ వినిపించెను. ఆతఁడు వచ్చుచున్నాఁడు. ఇంతలో మఱియొక వ్యాఘ్రగర్జ వినిపించెను. ఇది యెక్కడిది ?. రెండవ వ్యాఘ్రముయొక్కగర్జ. ఇద్దఱును గుహాముఖమున కెదురుగా జలపాతము కట్టిన వెడల్పైన ప్రవాహమున కావలి గట్టున నున్న యొకమహావృక్షముకడకుఁ బరువెత్తుకొంచుఁ బోయిరి. ఆ చెట్టుమీఁద నెక్కిరి. అచటినుండి గుహాముఖమువంకఁ జూచిరి. రెండుపులులు పోరాడుచున్నవి. తోహారిది యేమి

యని యడిగెను. జయద్రథుఁ డిట్లు చెప్పెను. అందులో నొక పులి ముసలిది. పెద్దది. మగది. రెండవది వయసులో నున్నది. ఆడుపులి. ఆ బక్కచిక్కిన పులి యెవరో నీవే గ్రహించవలయును. రెండవపులి రాజుభార్య. — తీవ్ర ఘుండరీక గర్జా మహాభయంకర నినాదముచేత నడవి యంతయు దద్దరిల్లి పోవుచుండెను. ఆ పోరాటము సూర్యుఁడు నడిమింటఁ జేరువఱకు నట్లే సాగుచుండెను. చివరకు రెండు పులులును చనిపోయెను. రెండును చనిపోవుటకు ప్రొద్దు గ్రుంకవలసివచ్చెను. ఇద్దఱును చెట్టు దిగిరి. రాత్రి అచటనే యుండవలసివచ్చెను. మఱునాఁటి ప్రొద్దున కలసియే చెఱువు దాటి యెవరి దారిని వారు పోయిరి.

చంద్రరేఖ సంగతి పరమేశ్వరునకే పట్టలేదు.

తొమ్మిదవ నవల—త్వరలో!

264

# పురాణవైర గ్రంథమాల

(పదునారు సంపుటములు)

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిచే

| | | | |
|---|---|---|---|
| 1. | భగవంతునిమీద పగ | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషన్ | 5—00 |
| 2. | నాస్తికధూమము | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 3. | ధూమరేఖ | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 4. | నందోరాజాభవిష్యతి | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 5. | చంద్రగుప్తుని స్వప్నము | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 6. | అశ్వమేధము | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 7. | అమృతవల్లి | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |
| 8. | పులిముగ్గు | సాదా | 4—00 |
| | ,, | లైబ్రరీఎడిషను | 5—00 |

పురాణవైర గ్రంథమాలలోని మిగతా 8 నవలలు త్వరలో వెలువడును.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B155 |
| పుస్తకం పేరు | పులిమ్రుగ్గు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 271 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |